## సంకలన కర్త

కల్నల్ వేలూరి అన్నప్ప శాస్త్రి (ఉద్యోగము విరమించిన) 1943లో భీమవరము (ప.గో. జిల్లా, ఆం.ప్ర.) పూర్వాచారపరాయణ పరివారములో పుట్టినారు. 1968లో భారతదేశ సైన్యములో అధికారిగా చేరి, 1971లో భారత్ - పాకిస్తాన్ మధ్య యుద్ధములో జమ్ము - కాశ్మీర్ రంగములో పాల్గొన్నారు. ఆయని ఆదర్శప్రాయమైన ప్రవర్తన, ప్రశంసాయోగ్యమైన సేవకు మెచ్చి 1988లో జనరల్ కె. సుందర్జీ, ముఖ్య సేనాధికారి ద్వారా సేనాధికారి ప్రశంసలు అందుకున్నారు. 1992లో కల్నల్ పదోన్నతి పొంది, రెండు సంస్థలు ఆధిపత్యము వహించి, 1996లో పదవీ విరమణ చేసినారు. ఆయన సికిందరాబాదులో స్థిరపడి ప్రశాంతమైన జీవితము గడుపుతున్నారు. ఆయన అత్యభిరుచులు, ఆధ్యాత్మిక, చారిత్రక, ప్రాకృతిక, భౌగోళిక, విజ్ఞానశాస్త్ర గ్రంథ పఠణము. ఆయనకు ప్రకృతిపై ప్రేమ, దురదృష్టవంతులు, క్రిమికీటకములపై పరితాపము ఉంటుంది. ఆయన తన ఆధ్యాత్మిక అభివృద్ధికై నిరంతరమూ కృషి చేస్తున్నారు.

ఆయనకు 1972లో కుమారి శాంతతో వివాహము అయినది. ఆయని భార్య శ్రీమతి శాంత గృహములో ఆధ్యాత్మిక అభివృద్ధికి ఆయనతో తోడ్పడుతూ, ప్రశాంతమైన వాతావరణము కల్పిస్తారు. వారిద్దరికీ ఇద్దరు కుమార్తెలు. ఈ దంపతులు వారిద్దరి కుమార్తెలకు 1999, 2000లలో వివాహము చేసినారు. వారి కుమార్తెలు వారి, వారి భర్తలతో ఆమెరికాలో స్థిరపడినారు. ఆయన పలు విదేశములు పర్యటించి అక్కడి ప్రజలతో పలు ఆధ్యాత్మిక, నైతిక, సామాజిక విషయములు చర్చించినారు.

హిందు ధర్మ సారాంశము

# హిందు ధర్మ సారాంశము

పరమాత్ముని కృప

భక్తి యోగము

జ్ఞాన యోగము

కర్మ యోగము
(స్వర్గము)

మాయ

మానవుడు

ప్రకృతి యొక్క గుణములు

(నరకము)
కర్మ యోగము

ఆత్మ జ్ఞానము

బ్రహ్మ జ్ఞానము

పరమాత్ముని కృప

సంకలనము

వేలూరి అన్నప్ప శాస్త్రి

# హిందూ ధర్మ సారాంశము



**ఓం శ్రీ మహా గణాధిపతియే నమః**

సంకలనము
వేలూరి అన్నప్ప శాస్త్రి


చిరునామా:
Address:
Col. V.A.Sastry (Retd.)
Flat No.102; G. K's Crescendo;
Plot Nos. 558 & 559; Defence Colony
Sainikpuri (P.O.)
Secunderabad – 500 094 (A.P.)
Tele Nos.:91-40- 27116277 (Res), 91-94406 57704 (Mobile)
E-mail: velursastry@gmail.com

మొదటి ముద్రణ
2016

**గమనిక:**

1. ఈ పుస్తకములో అనేక సంస్కృతము మరియు భారతీయ భాషా పదములు వ్రాయబడి ఉన్నవి. వీటిలో ఏమయినా తప్పులు ఉన్నట్లయితే పాఠకులు నన్ను క్షమించి మరియు, వీలయితే వీటిలోని తప్పుల వివరములు, సలహాలను పంపమని కోరుతున్నాను. నేను వాటిని సరి చేయుటకు ప్రయత్నిస్తాను.

2. సాధ్యమైనంతవరకు సంబంధిత సూచనలు పేర్కొనబడి ఉన్నవి.

3. ఈ పుస్తకములో హిందూ ధర్మ పవిత్ర మూలగ్రంథములలోని కొన్ని సంస్కృత మంత్రములు వ్రాయబడినవి. భగవంతుని అనుగ్రహము కలిగిన మహర్షులు బీజాక్షరములలో వారి తపశక్తిని నిక్షిప్తపరచి (అప్పుడే అవి శక్తివంతమైన మంత్రములు అగును) ప్రజలకు అందచేసినారు. నేను వ్రాసిన అవే పదములు కేవలము అక్షరములే తప్ప శక్తిగల మంత్రములు కాజాలవు.

4. బృహదారణ్యకో పనిషత్ యొక్క మొదటి రెండు అధ్యాయములు అనేక పుస్తకములలో ప్రచురింపబడలేదు. కొన్ని పుస్తకములలో మొదటి అధ్యాయము మూడవ అధ్యాయముగా వ్రాయబడి ఉన్నది. కాబట్టి అధ్యాయముల సంఖ్యలు వివిధ పుస్తకాల మధ్య తేడా ఉండవచ్చు.


వద్ద ప్రచురితమైనది:



**మాతృ దేవో భవ పితృ దేవో భవ**

నేను ఈ పుస్తకమును

నా తల్లి (దివంగత) వేలూరి సుబ్బమ్మ

మరియు

నా తండ్రి (దివంగత) వేలూరి సోమేశ్వర రావులకు

అంకితము చేయుచున్నాను



**వ్యాసాయ విష్ణు రూపాయ వ్యాస రూపాయ విష్ణవే**
**నమో వై బ్రహ్మ నిధయే వాసిష్ఠాయ నమో నమః**

(నేను వ్యాస రూపములో ఉన్న విష్ణువునకు, విష్ణువు రూపములో ఉన్న వ్యాసునకు సాష్టాంగ నమస్కారములు చేయుచున్నాను. భగవాన్ వ్యాసుడు ఎవరో కాదు వసిష్ఠ అని పిలుస్తారు. బ్రహ్మవిద్యా స్వరూపులుగా ఉన్న వ్యాసునకు నేను సాష్టాంగ నమస్కారములు చేయుచున్నాను)



# ఓం శ్రీ మాత్రేయ నమః

## విన్నపము

హిందూ ధర్మము అనంతము మరియు మానవ బుద్ధికి అతీతము. హిందూ ధర్మము అర్ధము చేసుకునేందుకు సంపూర్ణ విశ్వాసము, భక్తి మరియు పరబ్రహ్మము (పరమాత్మ) యొక్క అనుగ్రహము అత్యవసరము. నేను (ఖచ్చితమైన అవగాహన, అర్ధము మరియు అన్వయనము యొక్క అర్హత లేకుండా) ఇప్పటి వరకు సేకరించిన స్వల్ప సమాచారమును వ్రాయుటకు, నేను చేసిన ఒక సాహసోపేత ప్రయత్నము. మరింత అభివృద్ధి కోసము, నేను మీ విలువైన మార్గదర్శకత్వము కోరుతున్నాను. హిందూ ధర్మము కొంతమంది హిందువులకు అస్పష్టముగాను, అయోమయముగాను మరియు అనుమానములు కలిగి ఉన్న విషయము వాస్తవము. నేను ఆసక్తికల వ్యక్తులకు హిందూ ధర్మము మీద ప్రాథమిక సమాచారము అందించుటకు ప్రయత్నిస్తున్నాను. ఈ పుస్తకము యొక్క లక్ష్యము తెలిసిన వారికి జ్ఞప్తికి తెచ్చుకొనుట కోసమూ మరియు తెలియని వారికి మార్గదర్శకత్వము కోసమూ ఈ పుస్తకము ద్వారా సమాచారము అందిస్తున్నాను. మీరు కూడా మీ సలహాలు, సూచనలు మరియు మరింత అభివృద్ధి కోసము వ్యాఖ్యలు పంపమని అభ్యర్ధిస్తున్నాను.

వేలూరి అన్నప్ప శాస్త్రి



# ఓం తత్ సత్

## అర్థము:

- **ఓం:** ఓం ప్రణవము. నిర్గుణ బ్రహ్మతత్త్వము. సృష్టి ఆరంభములో మొదటి శబ్దము. ప్రణవము నుండి గాయత్రి మంత్రము వచ్చినది. గాయత్రి మంత్రము నుండి మూడు వేదములు (ఋగ్వేదము, సామవేదము మరియు యజుర్వేదము) వెల్లడైనవి. కాబట్టి ఓం సృష్టి, గాయత్రి మంత్రము మరియు వేదములకు మూలము.
- **తత్:** తత్ అనగా అది. దూరముగా ఉన్నదానిని మరియు అదృశ్యముగా ఉన్నదానిని సూచిస్తూ, పరమాత్ముడు లేదా ఈశ్వరుని మీద విశ్వాసము మరియు నమ్మకము కలిగి ఉండుట (భగవద్గీత 17 : 15). అన్ని చర్యలు, ఏమి ఆశించకుండా, పరమాత్మను సంతృప్తి పరిచేందుకు చేయవలెను. ఈ ప్రపంచము లోని అన్ని వస్తువులు పరమాత్మునిచే సృష్టింపబడినవే. అందుచే అన్ని వస్తువులు పరమాత్మునివే. పరమాత్ముని కొరకే చేసే పనుల వలన, జీవాత్మని పవిత్రపరిచి పరమాత్ముని కృపచే జీవాత్మకు బ్రహ్మజ్ఞానము మరియు మోక్షము ప్రాప్తించును.
- **సత్:** సత్ అనగా సత్యము లేదా యదార్థము. సత్ సత్యమైన, సంపూర్ణమైన, సత్పురుషుడు మరియు పరమాత్ముడు అనే అర్థములో వాడుతారు. సత్ అనగా (ఎ) యదార్థము, (బి) మంచితనము, (సి) కీర్తినీయము, (డి) ప్రసిద్ధ స్వభావము, (ఇ) దృఢత్వముచే ధృతి మరియు (ఎఫ్) గౌరవము మరియు విశ్వాసము. (భగవద్గీత 17 : 23 నుండి 27 వరకు, మహానిర్వాణ తంత్రము 14 : 154 మరియు 155).

# ఉపోద్ఘాతము

ఈ పుస్తకములో హిందూ ధర్మము యొక్క ప్రతి అంశము, వేదముల నుండి మోక్షము వరకూ, విశదపరచబడినది. వివిధ పుస్తకముల నుండి నేను హిందూ ధర్మము గురించి సేకరించిన సమాచారము ఈ పుస్తకములో సంకలనము చేసి వాటిని పొందుపరిచినాను. హిందూ ధర్మము గురించి ప్రాథమిక విజ్ఞానమును పొందుటకు, సాధారణ వ్యక్తుల కోసము, సాధారణ మరియు సంక్షిప్తమైన రూపములో వ్రాయుటకు నా ఉత్తమ ప్రయత్నము చేసినాను. చాలా మందికి హిందూ దేశము, హిందువులు లేదా హిందూ ధర్మము అనే పదములముపై అస్పష్టత ఉన్నది. హిందూ ధర్మ పవిత్ర గ్రంధములలో అటువంటి పదములే లేవు. హిందూ ధర్మమునకు అసలైన పేరు **ధర్మము** (అనగా హిందూ ధర్మ పవిత్ర గ్రంధములు ప్రకారము సృష్టి క్రమమును అనుసరించి '**చేయదగిన పనులు ధర్మము**' **గాను,** '**చేయకూడని పనులు అధర్మము**' గాను నిర్ణయింపబడినవి. ఇవి న్యాయబద్ధముగా పూర్తి మానవత్వమునకు వర్తించును). ధర్మము సృష్టి ప్రారంభములో ఉనికిలోనికి వచ్చినది కనుక అది **సనాతన ధర్మము** (శాశ్వతమైనది లేదా పురాతనమైనది) గా పరిగణింపబడుతున్నది. సనాతన ధర్మములో అత్యంత ముఖ్యమైన అంశము '**సత్యస్య సత్య**' (సంపూర్ణమైన లేదా అంతిమ సత్యము) (మైత్రేయోప నిషత్ 6 : 32). ప్రతి ఒక్కరూ తమకుతాము ధర్మముగా ఉండవలెనని గ్రహించవలెను. వారి అహంకారమును, (అనగా "**నేను**" అనగా జీవాత్మను శరీరముతోనూ మరియు "**నాది**" అనగా జీవాత్మను ప్రపంచము లేదా ప్రపంచపు వస్తువులతోనూ ముడిపెట్టి భావించుట), కోరికలను నియంత్రించుట మరియు పరబ్రహ్మమునకు లేదా పరమాత్మకు తమకుతాము పూర్తిగా

సమర్పణ చేసుకొనుట. పరబ్రహ్మము లేదా పరమాత్ముడు ఒక్కడే యదార్థము. **"బ్రహ్మం సత్య జగత్ మిధ్య"** అనగా, బ్రహ్మము మాత్రమే సత్యము. ప్రపంచము ఒక మహామాయ లేదా భ్రమ (నిరాలంబ ఉపనిషత్ - 11). జీవాత్మకు, పరబ్రహ్మము కంటే వేరే ప్రత్యేక పరిధి లేదు. జీవాత్మ పరబ్రహ్మము స్వరూపమే. అందరు అర్థము చేసుకునేందుకు, తప్పనిసరి పరిస్థితులలో, నేను **"భారత దేశము"** (భాగవతము 11 : 2 : 15, 16) బదులు ఇండియ, **"భారతీయులు"** బదులు ఇండియన్స్, **"సనాతన ధర్మము"** బదులు హిందూ ధర్మము లేదా హిందువులు అనే పదములను వాడుతున్నందుకు మన్నించమని కోరుతున్నాను. చాలమంది హిందువులు, హిందూ ధర్మము అనగా సంప్రదాయమైన పూజలు చేయుట, ఆలయములు, పవిత్ర మరియు పుణ్య స్థలములు సందర్శించుట, పవిత్రమయిన నదులలో స్నానము చేయుట, సన్న్యాసము స్వీకరించుట మాత్రమే అని అనుకుంటారు. చాలామంది హిందువులు వారి హిందూ ధర్మమును మరియు వారి ధర్మ ఆచారములను సరిఅయిన మార్గములో గుర్తించక మరియు వాటి గురించి పూర్తిగా అవగాహనము లేక, వాటి అర్థము తెలియక గుడ్డిగా ఇతరులను అనుసరించుతారు. ఎక్కువమంది హిందువులు వేదములు, ఉపనిషత్తులు, పురాణములు, ఇతిహాసములు మరియు శ్రీమద్ భగవద్గీత చదవకుండా, లేక వాటిలోని అంతరార్థములను మరియు సత్యములను గ్రహించకుండా, హిందూ ధర్మము కల్పన మరియు అవాస్తవము అని ప్రచారములోనికి తెచ్చారు. ఎక్కువ మంది హిందువులు తమ స్వంత ధర్మము గురించి వారి అజ్ఞానమును అంగీకరించక, హిందూ ధర్మ పవిత్ర గ్రంధములు సంస్కృత భాషలో ఉన్నాయని, సంస్కృత భాష వారికి తెలియదు కాబట్టి వాటిని చదువలేమని (హిందూ ధర్మ పవిత్ర గ్రంధములు

చాలా భారతీయ వివిధ ప్రాంతీయ భాషలలోనూ మరియు విదేశీ భాషలలోనూ అనువదించబడి, అత్యంత సులభముగా అందుబాటులో ఉన్నప్పటికీ), లేదా హిందూ ధర్మము గురువులు, బ్రాహ్మణులు వారికి బోధించలేదని, లేదా వారి తాతలు, తల్లిదండ్రులు వారికి తెలియజేయలేదని ఆరోపిస్తారు. కానీ నిజానికి వారు ఏనాడయినా వారి ధర్మము గురించి తెలుసుకునేందుకు నిజాయతీగా ప్రయత్నము చేయలేదని అంగీకరించరు. నా ఉద్దేశము ఒకరిని విమర్శించుటకు లేదా తప్పుపట్టేందుకు కాదు. నేను చాలమందితో చర్చించిన సమయములలో ఈవిధమయిన సమాధానములు మరియు భావములు వెల్లడించారు. అందుకు నాలోపల నాకు భగవత్ ప్రేరణ కలిగి ఆప్రేరణ, భగవంతుని కృపతో ఈ పుస్తకము వ్రాసి, ప్రచురణకు ఒక ఉపకరణము మాత్రమే.

అన్ని ప్రాణులు (మానవులు కూడా) శాంతియుతముగానూ ఆనందముగానూ ఉండుటకు ఆశిస్తారు. అందరూ, ఆనందము కొఱకు చర్యలు లేక పనులు చేస్తారు. అయినప్పటికీ చాలా మందికి **నిత్యమైన, అపరిమితమైన, దైవ సంబంధమైన పరమానందము** అనుభవము కలుగదు మరియు వారి కష్టములు / బాధలు అంతము కావు (శ్రీమద్ భాగవతము మహా పురాణము 3 : 5 : 2). ప్రాణులు రెండు శక్తివంతమైన ప్రేరణములకు ఆకర్షింప బడతారు - (ఏ) **<u>కోరికలు:</u>** ఇవి అనంతమైనవి ఎప్పుడూ తీరనివి. ప్రపంచపు వస్తువుల సేకరణకు దారితీస్తుంది. (బి) **ఇంద్రియములకు సంబంధించిన ఆనందము**: ఇవి తాత్కాలికము మరియు పరిమితము. చాలమంది ఈ ప్రేరణలలో పడి, వారి జీవితకాలము అంతా వీటి కోసమే వృధా చేస్తూ వారి జీవితముఖ్య లక్ష్యమయిన మోక్షము (నిత్యమైన, అపరిమితమైన, దైవ సంబంధమైన పరమానందము

అనుభవము) మర్చిపోతారు. హిందూ ధర్మములో ఈ ఇంద్రియముల ప్రేరణములను తగ్గించి, వీటిని వశపరచుకునేందుకు, ఈ బలహీనతలను దాటేందుకు మార్గములు సూచిస్తూ మరియు వారి వ్యక్తిత్వాన్ని మరల కూర్పు చేసుకుని, వారి జీవిత ముఖ్య లక్ష్యమయిన మోక్షము (నిత్యమైన, అపరిమితమైన, దైవ సంబంధమైన పరమానందము అనుభవము) పొందుటకు మార్గదర్శము సూచిస్తున్నది.

క్రీ. పూ. 326 నుండి మొదలు భారతదేశము యొక్క అపార సహజ ప్రకృతి సంపద సేకరణ కోసము పదేపదే గ్రీకులు, డచ్, పోర్చుగీస్, ఫ్రెంచ్, ముస్లిములు మరియు బ్రిటిష్ దేశీయులు భారత దేశమును ఆక్రమించారు. ముస్లిముల పాలనలో మరియు తరువాత బ్రిటీష్ వలసరాజ్య పాలనలో 13 వ శతాబ్దము నుండి, ఆ కాలము పాలకులు బలాత్కారము మరియు ప్రోత్సాహముల ద్వారా వారి వారి మతలమును మన దేశములో వ్యాప్తి చేశారు. కొన్ని పాశ్చాత్య దేశములు, తమ స్వార్థ ప్రయోజనముల కోసము, హిందూ ధర్మ పవిత్ర గ్రంధములు కల్పన మరియు తప్పుడు భావన అని ప్రచారములోనికి తెచ్చారు. 18 వ మరియు 19 వ శతాబ్దములలో బ్రిటిష్ దేశీయుల "తూర్పు భారతదేశము కంపెని" మరియు తరువాత బ్రిటిష్ పాలకులు, నిగూఢమైన ఉద్దేశ్యముతో, (భారతదేశములో అధిక జనాభా హిందూ ధర్మముపై ధృడమైన నమ్మకము కలిగి ఉండుటచే భారతీయులను విభజించి పాలించాలని వ్యూహముతో) హిందూ ధర్మమునూ మరియు సంస్కృతినీ వక్రీకరించే ప్రయత్నము చేశారు. మరియు హిందువులను తప్పుత్రోవ పట్టించి హిందువులను తెగలు తెగలుగా విభజించేందుకు, హిందువుల భారతీయుల రెండు ప్రధాన జాతుల (అనగా, ఆర్యులు మరియు ద్రావిడులు), వివిధ కులములు (అనగా, బ్రాహ్మణులు,

క్షత్రియులు, వైశ్యులు మరియు శూద్రులు) మరియు వివిధ ధర్మములు (అనగా, హిందువులు, ముస్లింలు మరియు క్రైస్తవులు మొదలైనవి) మధ్య విభాగములు సృష్టించి మరియు హిందూ ధర్మ మూల తత్వముల మీద వారి స్వంత కల్పిత సిద్ధాంతములు ప్రచురించి భారీ పరిమాణములో పంపిణీ చేశారు. ఈ ప్రచురణలు వలన (ఆ రోజులలో మూల హిందూ ధర్మ పవిత్ర గ్రంధములు పొందుటకు అరుదు కావటముతో) హిందువులు, భారతీయులు ప్రభావితము అయి ఆ కల్పిత సిద్ధాంతములను నమ్మటము ప్రారంభించారు. కొన్ని హిందూ ధర్మ సంస్థలు, రచయితలు కూడా ఆకల్పిత విధానములుగా వ్రాసిరి. వీటి మూలముగా అనేకమంది హిందువులు మరింత అయోమయ పరిస్థితులకు లోనయ్యారు. హిందూ ధర్మ ప్రచారము కోసము ఏ ఒక్క సంస్థ, అనేక ఇతర ధర్మముల వలె, వ్యాపించి హిందూ ధర్మములోనికి మార్చటము అనే పద్ధతి లేదు. (**<u>గమనిక:</u>** హిందూ ధర్మములో వ్యాప్తి లేదా మార్పిడిపై విశ్వాసము లేదు). ప్రతి ఒక్క జీవాత్మ పుట్టుక, మరణము మరియు పునర్జన్మ యొక్క ప్రయాణ చక్రము ద్వారా ఉన్నత ఆధ్యాత్మికతను అవగాహనము చేసుకొని, జీవాత్మ పరమాత్మునిలో ఐక్యత వరకు ఆ ప్రయాణము కొనసాగుతుందని హిందువులు భావిస్తారు. హిందూ ధర్మ బోధనలకు చాలా సంస్థలు ఉన్నప్పటికీ, ప్రతి ఒక్క సంస్థ ఇతర సంస్థలు నుండి స్వతంత్రముగా ఉండి మరియు వారి స్వంత వ్యక్తిగత విధముగా హిందూ ధర్మమును బోధిస్తారు. ఈ సంస్థలు ఎక్కువ తమ కార్యకలాపములు నిధులు ఆకర్షించుటకు, వ్యాపార అభివృద్ధికీ ఎక్కువ ప్రాధాన్యత ఇస్తున్నందు వలన వారి హిందూ ధర్మ బోధనలలో ప్రాధమిక ఆధ్యాత్మికత అంశము ప్రాధాన్యత కనిపించుట లేదు. కాల ప్రవాహములో హిందూ ధర్మ సంస్థల అనుచరుల మోజు ఎక్కువై హిందూ ధర్మములో విభజనలు ఏర్పడినవి. హిందూ ధర్మ పవిత్ర గ్రంధములు

మానవుల ఆధ్యాత్మిక అభివృద్ధి కొఱకు ప్రాధాన్యత ఇస్తుంది. కానీ హిందూ ధర్మము యొక్క ప్రస్తుత అనుచరులు, వారి హిందూ ధర్మ పవిత్ర గ్రంధముల యొక్క ఆధ్యాత్మిక అభివృద్ధి అంశము ప్రాధాన్యత మీద దృష్టి కోల్పోయి, సంప్రదాయములు, ఆచారములు, పండుగలు మరియు కుల వ్యవస్థ (ప్రస్తుతము అనుసరించే కుల విభజన పూర్తిగా తప్పుగా ఉన్నది) వంటి సామాజిక అంశములకు మరింత ప్రాముఖ్యత ఇస్తున్నారు. మరియు పాశ్చాత్య సంస్కృతి ప్రభావము, భౌతిక విలువల మోజు/ఆకర్షణ ఎక్కువై హిందూ ధర్మ విలువలు మరింత దిగజారి పోయినవి. ప్రస్తుత తరము హిందువులు, హిందూ ధర్మ విలువలు, సంస్కృతి, ఆచారములు, సంప్రదాయములు, సామాజిక మరియు గృహస్థుల పద్ధతులు తెలియక అయోమయ స్థితిలో ఉన్నారు. కొన్ని రాజకీయ పార్టీలు ఓట్ల కోసము, ఈ అయోమయములో ఉన్న హిందువులను ధర్మ పరమైన, ప్రాంతీయ పరమైన మరియు జాతి, కులపరమైన విభాగములు చేసి, వారి స్వంత ప్రయోజనములను లేక అవసరములను తీర్చుకుంటున్నారు. అయినప్పటికీ హిందూ ధర్మము, సనాతన ధర్మము (మానవత్వనకు శాశ్వతమై ధర్మము) అయినందున ఈ ఒత్తుడులను తట్టుకొని ముందుకు కొనసాగి పోయేందుకు సామర్ధ్యము ఉన్నది. కానీ కలి యుగ ధర్మము (ధర్మము ఎద్దుతో పోలుస్తారు. కలి యుగములో, నాలుగు పాదాలమీద నడవవలసిన ధర్మము, ఒక్క పాదముతోనే కుంటుతుంది) ప్రభావముతో సమాజములో అధర్మము శాతము ఎక్కువ ఉంటుంది. ఈ పుస్తకము యొక్క లక్ష్యము, హిందూ ధర్మము యొక్క సారాంశము, సాధారణ ప్రజలకు సులభముగా అర్ధము అయేలా సాధారణ భాషలో మరియు ప్రస్తుత తరము వారికి, ఈ విషయము కోసము, ఎక్కువ సమయము ఉండదు వారికి సంక్షిప్తముగా అందిస్తున్నాను. కొన్ని హిందువుల

సంప్రదాయములు, ఆచారములు, ప్రస్తుత జీవితములో ఆచరణకు సమయము ఉండనందువలన, వీలుకుదరక చెయలేని పరిస్థితులలో, వీలైనంత సవరించుకొని ఆచరించి మన సంప్రదాయములు, ఆచారములు కాపాడుకోవచ్చు. ప్రతీ ఒక్కరూ తమకు తాము ధర్మబద్ధముగా మరియు నిజాయితీగా ఉన్నట్లయితే సుఖశాంతులతో జీవించవచ్చు. నిజమైన హిందువులు **"సత్యస్య సత్య"** (అనగా సత్యమైన సత్యము) కోసము శోధిస్తారు మరియు నిర్ణయాత్మక ప్రశ్నలకు సమాధానముల కోసము వెంటపడతారు. "పరబ్రహ్మము (పరమాత్ముడు) ఎవరు? నేను ఎవరు? నా జీవితము అంతిమ ఉద్దేశ్యము/లక్ష్యము ఏమిటి? పరమాత్మను ఎలా తెలుసుకోవచ్చు? సత్యమైన సత్యము ఏమిటి? హిందూ ధర్మము యొక్క నిజమైన పరిశోధన, పరమాత్ముడు, నేను (ఆత్మ) మరియు ప్రకృతి (విశ్వము/ప్రపంచము) మీద మరియు జీవితము మీద, వాటి ప్రభావము మీద ఉంటుంది. హిందూ ధర్మము యొక్క అంతిమ లక్ష్యము పరమాత్ముని మరియు ఆత్మని ఆధ్యాత్మిక పద్ధతుల ద్వారా సంపూర్ణ అవగాహన చేసుకొనుట. హిందూ ధర్మము యొక్క గొప్ప ఋషులు (భూత, వర్తమాన మరియు భవిష్యత్తు కాలము గురించి తెలుసుకునే ప్రజ్ఞ కలిగి ఉండేవారు), దీర్ఘదర్శకులు మరియు నేరుగా వారి మనో శుద్ధితో, దైవ కృపతో పరమాత్ముడను, దైవ సత్యములను స్వయముగా చూసి, అనుభవజ్ఞులై మరియు ఆ అనుభవజ్ఞులైన ఋషుల ద్వారా తరము నుండి తర్వాత తరమునకు అప్పగించారు (పరంపర విద్య). ఒక విధముగా, ఎవరైతే వారి దైవత్వాన్ని అన్వేషించుటకు ప్రయత్నిస్తారో వారు అందరూ హిందూ ధర్మమును సాధన చేస్తున్నట్లే. ఎవరైతే వారి ఆత్మ, సంఘము మరియు మానవుల అందరి క్షేమము కోసము, స్మారక స్థితి అభివృద్ధి కోసము సాధన చేస్తున్నారో వారు హిందూ ధర్మము యొక్క

సిద్ధాంతములను అనుసరిస్తున్నట్లే. హిందూ ధర్మము "పరమాత్మచే వెల్లడైన నిత్యమైన దైవ సత్యములు" ఒక సద్గురువు (అనగా ఎవరైతే పరమాత్మునితో ఐక్యత పొంది, దైవ సత్యములను స్వయముగా చూసి, అనుభవిస్తారో) ద్వారా సాంప్రదాయముగా సరైన బోధన లేకుండా మరియు పరమాత్ముని కృప/దీవెనలు లేకుండా మానవుడు తనంతట తానుగా స్వంత బుద్ధితో అర్థము చేసుకొనుట అసాధ్యము.

**ఓం శాంతి శాంతి శాంతిః**

(**అర్థము:** పరమాత్మా! దయచేసి త్రివిధ (ఆది ఆధ్యాత్మిక, ఆది భూత మరియు ఆది దైవిక, ప్రాకృతిక) తాపములను శాంతింపచేయుము)



**నమస్తే**

**<u>నమస్తే:</u>** "**నమః**" అనగా, "**నేను కాదు**" (అహంకారమును వశపరచుకొనుట/నియంత్రించుకొనుట), "**స్తే**" అనగా, మీ లోపల ఉన్న ఆత్మను నేను గౌరవించుచున్నాను.

# సూచిక

**పేజి సంఖ్యలు**

# పరిచయము

## విజ్ఞానమే విశ్వాసము

ధర్మము ఒక విశ్వాసము, అభిప్రాయము లేదా నమ్మకము. ఇది సత్యము గురించి విచారణ. ఇదియే నిజమైన జ్ఞానము. అన్ని ధర్మముల లక్ష్యము సమాజములో మానవులు అందరూ "నైతిక, సామాజిక, నీతిపరమైన, తాత్విక మరియ ఆధ్యాత్మిక" కోణముల ద్వారా జీవిత విధానము క్రమ బధ్ధముగా ఉండవలెనని. మానవులు ఎల్లప్పుడూ పుట్టుక, భూమి మీద జీవితము మరియు భయంకరమైన మరణము గురించి తెలుసుకోవాలనే కోరికతో ఉంటారు. నేను ఎవరు?, నేను ఎక్కడనుంచి వచ్చాను, పుట్టాను? నా జీవిత లక్ష్యము/భాద్యతలు ఏమిటి? నేను ఏమి చేయవలెను? నా జీవిత యొక్క అర్ధము, ఉద్దేశ్యము, ప్రయోజనము ఏమిటి? నేను మరణించిన తరువాత ఎక్కడకు వెడతాను? పరబ్రహ్మము (పరమాత్ముడు) ఎవరు? ఈ విశ్వము ఎలా సృష్టింపబడినది? ఈ విశ్వము యొక్క ప్రయోజనము ఏమిటి? పుట్టుక ఎలా జరుగుతుంది? ఈ భూమి మీద నా జీవితము ఎలా సాగుతుంది? మరణము ఎలా అవుతున్నది? మరణము తరువాత ఏమవుతుంది? అనే ప్రశ్నలు మానవులను ఎల్లప్పుడూ వెంటాడుతూనే ఉన్నవి. ఈ అంశముల మీద ప్రతి ధర్మము సమాధానములు వెతుకుతూ ఉన్నవి.

## పరబ్రహ్మము (భగవంతుడు)

సృష్టికర్త (సాధారణముగా పరబ్రహ్మము, పరమాత్ముడు, భగవంతుడు అని పిలుస్తారు), ఆత్మ (నేను), విశ్వము యొక్క సృష్టి, పుట్టుక, మానవ శరీరము, జీవితము, మరణము మరియు మరణము తరువాత ఏమి జరుగుతుంది? గురించిన వివరములు

హిందూ ధర్మము  స్పష్టముగా మరియు వివరముగా భోధిస్తుంది. జీవులనందరిని పరమాత్మ సృష్టించినవాడు కాబట్టి  పరమాత్మే జీవులందరికీ మూలము మరియు ఆధారము. జీవులందరి లక్ష్యము వారి ఆధారమైన పరమాత్ముని చేరుకొనుట లేక ఐక్యమగుటదీనినే మోక్షము) లేక ముక్తి అంటారు. కాబట్టి జీవులందరూ ఆ లక్ష్యము సాధించుటకు వారి జీవిత కాలము  ఆధ్యాత్మిక విధానము ద్వారా ఉపయోగించుకోవలెను. ఒకే ఒక్క (రెండు కాని), శాశ్వతమైన, అనంతమైన, సంపూర్ణమైన, పరమానందము వంటి ప్రాతినిధ్యము కలవాడు పరబ్రహ్మము, పరమాత్ముడు, భగవంతుడు, మహొన్నతమైన వ్యక్తి అని హిందూ ధర్మము భోధిస్తుంది. పరమాత్మ మానవుల సమయమునకు, అంతరిక్షమునకు  అతీతుడు. పరమాత్మ మానవుల ఊహాశక్తికి (మహామాయ నుండి పుట్టినిది కాబట్టి) మరియు మానవ ఊహాగానమునకు, వర్ణనకు (ఇవి పరిమితము) అతీతుడు. మానవులు వారి పరిమిత ఊహాశక్తితో లేదా మేధస్సుతో అనంతమైన పరబ్రహ్మము (పరమాత్ముడు) గురించి ఆలోచించినప్పుడు  వారికి తెలియకుండా మానవ మూర్తిత్వము, ఆకారముల లక్షణములు మరియు ప్రవర్తనారీతులు ఆరోపిస్తారు. హిందూ ధర్మ పవిత్ర గ్రంధములు పరబ్రహ్మము (పరమాత్ముడు) ను "**సత్ – చిత్** – **ఆనంద్**" అని వివరిస్తాయి. **సత్** అనగా - సత్యము, శాశ్వతము  మరియు వ్యతిరేకించలేనిది. **చిత్** అనగా స్మారక స్థితి - సర్వజ్ఞుడు మరియు శుద్ధమైన జ్ఞానము. **ఆనంద్** అనగా - పరమానందము అపరిమితము, సంపూర్ణము మరియు శాశ్వతమైన ఆనందము (తేజోబిందు ఉప నిషత్  6 : 58). పరబ్రహ్మము (పరమాత్ముడు) లింగమునకు అతీతుడు. పురుషుడు  కావచ్చు లేదా స్త్రీ కావచ్చు. వేదములలో  తటస్థ సర్వనామము "ఆ" (అతడు లేక  ఆమె) అని చెప్పబడినది.

పరబ్రహ్మము **"సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ"** (త్రైత్తిరీయోపనిషత్ 2 : 1 : 1). **"బ్రహ్మం సత్య జగత్ మిధ్య"** (అనగా బ్రహ్మము ఒక్కటే సత్యము, వాస్తవము; మిగిలినవన్నీ (ఈ ప్రపంచము లేక విశ్వము) ఒక మహామాయ లేక భ్రమ (నిరాలంబోప నిషత్ -11). పరబ్రహ్మము వర్ణనాతీతము కాబట్టి పరబ్రహ్మమును ఏది ఏది కాదో అని వర్ణిస్తే అదే పరబ్రహ్మము. పరబ్రహ్మమును వర్ణించుట అపరిమితమును పరితము చేయుట. పరబ్రహ్మము వర్ణనాతీతము కాబట్టి బృహదారణ్యకోప నిషత్ 2 లేక 4 :3 :6 లో **"నేతి - నేతి"** (అనగా ఇది కాదు, ఇది కాదు) అని పరబ్రహ్మమును వర్ణించబడి ఉన్నది (శ్రీ మద్ భాగవత మహా పురాణము 2 : 6 : 36)

## పరబ్రహ్మము (పరమాత్ముడు) మరియు విజ్ఞానశాస్త్రము

పరమాత్ముడు ఈ ప్రపంచమును సృష్టించి మరియు దాని నిర్దేశించబడిన గమ్యమునకు మార్గదర్శకత్వము చేయును అని మానవజాతి ఎల్లప్పుడూ నమ్ముతుంది. చార్లెస్ డార్విన్ సిద్ధాంతము ప్రకారము ఒకే కణము అయిన అధమజీవి నుండి, లక్షల సంవత్సరములు ద్వారా, పరిణామము జరిగి మానవులు పుట్టుకువచ్చారు అని చెప్పారు. మొదట్లో అందరు దీన్ని నమ్మారు. తరువాత ఈ సిద్ధాంతము సరికాదని వెల్లడైంది. పరమాత్మ ఒక సృజనాత్మక మహాగణిత శాస్త్రజ్ఞుడు అని జోహాన్నెస్ కేప్లేర్ అనే ఒక మహా శాస్త్రజ్ఞుడు చెప్పారు. మహా అద్భుతమైన మరియు చాలా అందమైన ఈ మహావ్యవస్థ - ప్రకృతి, సృష్టి, సూర్యుడు, గ్రహములు, నక్షత్రములు మరియు పంచ మహాభూతములు - ఆకాశము (చైతన్యము, జ్ఞానము), వాయువు, అగ్ని, జలము మరియు భూమి - ఒక మహా తెలివైన మరియు మహా శక్తివంతమైన వ్యక్తి (భగవంతుడు) ఆజ్ఞతోనూ మరియు ఆధీనములోనూ జరుగుతోందని అని సర్ ఇసాక్

న్యూటన్ అనే మహాశాస్త్రజ్ఞుడు అన్నారు. భగవంతుడు అద్భుతమైన సామరస్యముతో ఈ విశ్వమును స్వయముగా వెల్లడించారు అని ఆల్బర్ట్ ఐంస్టీన్ అనే ఒక మహాశాస్త్రజ్ఞుడు పారవశ్యముతో అన్నారు. భగవంతుని మనస్సును తెలుసుకోవాలని నా విజ్ఞానశాస్త్ర సంస్థ ద్వారా ఒక ప్రయత్నము చేయుచున్నాను అని స్టీఫెన్ హాకింగ్ అనే మహాశాస్త్రజ్ఞుడు అన్నారు. భగవంతుడు ఒకే ఒక్క సంకల్పముతో ఏమీలేని స్థితిలోనుంచి ఈ సృష్టి (అనేక కోటి బ్రహ్మాండములు) సృష్టింపబడినవి. కాని విజ్ఞాన శాస్త్రజ్ఞులు ఈ సృష్టిలో (దాగి ఉన్న జ్ఞానమును) ఉన్న వస్తువులను ఉపయోగించి (కొంత కలిపి లేక కొంత తీసివేసి) మేము ఆవిష్కరణను చేశాము లేదా కనిపెట్టాము అని ప్రకటించుకుంటారు. ప్రస్తుత విజ్ఞాన శాస్త్రము ఏమీ లేని స్థితిలోనుంచి క్రొత్తగా ఏమీ సృష్టించలేదు.

## హిందూ ధర్మము

హిందూ ధర్మములో ఋషులు, మహా పురుషులు మరియు మహాత్ములు పరమాత్మ స్వయముగా ప్రకటన చేసిన దైవ శాస్త్రములు అయిన వేదములను (ఉపనిషత్తులు కలిపి), పురాణములను, ఇతిహాసములను, దర్శన శాస్త్రములను, సంక్లిష్టమయిన పుట్టుక, భూమి మీద జీవితము, సంక్లిష్టమయిన జీవితము యొక్క అంతిమ లక్ష్యమయిన మోక్షము (అనగా పునరావృతము అగు జనన, మరణ, పునర్జన్మ అనే చక్రము నుండి విముక్తి) క్రమపద్ధతిలో వివరించినారు. హిందువులు, వారి హిందూ ధర్మ పవిత్ర గ్రంధములలో ఉన్న జ్ఞానమును వివరణగా పొందుటకు, వారు హృదయపూర్వక ప్రయత్నములు చేయకపోతే ఆ పవిత్ర గ్రంధముల తప్పేమీ లేదు. ఇతర ధర్మములు స్థాపించిన స్థాపకులలో చాలమందికి విద్యాభ్యాసము లేదు, కానీ

వారికి జ్ఞానోదయము కలిగి దివ్యాదేశముల ప్రాచారము వలన ప్రజలు ఆకర్షితులు అయినారు. మహర్షి వాల్మీకి, రామాయణ ఇతిహాస రచయిత, ఆయన జీవితము యొక్క మొదటి భాగములో విద్యాభ్యాసము లేని అనాగరికమైన అటవీ బందిపోటు దొంగ. కానీ తరువాత కఠిన తపస్సు ద్వారా జ్ఞానోదయము పొంది మహర్షి అయ్యారు. కాబట్టి ఎవ్వరూ హిందూ ధర్మ పవిత్ర గ్రంధములను అర్థము చేసుకోలేమని తెలుసుకునే ప్రయత్నము అవసరము లేదు అని భావించరాదు. ధర్మము మరియు ఆధ్యాత్మికత హిందూ ధర్మ పవిత్ర గ్రంధములలో మరియు హిందువుల జీవిత విధానములో నిగూఢముగా పొందుపరచిబడినవి. కానీ కాలగర్భములో, అరిషడ్ వర్గముల (అందరిలోనూ ఉండే 6 దుష్ట సూక్ష్మ శక్తులు), (పేజి సంఖ్యలు 62, 63, 64, 227, 228 చూడుము) ప్రభావము వలన (పాశ్చాత్య సంస్కృతి ప్రభావము, భౌతిక విలువల మోజు, ఆకర్షణ ఎక్కువై) ధర్మము మరియు ఆధ్యాత్మికత విలువలు మరుగున పడినవి. ఎవరైతే ధర్మ ఆచారములపై సరైన అవగాహనము లేక గుడ్డిగా ఆచరిస్తారో లేదా నమ్మకములేక వదిలేస్తారో వారు ధర్మము, ఆధ్యాత్మికత మరియు భగవంతుడి నుండి దూరమవుతారు. కాని ఎవరికైతే ధర్మము, ఆధ్యాత్మికతపై పూర్తి విశ్వాసము ఉంటుందో వారు భగవంతుడిని అవగాహన చేసుకొని ఆయనను అనుసంధానము చేసుకుంటారు. ఆధ్యాత్మికతలో, ఏదో అదృశ్య మహా శక్తి ఈ విశ్వాసమును రూపొందించి, నిర్వహణ చేయుచున్నదని, ఒక ధృడమైన నమ్మకము మరియు విశ్వాసము ఉన్నది. దేవునిపై నమ్మకము లేని నాస్తికులు, భౌతిక ప్రపంచము, భౌతిక శరీరమునకు ఆనందము అందిస్తుందని అనుకుంటారు. కానీ భౌతిక శరీరము కోసము భౌతిక ప్రపంచము నుండి పొందిన ఆనందము తాత్కాలితముగానూ మరియు పరిమితముగానూ

ఉంటుంది. హిందూ ధర్మ పవిత్ర గ్రంధములు పరమాత్ముడిని పరమానందము, ప్రేమ మరియు శాంతి అని, యివి అపరిమితము, శాశ్వతము మరియు దైవత్వము అని వివరిస్తాయి. ప్రతీ జీవాత్మ పరమానందము నుండి పుట్టినది, పరమానందము కోసము జీవిస్తుంది, పరమానందము పొంది చివరకు పరమానందమే అవుతున్నది (తైత్తిరీయోప నిషత్ 3 : 6 : 1). కాబట్టి ప్రతీ జీవాత్మ, పరమానందము, ప్రేమ మరియు శాంతి పొందాలనే లక్ష్యముతో, ప్రతి క్షణము చర్యలను చేస్తూ ఉంటుంది (భాగవతము 3 : 5 : 2). అనగా ప్రతి క్షణము ప్రతీ ప్రాణి, తెలిసి లేదా తెలియకుండా, ఆధ్యాత్మికత (పరమాత్మ) పై నమ్మకము ఉందని అర్థము. ఎవరికయితే, ఇప్పటి పురోగమించిన ఆధునిక విజ్ఞానశాస్త్రము మరియు సాంకేతిక విజ్ఞానముపైనే ధృడ విశ్వాసము ఉన్నట్లయితే, ఆ విజ్ఞానశాస్త్రము, మరియు సాంకేతిక విజ్ఞానము వద్ద పరమాత్ముడు, ఆత్మ, ప్రకృతి, విశ్వము, పుట్టుక, జీవుల శరీరములు, రక్తము, జీవితము, వృద్ధాప్యము, మరణము, గ్రహములు, నక్షత్రములు, పంచ భూతములపై నిస్సంశయమైన సమాధానములు లేవు. హిందూ ధర్మ పవిత్ర గ్రంధములలో, దైవజ్ఞానముతో, పైన పేర్కొన్న అంశములపై నిస్సంశయమైన సమాధానములు, నిశ్చయాత్మక జవాబులు ఒక క్రమమైన వివరణతో పొందవచ్చు. అనగా దైవజ్ఞానము ముందు, ప్రస్తుత పురోగమించిన విజ్ఞానశాస్త్రము మరియు సాంకేతిక విజ్ఞాన జ్ఞానము ఆదిమ దశలో ఉన్నట్లే. హిందూ ధర్మ పవిత్ర గ్రంధములలో వేదములు పరబ్రహ్మము (పరమాత్మ) నుండి ప్రత్యక్ష అవరోహణములు అని ఋజువు అవుతోంది. ఋషులు, మహాపురుషులు మరియు మహాత్ములు ద్వారా వేదములను (ఉపనిషత్తులు కలిపి) స్పష్టము చేసి వివరించినారు. హిందూ ధర్మ పవిత్ర గ్రంధములు సంస్కృత భాషలో ఉన్నవి. సంస్కృత

భాష దైవ భాష, పరమేశ్వరుడు (శివుడు) నుండి వ్యక్తమైనది (పణిని వ్యాకరణములో పరిచయము యొక్క మొదటి పాదము ప్రకారము). సంస్కృత భాష పరిపూర్ణముగా దాని 50 వర్ణమాలలతో కొన్ని కోట్ల సంవత్సరముల క్రితమే భూమి మీదకు వచ్చినప్పటి నుండి ఎలాంటి మార్పులేదు. ఎందుకంటే సంస్కృత భాష పరిపూర్ణ రూపములో ఉన్నది. దీని పదజాలము క్లిష్టమైనది, విస్తారమైనది మరియు దాని వ్యాకరణము ప్రకారము ఎన్ని పదాలనైనా సృష్టించవచ్చును. దైవిక వెల్లడింపులు క్లిష్టముగా ఉండుటవలన దైవ భాషే చేయగలదు. అదే సంస్కృత భాష. జీవాత్మలు (జీవులందరూ) ఆదినుండి మహామాయ (పరమాత్ముని శక్తి) యొక్క బానిసత్వములో ఉన్నందున మరియు దాని ప్రభావముతో, దైవిక విషయములు, అజ్ఞానముతో కప్పబడి ఉన్నవి కనుక, అవి మానవ (జీవులందరూ) మేధస్సుకు అతీతము (భాగవతము 2 : 6 : 36). హిందూ ధర్మ పవిత్ర గ్రంధములు పరమాత్మునిచే స్వయముగా వెల్లడైనందున, ఆ పవిత్ర గ్రంధములలో పరమాత్ముని రూపము, వ్యక్తిత్వము, స్వభావము, లక్షణములు, గొప్పతనము మరియు పరమాత్ముని విశాల అనుగ్రహమును స్పష్టముగా వివరించడినవి. హిందూ ధర్మ పవిత్ర గ్రంధములలో జ్ఞానము, మానవ మేధస్సు పరిమితిని దాటి ఉన్నది. వేద సంస్కృత భాష, దేవ నాగర భాష/లిపి (స్వర్గములో నివసిస్తున్న దేవతలు ఉపయోగించే భాష మరియు సాహిత్యము), అయినందున ఇది దైవ భాష. ఈ భాషతో వారితో సంభాషించగలరు. ఇటువంటి భారీ సాహిత్యముగల సంస్కృత భాషలో ఉన్న హిందూ ధర్మ పవిత్ర గ్రంధములలో ఉన్న ఆధ్యాత్మిక జ్ఞానము, పరిపూర్ణత, నిశ్చితత్వము, విస్తారత మరియు గంభీరత పరిగణలోనికి తీసుకేంటే, పరమాత్ముని దయ లేకుండా ఈ విధమైన రచన మానవుల ద్వారా వ్రాయుట సాధ్యముకాదు.

ఋషులు, పరమాత్ముని కృపచే, జీవుల అంతిమ లక్ష్యము అయిన మోక్షము అవగాహన చేసుకొని (మహామాయ, పరమాత్ముని శక్తి, బానిసత్వము నుండి విముక్తి మరియు పరమాత్ముని పొంది అంతిమముగా పరమాత్మునిలో కలిసి పరమాత్మే అవుట) పొందుటకు మరియు అనంతమైన శాశ్వతమైన దైవ పరమానందము ఆస్వాదించుటచుకు మార్గదర్శము చూపించినారు. ఇటువంటి భారీ సాహిత్యము ఏఒక్క వ్యక్తి తన జీవితకాలములో వ్రాయుట అసాధ్యము. ఒకరు కంటే ఎక్కువ వ్యక్తులు వ్రాశారంటే ఆ సాహిత్యములో కచ్చితముగా తమ ఆలోచనలు, నేపథ్యము, విధానము మరియు పద్ధతి వేరుగా/భేదములు/విరుద్ధముగా ఉంటుంది. కానీ హిందూ ధర్మ పవిత్ర గ్రంధములలో ఉన్న ఆలోచనలు, నేపథ్యము, విధానములు మరియు పద్ధతులలో గ్రంధముల మధ్య ఏమీ భేధములు లేవు. అందువలన, హిందూధర్మ పవిత్ర గ్రంధములు స్పష్టముగా దైవముచే వెల్లడైనవనీ మరియు శాశ్వతమైనవనీ ఏ విధమైన అనుమానము లేదు.

**<u>సూచనలు:</u>** (ఏ) ఋగ్వేదము 10 : 90 : 9, (బి) యజుర్వేదము 31 : 7, (సి) అధర్వణ వేదము 19 : 6 : 13, (డి) బృహదారణ్యకోపనిషత్ 2 లేదా 4 : 4 : 10, (ఇ) మైత్రేయోపనిషత్ 6 : 32, (ఎఫ్) భాగవతము 3 : 12 : 37 నుంచి 39.

## భారతదేశ చరిత్ర

భరత వర్షము (పురాతన భారతదేశము ఇప్పటి ఇరాన్ నుండి ఇండోనేషియా వరకు వ్యాపించి ఉండేది) మరియు సనాతన ధర్మము (హిందూ ధర్మము) చరిత్ర హిందూ ధర్మ పవిత్ర గ్రంధములలో క్రమపద్ధతిలో (ప్రస్తుత కల్పము) శ్వేత వరాహ కల్పము) ప్రారంభము నుండి వివరించబడి ఉన్నది

(అనుబంధము (ఏ) పేజి సంఖ్యలు 213 నుండి 219 వరకు చూడుము). సనాతన అనగా శాశ్వితముగా పరబ్రహ్మము (పరమాత్ముడు) లో ఉండి ఆయనచే వెల్లడింపబడినది. ధర్మము అనగా ఏ ఆలోచనలు, చర్యలు వేదములను అనుసరించి ఉంటాయో, ఆధ్యాత్మికత మరియు ధర్మ సంప్రదాయములను పాటిస్తాయో, ఏ చర్యలు జీవాత్మకు మరియు ఈ ప్రపంచములో అందరికి భౌతిక, మానసిక ఆనందము మరియు శుభము కలుగచేస్తాయో, చివరకు జీవాత్మ అంతిమ లక్ష్యము అయిన మోక్షము ప్రసాదిస్తాయో అదే ధర్మము. అనేక ఇతర దేశములలో మరియు ప్రాంతములలో ఉండే మంచు యుగము (ప్రకృతి వైపరీత్యములు, విపత్తులు మరియు మంచు తుఫానులు) భరత వర్షము (పురాతన భారతదేశము) లో (స్థానిక భూ ప్రకంపనలు, ఆకృతి మార్పులు మరియు వరదలు తప్ప) మంచు యుగము ప్రభావములు లేవు. ఈ వైపరీత్యముల ప్రభావము వలన ఇతర దేశముల మరియు ప్రాంతముల చరిత్ర క్రీ. పూ. 30,000 సంవత్సరముల వరకే పరిమితము అయినది. పరబ్రహ్మము (పరమాత్ముడు) ఈ విశ్వము సృష్టించిన తరువాత భూమి మీద మానవ జాతి ఉత్పత్తి అయినమీద, క్రమ విరామములతో శాశ్వతమైన ఋషులను ఈ భూమిమీదకు పంపుతూ వారి దైవశక్తిచే పవిత్ర గ్రంధములు రచనల ద్వారా జ్ఞానము పునరుత్పత్తి నిర్వహింప చేస్తూ జీవులను (మానవులను) ఉద్ధరిస్తున్నాడు. ఈ రోజుల్లో, ఆధునిక భౌతిక మరియు సాంకేతిక అభివృద్ధి ఉన్నప్పటికీ, అసలు రూపములోని చరిత్ర (సమాచారము మరియు జ్ఞానము) ఏమార్పు లేకుండా దీర్ఘకాలముపాటు నిల్వఉంచేందుకు మరియు పునరుత్పత్తి చేయగల పద్ధతులు ఏ భౌతిక మరియు సాంకేతిక జ్ఞానములోనూ లేవు. హిందూ ధర్మ పవిత్ర గ్రంధముల యొక్క

గొప్ప దైవ జ్ఞానము ఏమార్పు లేకుండా కాపాడుటకు, నిల్వఉంచుటకు మరియు పునరుత్పత్తి చేయుటకు దైవశక్తిగల వ్యక్తులు అవసరము. పరమాత్ముని కృపతో, పరమపిత బ్రహ్మ (మన బ్రహ్మాండము వ్యవస్థ సృష్టికర్త), ఆ పనులు చేపట్టేందుకు క్రమానుగతముగా ఋషులను పంపుతారు. ఆ ఋషులు, మరలా పరమాత్ముని దయతో, చాలా పవిత్ర శ్లోకములు (మంత్రములు) వెల్లడించారు. మంత్రములు ("**మన్**" అనగా మనస్సులో మననము చేయుటచే "**త్ర**" అనగా రక్షణ కలిగించును) వల్లె వేస్తుంటే అవి మనలను దుష్టశక్తులనుండి రక్షిస్తాయి. అవియే వేదములు. సంస్కృతములో వేదములు అనగా శాశ్వత దైవ సత్యములను తెలియచేసే జ్ఞానము. ఈ పవిత్ర శ్లోకములలో భగవత్శక్తి నింపబడి, దాని ప్రభావము నిర్ధారించుటకు, జ్ఞాపకము చేయుటకు వారు అనేక పరికరములను ఉపయోగించారు. ఈ పవిత్ర శ్లోకములను వారు నోటి మాట ద్వారా (వ్రాయుటము మరియు చదువుటము కాకుండా) బోధిస్తారు. ఆ పవిత్ర శ్లోకములను (ఇవి శాశ్వత సత్యములు) శ్రుతులు (నోరు చేసే ధ్వనులు) అని అంటారు. హిందూ ధర్మ పవిత్ర గ్రంథములలో పరబ్రహ్మము (పరమాత్ముడు) (సృష్టికర్త), సృష్టి, విశ్వము, జీవుల పుట్టుక ముందు ప్రక్రియ, పుట్టుక, జీవితము, మరణము మరియు మరణము తరువాత ప్రక్రియ వివరములు ఉన్నవి. ఋగ్వేదములో విశ్వము సృష్టి, విశ్వము క్రమము, విశ్వము నాశనము (ప్రళయము) వీటి చక్రీయ విధానము గురించి వివరముగా పేర్కొనబడి ఉన్నది. దైవ క్రమము ప్రకారము ఈ విశ్వములో ప్రతీదీ స్థిర ప్రవాహముగాను మరియు లయబద్ధముగాను ప్రకృతిలో ప్రతిబింబిస్తున్నది. ప్రతీ వస్తువు (జీవులు, మానవులతో సహా) లోపల లయబద్ధముగా ఉన్నవి. మనలోని వికృత గుణములు ఈ విశ్వ క్రమమును,

లయబద్ధమును వక్రీకరించును. కాబట్టి మనలో విశ్వ క్రమము ప్రకారము లయబద్ధమును మరియు సామరస్యమును పెంపొందించేందుకు ప్రకృతి పరిరక్షణ మరియు సంరక్షణ కొఱకు తపన ఉండవలెను. మంత్రములు, శక్తితో నింపిన బీజాక్షరములు, పదములు మరియు శ్లోకములు, ముఖ్యముగా స్పందనలతో, పౌనఃపున్యాలతో కూడిన అక్షరముల సంపుటి. మనలోని కంపనలను, పౌనఃపున్యాలను విశ్వ సంబంధిత కంపనలకు పౌనఃపున్యాలకు అనుసంధానమగుటకు ఒక క్రమ పద్ధతిగా అక్షరములు సంపుటి చేశారు. విస్తరణ మరియు సంకోచ సిద్ధాంతము ప్రకారము విశ్వము పౌనఃపున్యాలు, మానవుల గుండె కొట్టుకునే విధముగా, ఉంటుంది. దీనిని స్పందన అంటారు. హిందూ ధర్మము, మన స్పందనలను (మన ఆలోచనలు, చర్యలు కూడా) విశ్వ స్పందనలకు సమకాలీకరించుటకు సాధనను బోధిస్తుంది. ప్రతి "నేను" (ఆత్మ) విశ్వము యొక్క ప్రధాన కేంద్ర స్థానము. విశ్వము లోని ప్రతీ జీవి ఒక సూక్ష్మ ప్రపంచము. విశ్వము మరియు జీవి యొక్క శరీరము ఒకే పదార్థములతో తయారు చేయబడినవి. అందుచే అన్ని సమాధానములు మన లోపలే ఉన్నవి. ఎవరైతే వారిలోని అంశములు, శక్తులు అర్థము చేసుకోగలరో వారు విశ్వము మరియు ప్రకృతి యొక్క అన్ని అంశములు, శక్తులు అర్థము చేసుకోగలరు. మానవుల చర్యలకు ప్రకృతి ప్రభావితము అయి, ప్రకృతి మానవుల శ్రేయస్సును ప్రభావితము చేస్తుంది. ఋషులు ఆరోజుల్లో గొప్ప శాస్త్రవేత్తలు. వారు ధ్యానము ద్వారా మరియు పరమాత్ముని దయతో తమను తాము సంపూర్ణము చేసుకొని, వారి హృదయములలో విన్న శాశ్వత దైవ సత్యములను వారి శిష్యులకు మాత్రమే సంభాషణలు మరియు చర్చలు ద్వారా (శబ్దములు కావలసిన ప్రభావములను నిర్ధారించగలవు.

వ్రాయుట వాటిని చదువుటవల్ల ఆ ప్రభావములు ఉండవు) బోధించేవారు. కాబట్టి వేదముల మరియు ఉపనిషత్తుల పద శబ్దముల సమర్ధతను నిర్ధారించటము చాలా ముఖ్యము.

## భగవాన్ వేద వ్యాసుడు

5,124 సంవత్సరముల ముందు (క్రీ. పూ. 3102 లో కలియుగము ప్రారంభము అయినది) భగవాన్ కృష్ణ ద్వైపాయన (తరువాత భగవాన్ వేద వ్యాసుడుగా పిలవబడ్డారు. వేదము అనగా జ్ఞానము మరియు వ్యాసుడు అంటే సంగ్రహకుడు అని అర్థము) వేదములనూ, మంత్రములనూ క్రమపద్ధతిలో విభజించి పునరుత్పత్తి చేశారు. ఈ భారీ విధిని నిర్వహించటమునకు వాటిని సరిగ్గా నమోదు చేయుటకు దైవబుద్ధి అవసరము. భగవాన్ వేద వ్యాసుడు ఉక్తలేఖన చేస్తుంటే భగవాన్ గణేషుడు (ఈశ్వరుని కుమారుడు), వాటిని సరిగ్గా నమోదు చేశారు. ద్వాపర యుగములో భగవాన్ వేద వ్యాసుడు (భగవాన్ విష్ణువు యొక్క పరిజ్ఞాన అవతారము), మహర్షి పరాశర (బ్రహ్మరిషి వసిష్టుని మనుమడు, శక్తిముని కుమారుడు) సత్యవతి (మత్యకారుని కుమార్తె) లకు జన్మించారు. ఆయనకు సత్యవతి - సుత, వద్రాయణ, కృష్ణ ద్వైపాయన మరియు భగవాన్ వేద వ్యాస అని పేర్లు ఉన్నవి. ఆయన పెరిగిన వ్యక్తిగా జన్మించారు. పుట్టినవెంటనే ఆయన తపస్సు చేయుటకు బయలుదేరారు. భగవాన్ వేద వ్యాసుడు, సూక్ష్మదృష్టి కలవారు, భూత, వర్తమాన మరియు భవిష్యత్తు కాలము గురించి తెలుసుకునే ప్రజ్ఞ కలిగి ఉన్నవారు, కాలక్రమానుసారము ప్రతి యుగములో ఏర్పడే మార్పుల ఫలితముగా (కలియుగములో), భూమినుండి ఉత్పత్తి అగు వస్తువులు శక్తి క్షీణించి మానవులలో బద్ధకము, నీరసము, బుద్ధి మాన్ద్యము పెరిగి, ఆయుషు క్షీణించి, దురదృష్టవంతులై,

అనారోగ్యముతోనూ  మరియు దుష్ట శక్తులచే హింసింపబడుతారు అని చింతించారు (భాగవతము 1 : 1 : 10). ఎందులో  మానవుల సంక్షేమము ఉంటుందని భగవాన్ వేద వ్యాసుడు తన దైవదృష్టి ద్వారా దర్యాప్తు ప్రారంభించారు. వైదిక కర్మకాండలు (యజ్ఞములు) ప్రజలను శుద్ధీకరణ చేస్తాయి అని నిర్ణయించి, ఆయన, (పరమాత్ముడు, పరమపిత బ్రహ్మకు సృష్టికి  పూర్వము వెల్లడి చేసిన),  నాలుగు వేదములు (విభజించి), 4 ఉప వేదములు, 6 వేదాంగములు పునరుత్పత్తి చేశారు. ఈ పవిత్ర గ్రంథములలో ఉన్న శాశ్వతమైన దైవ జ్ఞానము  పరమాత్ముడులో ఉండి ఆయనచే రక్షించబడుతుంది. సృష్టి ప్రారంభించే సమయములో పరమాత్ముడు, పరమపిత బ్రహ్మకు (మన బ్రహ్మండ వ్యవస్థ సృష్టికర్త) ఆ జ్ఞానమును వెల్లడిచేసి, సృష్టి ప్రారంభించమని ఆజ్ఞాపించారు. పరమపిత బ్రహ్మ ఈ బ్రహ్మండము యొక్క సృష్టి  సమయములో ఋషులకు ఈ శాశ్వతమైన దైవ జ్ఞానమును  అందించినారు.  ఆ ఋషులు, ప్రజల సంక్షేమము కొఱకు, ఆ  దైవ జ్ఞానమును  ఈ  భూమిమీద ప్రజలకు పునరుత్పత్తి  చేశారు. భగవాన్ వేద వ్యాసుడు ఆ జ్ఞానమును  అంతా  క్రీ. పూ. 3102 ముందు పునరుత్పత్తి చేశారు. తరువాత 18 పురాణములు, 18 ఉప పురాణములు, మహాభారతము (శ్రీమద్ భగవద్గీతతో సహా), బ్రహ్మ సూత్రములు వ్రాశారు (హిందూ ధర్మ పవిత్ర  గ్రంథముల యొక్క వివరములు అనుబంధము (బి)  (పేజి సంఖ్య  220)  ఉన్నవి).



# పరబ్రహ్మము (పరమాత్ముడు)

హిందూ ధర్మ పవిత్ర గ్రంధములలో పరబ్రహ్మమును రెండు అంశములుగా వర్ణించారు (ఎ) నిరాకార, నిర్గుణ, అవ్యక్త బ్రహ్మము మరియు (బి) సాకార, సగుణ, వ్యక్త, రూపము గల బ్రహ్మము.

**నిరాకార, నిర్గుణ, అవ్యక్త బ్రహ్మము:**

నిరాకార అనగా ఆకారములేని, నిర్గుణ అనగా లక్షణములు లేని, అవ్యక్త అనగా మనోబుద్ధ్యాదులకు అగోచరమైనది. ఋగ్వేదములో నాసదీయ సృష్టి మంత్రములలో నిరాకార, నిర్గుణ, అవ్యక్త బ్రహ్మమును ఒక సూత్రములో తటస్థముగా - "**అది**" అని వర్ణింపబడినది. "**అది**" - స్వచ్ఛమైన జ్ఞానము, స్వచ్ఛమైన పరమాత్మ, మార్పులేని (కాలము, దేశము మరియు కారణములకు అతీతమైనవాడు) మరియు సాధారణ బుద్ధితో తెలిసికోనుట సాధ్యము కానివాడు. నిరాకార బ్రహ్మము పూర్తిగా సూక్ష్మము, నిద్రాణము, వ్యక్తముకాని మరియు భావరహిత, సాధారముగా అర్థముకాని, లింగ బేధములేని (పురుషుడు లేక స్త్రీ కాని), కారక, నిరాకర చర్యలు చేయని, నామ రూపములు లేని శక్తి. నిరాకార బ్రహ్మము గురించి మన హిందూ ధర్మ పవిత్ర గ్రంధములలో చాల తక్కువగా చెప్పబడి ఉన్నది. నిరాకార, నిర్గుణ బ్రహ్మము అనేకము అవ్వాలని కేవలము ఒకేఒక్క సంకల్పముతో శాశ్వతమైన దైవ శక్తులతో కూడిన పరమాత్ముడుగా అయి సాకార, సగుణ, వ్యక్తిగత రూపముపగల బ్రహ్మముగా అవుతాడు (బృహదారణ్యకోప నిషత్ 2 లేక 4 : 3 : 1). నిరాకార బ్రహ్మమును ఉపాసించే వారిని జ్ఞాని అంటారు.

**ఈశ్వరుడు (అత్యున్నత అధిపతి)**

ఈశ్వరుడు లేక పరమేశ్వరుడు సర్వశక్తిమంతుడయిన

వ్యక్తిగత భగవంతుడు. ఎల్లప్పుడూ "శుభము కలిగించే వ్యక్తిత్వము కలవాడు" అని అర్థము. పరమేశ్వరుడు (ఎ) ఆధిపత్యము, (బి) ధర్మాధిపతి, (సి) ప్రఖ్యాతి (డి) సంపద లేక అభ్యుదయత (ఇ) వివేకము మరియు (ఎఫ్) ప్రేమ ఇవన్నీ పరిపూర్ణముగా కలవాడు (భాగవతము 2 : 9 : 16). పరమేశ్వరుడు మూడు కోణములు కలిగి ఉన్నాడు (ఎ) సృష్టి, (బి) స్థితి (సంరక్షణము) మరియు (సి) ప్రళయము (తైత్తిరీయోప నిషత్ 3 : 1 : 1). పరమేశ్వరుడు విశ్వ క్రమమునకు మూలము మరియు విశ్వమును క్రమబద్ధముగా నడుపుతాడు. ఈ అంశములను అమలు చేయుటకు సాకార లేదా సగుణ బ్రహ్మముగా అవుతాడు.

పరబ్రహ్మము యొక్క అనేక పేర్లలో ముఖ్యమైనవి పరమాత్ముడు, భగవంతుడు, ఈశ్వరుడు. పరబ్రహ్మము (పరమాత్ముడు) యందు మూడు ప్రాథమిక వాస్తవిక తత్వములు ఉన్నవి. అవి పరబ్రహ్మము (పరమాత్ముడు), ఆత్మ మరియు మహామాయ (శ్వేతాశ్వతరోప నిషత్ 1 : 6, 9 మరియు 12). పరమాత్ముడు అనగా పెద్ద మరియు దేనినైనా పెద్దగా చేయగలడు (భగవద్గీత 11 : 43). పరమాత్ముడు **"సద్ ఎవ, సౌమ్య, ఇదం అగ్రా ఆసిడ్ ఏకం ఏవ అద్వితీయం"** అనగా పరమాత్మ ఒంటరివాడు, ఒకే ఒక్కడు, రెండు కానివాడు (ఛాందోగ్యోప నిషత్ 6 : 2 : 1). **"ఆనందో బ్రహ్మేతి"** అనగా పరమాత్మ అనంతమైన, శాశ్వతమైన, దైవ పరమానందము మరియు ప్రతి ఒక్కరినీ అనంతమైన, శాశ్వతమైన, దైవ పరమానందము చేయకలవాడు (తైత్తిరీయోప నిషత్ 2 : 7, 8 & 3 : 6 మరియు భాగవతము 11 : 26 : 1). పరమాత్ముడు సత్యస్వరూపుడు. "సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ" (తైత్తిరీయోప నిషత్ 2 : 1 : 1). పరమాత్ముడు **"సత్ – చిత్ ఆనంద్"**. **"సత్"** అనగా సత్యము (శాశ్వతమైన), **"చిత్"** అనగా అనంతమైన చైతన్యము, జ్ఞానము మరియు

“**ఆనంద్**” అనగా పరమానందము (తేజోబిందూప నిషత్ 6 : 58). **"విజ్ఞానం ఆనందం బ్రహ్మ"** పరబ్రహ్మము జ్ఞానస్వరూపుడు మరియు పరమానందస్వరూపుడు (బృహదారణ్యకోప నిషత్ 3 లేదా 5 : 9 : 28). పరమాత్మనిది సంపూర్ణ దివ్యత్వము. పరమాత్ముడుని, భగవాన్ అని అంటారు. "భగవాన్" అనగా పరిపూర్ణమయిన శక్తి, సుగుణము, ధర్మము, కీర్తి, సంపద, వివేకము మరియు భావావేశరహితము అన్నీ సంపూర్ణముగా కలవాడు.

పరమాత్ముడుని మన ఐదు జ్ఞానేంద్రియములు (చూచుట (కళ్ళు), వినుట (చెవులు), మాట్లాడుట (నోరు), స్పర్శించుట (చర్మము), మరియు వాసనతెలియుట (ముక్కు) శక్తులు మరియు అవయవములు) --- ఇవి మహామాయతో తయారుచేబడ్డ పదార్థములనే గ్రహించ గలవు) ద్వారా గ్రహించలేము (ముండకోప నిషత్ 1 : 1 : 6). పరమాత్మని మన మనస్సు మరియు మేధస్సు ద్వారాకూడ అర్థము చేసుకోలేము (ఇవి కూడా మహామాయ నుండి ఉద్భవించినవే). పరమాత్మని చూచుటకు, వినుటకు, అవగాహనము చేసుకొనుటకు మరియు అర్థము చేసుకొనుటకు మనకు దైవ అధ్యాపక వర్గములు (కళ్ళు, చెవులు, మరియు మనస్సు మొదలైనవి) (ఇవి పరమాత్ముడే ఇవ్వగలడు) అవసరము (భాగవతము 2 : 6 : 36, భగవద్గీత 11 : 8, 53, 54). జీవాత్మ, మహామాయ యొక్క బానిసత్వము నుండి విముక్తి పొందాలంటే పరమాత్ముడు యొక్క కృప మరియు దైవ శక్తి అత్యవసరము. జీవాత్మ, మహామాయ యొక్క బానిసత్వము నుండి విముక్తి పొందిన తర్వాతే, పరమాత్మని తెలిసికొని మరియు ఆయన అనంతమైన శాశ్వతమైన దైవ పరమానందము పొంది, తానే పరమాత్మడు అవుతాడు. ఆ ఒకే ఒక్కడైన పరమాత్ముడిచే ఈ అనంతమైన విశ్వములు సృష్టింపబడినవి. పరమాత్ముడు అనంతమైన పెద్ద, అతి పెద్ద కంటే పెద్ద.

ఆయనతో సమానమైనది వేరొకటి లేదు (భగవద్గీత 11 : 43, భాగవతము 2 : 4 : 14, శ్వేతాశ్వతరోప నిషత్ 6 : 8). ఈ సృష్టి, ప్రళయము అయినప్పుడు ఈ విశ్వములు అన్నిటినీ (మహామాయతో సహా) మరియు అన్ని జీవాత్మలను పరమాత్ముడు తనలో గ్రహించుకునే సామర్ధ్యము కలిగి ఉన్నవాడు. పరమాత్ముడు విశ్వములో సూక్ష్మాతి సూక్ష్మము (అతి చిన్నది కంటే చిన్న) (శ్వేతాశ్వతరోప నిషత్ 3 : 20). పరమాత్ముడు అన్ని జీవాత్మలలో (అతి సూక్ష్మమయిన) నివసిస్తున్నాడు (భగవద్గీత 15 : 15). పరమాత్ముడిని వర్ణించడము మానవాతీతము. అందుచే ఉపనిషత్తులు పరమాత్ముడిని వర్ణించుటకు **"నేతి – నేతి"** (అనగా **"ఇది కాదు - ఇది కాదు"**, అనగా ఈ సృష్టిలో మనకు తెలిసిన వస్తువులు లేక పదార్థములు ఏది కాదో అదే పరమాత్ముడు) అనే పదములను వాడారు. పరమాత్ముడను అర్ధము చేసుకునేందుకు పరమాత్మతో ఏకత్వము అనుభూతి అవసరము. **"బ్రహ్మం సత్య జగత్ మిధ్య"** (అనగా బ్రహ్మము ఒక్కడే సత్యము (నిత్యము, శాశ్వతము) ఈ ప్రపంచము మిధ్య (భ్రమ). ఈ ప్రపంచము ఎల్లప్పుడూ మారుతూ ఉంటుంది. అందుచే ఈ ప్రపంచము అనిత్యము) (నిరాలంబోప నిషత్ - 11). ఈ విశ్వము పరమాత్ముడుని నుండి ఉద్భవించి, ఆయనచే సృష్టింపబడి చివరికి ఆయనలోనే విలీనమవుతుంది (తైత్తిరీయోప నిషత్ 3 : 1 : 1). పరమాత్ముడు జీవాత్మలకు మూలము. పరమాత్ముడు మహామాయ ద్వారా పలురూపములలో వ్యక్తీకరణ అయి విషయము మరియు వస్తువువలె (నామరూపములతో) కనిపిస్తున్నాడు (భాగవతము 1 : 13 : 47). ఈ విశ్వములో ప్రతి జీవాత్మ పరమాత్ముని పరమానందము కోసము ఆశతో జీవిస్తున్నాయి (తైత్తిరీయోప నిషత్ 3 : 6 : 1). కానీ చాలా జీవాత్మలు (మహామాయ యొక్క బానిసత్వము వలన)

అజ్ఞానముతో, పరమాత్ముని పరమానందము పొందలేక పోతున్నాయి. పరమాత్ముడిని తెలుసుకోవటము ద్వారా మహామాయ యొక్క బానిసత్వము నుండి విముక్తి పొంది పరమాత్ముని పరమానందము పొందుతారు (శ్వేతాశ్వతరోప నిషత్ 1:8). ఎవరైతే సంతోషముగా ఉన్నామని చెబుతారో, వారి ఆ సంతోషము అసత్యము, తాత్కాలికమైనది, ప్రాపంచికమైనది, మరియు పరిమితమైనది, కాని సత్యమైనది, శాశ్వతమైనది, దివ్యమైనది మరియు అనంతమైనది అయిన పరమాత్ముని పరమానందము కాదు. అవ్యక్తీకృత బ్రహ్మము స్వంత యోగ మహామాయ (దైవ శక్తి) ద్వారా, మహామాయను తన నియంత్రణలో ఉంచి, తనంతట తానుగా వివిధ వ్యక్తిగత రూపములుగా వ్యక్తీకరణ అవుతాడు (భగవద్గీత 4 : 6 మరియు 11 : 10). ఆయన కేవలము ఒక్క సంకల్పముతో, విశ్వములో వివిధ రూపములలో తనను తాను విశదపరుస్తారు (నారాయణ ఉపనిషత్తు 1, ఐతరేయోప నిషత్ 1 : 1 : 1).

## సాకార, సగుణ, వ్యక్త, రూపముగల బ్రహ్మము

సాకార అనగా ఆకారము లేదా భౌతిక రూపము. సగుణ అనగా సద్గుణములు (మంచి లక్షణములు). ఉపనిషత్తులలో బ్రహ్మము అనే పదము సాధారణముగా సాకార, సగుణ పరమాత్ముడిని సూచిస్తున్నది. నిరాకార, నిర్గుణ బ్రహ్మము, సాకార, సగుణ బ్రహ్మములో స్థాపించబడి ఉన్నది. కాబట్టి సాకార, సగుణ బ్రహ్మము, పరమాత్ముడు అంటారు. పరమాత్మ శాశ్వతమైన, సర్వవ్యాపియైన, సర్వజ్ఞుడైన, సర్వశక్తిమంతుడైన, పరమానందకరమైన, అన్నిటియందూ వ్యాపించినవాడు, దయామయుడు, అనంతమైన కృప మరియు ప్రేమకల దైవ స్వరూపుడు. ఆయన ప్రధాన రూపములలో పంచాయతనము

(సూర్యుడు, లలితాంబికదేవి, గణేశుడు, విష్ణుమూర్తి మరియు మహాశివుడు) మరియు బ్రహ్మదేముడు, శ్రీరాముడు, కృష్ణపరమాత్మ మొదలైనవారు. ఆయన తన లీల (దైవ క్రీడ) అయిన విశ్వము సృష్టి, సంరక్షణము మరియు నాశనము కొనసాగించుటకు వరుసగా రజో గుణముతో (కార్యాచరణ కొఱకు) మహా సరస్వతిదేవి యొక్క జ్ఞాన శక్తితో బ్రహ్మదేముడు రూపములో, సత్త్వ గుణముతో (సామరస్యము కొఱకు) మహా లక్ష్మిదేవి యొక్క సంపద శక్తితో విష్ణుమూర్తి రూపములో, మరియు తమో గుణముతో (వినాశనము కొఱకు) మహాదేవి లలితాంబికాదేవి యొక్క మహా శక్తితో పార్వతిదేవి, పరమేశ్వరుడు (శివుడు) రూపములో, మహామాయ యొక్క మూడు గుణములు (శక్తులు) స్వీకరించారు (భాగవతము 2 : 4 : 12). విష్ణుమూర్తికి (శ్రీహరి) అనంతమైన ప్రాభవము, ప్రతిఘటించలేని శక్తి, అన్నిటియందూ వ్యాపించినవాడు, మహోన్నతమైన దైవ స్వభావము కలవాడు. ఆయనే వేదము (పవిత్రమైన జ్ఞానము) మరియు ధర్మము. ఆయన అద్భుతమైన సుగుణములు అనంతమైనవి మరియు వర్ణనాతీతము. అందులో కొన్ని -- సత్యస్వరూపుడు, పవిత్రుడు, కరుణ, ఓర్పు, ఔదార్యము, నిష్కపటత్వము, ప్రశాంతత, మనస్సుపై ఆధిపత్యము, నిరాడంబరము, సమత్వము, సంరక్షణా శక్తి, వీరత్వము, ఘనత, బలము, సామర్ధ్యము, ధైర్యము, కాఠిన్యము, పరిపూర్ణత, నిష్పాతమైన తీర్పు, సంపూర్ణ స్వాతంత్ర్యము, అపురూప సౌందర్యము, శరీర ఓజస్సు, మనోవైఖరి, నిగ్రహశక్తి, అసాధారణమైన ప్రజ్ఞ, వినయము, మంచితనము, భక్తి, నిరహంకారము, సంపూర్ణ స్ఫూర్తి (భాగవతము 1 : 16 : 26 నుండి 29). ఆయన తాపత్రయములు అనగా మూడు విధముల తాపములను (బాధలను), (ఎ) శరీరము మరియు మనస్సులోని తాపములు, (బి) ఇతర జీవులు ద్వారా

కలిగే తాపములు మరియు (సి) ప్రకృతి వైపరీత్యముల వలన కలిగే తాపములు, అంతరించువాడు. ఎవరైతే పరమాత్ముడను వ్యక్తిగత రూపములో ఉపాసన చేస్తారో వారిని భక్తుడు అంటారు. ఆయన సంకల్పముతో నిర్గుణ బ్రహ్మము అవుతారు. కాబట్టి సగుణ మరియు నిర్గుణ బ్రహ్మము ఒక్కటే (బృహదారణ్యకోప నిషత్ 2 లేక 4 : 3 : 1 ).

## మహామాయ లేదా ప్రకృతి (దైవశక్తి లేదా భ్రమ)

మహామాయ లేదా ప్రకృతి (దైవశక్తి లేక భ్రమ) అనగా సత్యమును రహస్యముగా ఉంచి (కప్పి), అసత్యమును సత్యముగా వ్యవహరింప చేయును లేక భ్రమ కలిగించును. ఇది పరమాత్మ యొక్క అనంతమైన, నిత్యమైన శక్తి (శ్వేతాశ్వతరోప నిషత్ 4 : 10). ఇది జీవము లేని (చర్యలు లేక పనులు స్వయముగా తనంతట తానుగా చేయలేని) పరమాత్మ యొక్క అపరా శక్తి (సంభావ్య శక్తి). మాయా శక్తిని నాశనము చేయుట అసాధ్యము. పరమాత్మకు మహామాయశక్తిపై సంపూర్ణ నియంత్రణ ఉన్నది. మహామాయ, పరమాత్మునికి మరియు జీవాత్మకి మధ్య ఉన్నది. జీవాత్మ యొక్క అవిద్య (అజ్ఞానము) కారణముగా, ప్రకృతి యొక్క అందములకు ఆకర్షింపబడి, స్వంత ఇష్టపూరితముగా మహామాయ యొక్క బానిసత్వమునకు వశమైపోయినది. కానీ జీవాత్మ, పరమాత్ముని కృపతో, మహామాయ యొక్క నిత్య బానిసత్వము నుండి విముక్తి పొందవచ్చు. పరమాత్ముడు మహామాయను తన ఆధీనములో ఉంచుకొని, తన సంకల్పము ప్రకారము మహామాయను వినియోగించుకో గలడు. మహామాయను ప్రకృతి అనికూడా అంటారు. విశ్వము లేక భౌతిక ప్రపంచము మహామాయ నుండి ఉత్పన్నమైనవే. మహామాయ యొక్క ప్రభావముతో ఈ ప్రపంచములో ధర్మము లేదా అధర్మము, మంచి లేదా చెడు, తప్పు లేదా ఒప్పు, సుఖము లేక

దుఃఖము మొదలైన ద్వంద్వ ప్రవృత్తులు ఉన్నవి. మహామాయ కారణముగా మనకు కనిపించే ఈ ప్రపంచము సత్యమైనది (నిజమైనది) కాదు. సత్యమైన లోకము మహామాయకు అతీతముగా, వర్ణనాతీతముగా ఉంటుంది. పరమాత్ముడు ఒక్కడే సత్యము మిగిలినదంతా మహామాయయే (శ్వేతాశ్వతరోప నిషత్ 4 : 9). మహామాయ ప్రభావముతో, జీవులకు, అంతర్గిత బలహీనత ఏర్పడి, తమ నిజస్వరూపమును (స్వచ్ఛమైన, పరమానందమైన ఆత్మస్వరూపము) మర్చిపోయి, భౌతిక, ప్రాపంచిక విషయములతో (ఇవికూడా మహామాయ నుండి ఉత్పన్నమైనవే) మునిగిపోతారు. ఎవరైతే పవిత్రమైన జ్ఞానమును పొందుతారో వారి అవిద్య (అజ్ఞానము) నాశనము అవుతుంది. సంపూర్ణ చేతనశక్తి స్వరూపమైన పరమాత్ముడు నుండి అసంపూర్ణమైన జడశక్తి (మాయాశక్తి) ఎలా వచ్చినది? అన్ని వ్యక్తిత్వ భావములకు అతీతమైన పరమాత్ముడు, వ్యక్తిత్వ భావపూరితమైన ప్రపంచమును ఎందుకు సృష్టించాడు? అనంతమైన పరమాత్ముడు పరిమితమైన సృష్టిని ఎందుకు సృష్టించాడు? ఇటువంటి అన్ని సందేహములకు ముండకోప నిషత్ (1 : 1 : 7) లో, చేతనమైన సాలె పురుగునుండి, ఏ రీతిగా అచేతనమైన దారము వచ్చుచున్నదో, అదేవిధముగా చేతనమైన శరీరము నుండి అచేతనమైన కేశములు, గోళ్ళు మరియు అచేతనమైన భూమినుండి చేతనమైన ఓషదులు, వృక్షములు పుట్టుచున్నవి అని, అద్భుతముగా సమాధానము చెప్పారు. భాగవతములో మరియు భగవద్గీతలో ఇవి పరమాత్మని లీల మరియు సృష్టికి అవసరమైన పరికరములు అని వివరించినవి. సృష్టికి కారణకారణమైన పరమాత్ముని ఈ లీల జీవాత్మలు, మహామాయ యొక్క బానిసత్వము నుండి విముక్తి పొంది, మోక్షము

పొందుటకు అవకాశము కలుగచేయుటయే సృష్టి యొక్క పరమార్ధము. బ్రహ్మ సూత్రములలో (1 : 4 : 24, 26, 27) సృష్టి అనే ఈ లీల పరమాత్ముని కోరిక లేని వ్యక్తీకరణ అని వివరించినారు. మహామాయ లేనిదే సృష్టి మరియు పుఃనసృష్టి ఆగిపోయి ప్రపంచము ఉండదు. సృష్టి సమయములో పరమాత్మని నుండి విశ్వము ఆవిర్భవిస్తున్నది మరియు ప్రాకృతిక ప్రళయము సమయములో విశ్వము పరమాత్మనిలో విలీనము అవుతున్నది. ఆదిమ పదార్ధము (ప్రకృతి) అన్ని జీవులకు ఒక గర్భము వంటిది. ఆ గర్భములో పరబ్రహ్మము (పరమాత్ముడు) చిత్ శక్తి అనే బీజమును నాటును. పరబ్రహ్మము యొక్క చిత్ శక్తి (చేతనా శక్తి), మహామాయ యొక్క జడ శక్తి ఐక్యతచే అన్ని జీవుల జననము సాధ్యమవును (భగవద్గీత 14 : 3).

మహామాయ మూడు లక్షణములు కలిగి ఉన్నది. వాటిని గుణములు అని అంటారు. అవి (ఎ) సత్వ గుణము (దైవభక్తి), (బి) రజో గుణము (బలమైన వాంఛలు) మరియు (సి) తమో గుణము (అజ్ఞానము లేదా సోమరితనము). ఈ గుణములు జీవాత్మను శరీరముతో బంధించును (భగవద్గీత 14 : 5). విశ్వము పరమాత్మునిలో సంపూర్ణగా విలీనమై ఉన్నప్పుడు, మహామాయ తన బానిసత్వములో ఉన్న ఆత్మలతో పాటు, సంపూర్ణ సూక్ష్మ మరియు నిద్రాణమైన స్థితిలో పరమాత్ముడులో ఉన్నవి. సృష్టి ముందు మహామాయ లక్షణములు (గుణములు) సంపూర్ణ సమతుల్యతతో మరియు సామరస్యముతో ఉండును. సృష్టి సమయములో మహామాయ ఆనేకమైన విశ్వములుగా, వివిధ విధములుగా పరిణామము చెందుతుంది మరియు పైన మూడు లక్షణములు (గుణములు) వాటి ఉనికి సూచిస్తాయి.

- ❖ **సత్వ గుణము:** ఇది కాంతివంతమైన, తేలికపాటి మరియు ప్రకాశవంతమైనది. ఇది వివేకము, జ్ఞానము,

ఆనందము మరియు సంతోషము అనే అనుబంధములతో బంధిస్తుంది (భగవద్గీత 14 : 6). ఎవరైతే ఆనందము, సంతృప్తి, సమతుల్యము, మరియు మనస్సులో పవిత్రత భావన కలిగిఉంటారో వారిలో ఈ గుణప్రభావము ఆధిపత్యములో ఉండి, ఆధ్యాత్మిక అభివృద్ధికి మరియు దైవ ప్రవృత్తికి దారితీసి, దైవకృప కలిగేందుకు కారణము అవుతుంది. ఈ గుణము మంచి రీతిలో ఉంటుంది. తెలుపు రంగుతో పోలుస్తారు.

- **రజో గుణము:** ఇది ఆత్మాభిమానము, అనుబంధము, కార్యకలాపములు, ఉద్యమము, ఆందోళన, దురాశ మరియు కోపములకు కారణమవుతుంది మరియు ఇతరులు మీద ఆధిపత్యము చేస్తారు. ఈ గుణప్రభావముచే చర్యలు మరియు వాటి ఫలితములపై అనుబంధము ఏర్పరిచి జీవాత్మను బంధిస్తుంది (భగవద్గీత 14 : 7). ఈ గుణము రీతి అనుబంధము. ఎరుపు రంగుతో పోలుస్తారు.
- **తమో గుణము:** ఇది నిశ్చలస్థితికి, కదలికలు లేకుండా బద్ధకముగా ఉండుట, భారముగా ఉండుట, కార్యాచరణ చేయలేనిస్థితి, ప్రతికూల ఆలోచనలు, గందరగోళము, మానసిక వ్యాకులత, చికాకు, పరాకు, మగత మరియు నిద్ర ప్రేరేపిస్తుంది. ఇది అజ్ఞానమునకు, అతీతమైన హింసకు కారణమవుతుంది. ఈ గుణప్రభావముచే బద్ధకము, అశ్రద్ధ మరియు నిద్ర ద్వారా జీవాత్మను బంధిస్తుంది (భగవద్గీత 14 : 8). ఈ గుణము రీతి అజ్ఞానము. నలుపు రంగుతో పోలుస్తారు.

ఈ గుణములలో స్వాభావికమైన లక్షణములు ఉన్నవి. వీటి మధ్య నిరంతరము, ఒక్కొక్క గుణము మిగిలిన

రెండు గుణములను అణిచి, ఆ గుణము ఆధిపత్యము వహించేందుకు సంఘర్షణ జరుగుతూ ఉంటుంది. ఒక వ్యక్తి ప్రశాంతముతో నిర్మలముగా ఉన్నాడంటే, అతనిలో సత్వ గుణము ప్రబలముగా ఉన్నట్లు. ఇది అప్పుడప్పుడు జరుగుతుంది. రజో గుణము ప్రబలముగా ఉన్నప్పుడు, ఇది సత్వ గుణము కంటే మరింత శక్తివంతమైనది మరియు సులభముగా ప్రబలముగా అవుతుంది, ఆ వ్యక్తి చురుకుగా మరియు గాఢవాంఛతో ఉంటాడు. తమో గుణము ప్రబలముగా ఉన్నప్పుడు, యిది అత్యంత శక్తివంతమైనది మరియు ఎక్కువగా ప్రబలముగా అయ్యేది. ఆ వ్యక్తి సోమరితనముగా మరియు హింసాత్మకముగా ఉంటాడు. నిరంతరము ఈ గుణముల తీవ్రతస్థాయి మారుతూ ఉంటుంది. ఫలితంగా ఒక వ్యక్తి యొక్క ప్రవర్తన, ప్రతిచర్య ఈ గుణములలో ఏ గుణము ఆధిపత్యములో ఉందో దాని మీద ఆధారపడి ఉంటుంది. సత్వ గుణము యొక్క ఆధిపత్యము ఆనందమునకు దారితీస్తుంది. రజో గుణము ఆధిపత్యములో బాధకు దారితీస్తుంది. తమో గుణము ఆధిపత్యములో గందరగోళమునకు, హింసకు దారితీస్తుంది. పరమాత్ముడు విశ్వ సృష్టి, పరిరక్షణ మరియూ విలీనము విధులను నిర్వర్తించేందుకు పరమపిత బ్రహ్మగా (రజో గుణముతో), విష్ణుమూర్తిగా (సత్వ గుణముతో) మరియు పరమేశ్వరుడుగా (తమో గుణముతో) రూపొందుతాడు (భాగవతము 1 : 2 : 23). ప్రకృతియొక్క మూడు గుణములతో కూడిన నా దివ్యశక్తి దాటశక్యము కానిది. కాని నన్ను శరణు పొందినవారు దానిని సులభముగా దాట గలరు (భగవద్గీత 7 : 14).

## సత్వ గుణము లక్షణములు

ఎవరైతే సత్వ గుణమును అభివృద్ధి చేసుకుంటారో వారికి

ఆధ్యాత్మిక  అభివృద్ధికి తోడ్పడుతుంది. సత్వ గుణము యొక్క లక్షణములు ఈ విధముగా ఉండును - మానసిక  పవిత్రత, శాంతము, జ్ఞానేంద్రియములపై నియంత్రణ, భౌతిక ఆనందముల పరిత్యాగము,  ఆధ్యాత్మిక అభివృద్ధిపై ఆసక్తి, ఉత్సాహము, మానసిక మరియు శారీరక ఓరిమి, నిర్మలత్వము, అహింస, నిర్క్రోధము, అన్ని జీవులపై ప్రేమ మరియు దయ, సౌమ్యత, వినయము, తృప్తి, ఓజస్సు, క్షమ,  ధైర్యము మరియు జ్ఞానము. సత్వ గుణము దైవభక్తిని పెంపొందిస్తుంది. "జీవాత్మ ఈ మూడు గుణములను దాటినప్పుడు అమరత్వము పొందుతుంది" (భగవద్గీత 14 : 20).

## ఆత్మ లేదా జీవాత్మ

ఆత్మ సత్యమైనది మరియు దివ్యమైనది.  జీవాత్మ అనగా మహామాయ బానిసత్వములో ఉన్న ఆత్మ, మహామాయ నుండి ఉత్పన్నమైన అహంకారముతో (శారీరక, ప్రాపంచిక) అనుబంధముతో ఉన్నది.  ఆత్మ లేదా జీవాత్మ  శాశ్వతమైనది, పుట్టుకలేనిది,  చావులేనిది,  సూక్ష్మమైనది, చైతన్యమున్నది మరియు దైవత్వమున్నది (శ్వేతాశ్వతరోప నిషత్ 1 : 9 మరియు 4 : 5), (భగవద్గీత 2 : 20, 24 మరియు 15 : 7). ఆత్మ ఏ మలినములేని మరియు పరమాత్మని వంటి గణనీయమైనది. ఆత్మ లేదా జీవాత్మ, పరమాత్మని శాశ్వతమైన అంశము (భాగవతము 10 : 87 : 20). జీవాత్మ, మహామాయ బానిసత్వముకు వశమై, ప్రకృతిలోని ఐదు జ్ఞానేంద్రియములు మరియు  మనస్సు (ఆరవ ఇంద్రియము వంటిది) లతో  మమైక్యమయి ఉన్నది (భగవద్గీత 15 : 7, శ్వేతాశ్వతరోప నిషత్ 1 : 6). ఏ రీతిగా ప్రజ్వలించుచున్న అగ్ని నుండి, ఆ అగ్నిసమాన రూపముగల నిప్పురవ్వలు వేలకొలది ఎట్లు పుట్టుచున్నవో అదే రీతిగా

పరమాత్మ నుండి జీవులు అనేక విధములుగా జన్మించుచున్నారు (ముండకోప నిషత్ 2 : 1 : 1). జీవాత్మలు అసంఖ్యాకముగా ఉన్నవి. ఆత్మకు లేదా జీవాత్మకు లింగ భేదము లేదు. పురుషుడు కాదు, స్త్రీ కాదు, తటస్థము కాదు. జీవాత్మ లేదా పురుష లేదా పురుషుడు (పురుష అనగా పురమునందు నివసించునది) ఏ శరీరము ధరిస్తే, ఆ శరీరము యొక్క లింగమువలె ఆ శరీరము వ్యవహరిస్తుంది (శ్వేతాశ్వతరోప నిషత్ 5 : 10). జీవాత్మకు మరొక జీవాత్మకు ఎటువంటి సంబంధము లేదు (భాగవతము 11 : 17 : 53). జీవాత్మ, పరమాత్మ యొక్క ప్రత్యేక అంశము. జీవాత్మ యొక్క జీవశక్తి లేదా తటస్తశక్తి, పరమాత్ముని చిత్శక్తి లేదా దివ్యశక్తితో అనుసంధానింపబడి ఉన్నది. **"అహం బ్రహ్మాస్మి"** అనగా నేను బ్రహ్మము అయి ఉన్నాను. **"అహం"** అనగా **"నేను"** (జీవాత్మ లేదా పురుష), **"బ్రహ్మాస్మి"** అనగా **"బ్రహ్మము"** అయి ఉన్నాను (బృహదారణ్యకోప నిషత్ 1 లేదా 3 : 4 : 10). **"తత్త్వమసి"** అనగా బ్రహ్మము నేనే అయి ఉన్నాను. **"తత్"** అనగా అది (అది అనగా బ్రహ్మమును సూచిస్తుంది), **"అసి"** అనగా నేనే అయి ఉన్నాను (ఛాందోగ్యోప నిషత్ 6 : 8 : 7). **"అయమాత్మా బ్రహ్మ"** అనగా నా ఆత్మయే బ్రహ్మము (మాండూక్యోప నిషత్ - 2). జీవాత్మ అతి సూక్ష్మమైనది, పరమాణువు కంటే సూక్ష్మమైనది, నిగూఢమైనది మరియు ప్రతి ప్రాణి యొక్క హృదయ గుహ యందు ఆశ్రయించి ఉన్నది (శ్వేతాశ్వతరోప నిషత్ 3 : 20). జీవాత్మ పరమాత్మ యొక్క అంశము లేదా పరమాత్మయే (భగవద్గీత 15 : 7). జీవాత్మకు చేతన శక్తి లేదా తటస్తశక్తి (చర్యలను చేసేందుకు శక్తి) పరమాత్ముడు ప్రసాదించినదే. జీవాత్మకు పరమాత్మకు శాశ్వత సంబంధము ఉంది. పరమాత్ముడు జీవాత్మ లోపల ఉంటాడు (కఠోప నిషత్ 2 : 2 : 12;

శ్వేతాశ్వతరోప నిషత్ 3 : 20; 4 : 6; 6 : 7, 11, 14; భగవద్గీత 7: 9, 10; 15: 15). ప్రతీ జీవాత్మ ప్రకృతి నుండి ఉద్భవించిన గుణములకు వివసుడై ఎల్లప్పుడూ ఎదో పనిని చేయుటకు ప్రేరేపించబడును. ఒక క్షణముకూడా క్రియారహితముగా ఉండలేవు (భగవద్గీత 3 : 5). జీవులకు ఈ భౌతిక శరీరము ద్వారా వారి విధులను (పనులు లేదా చర్యలు అనగా, కర్మలు) చేయుటకు జీవాత్మకు పరమాత్ముడు శక్తిని ఇస్తున్నాడు. కానీ ఏ కర్మలు (మంచి) లేక (చెడు) చేయాలో లేక చేయకూడదో అనే నిర్ణయము తీసుకునే స్వేచ్ఛ పరమాత్ముడు జీవాత్మకే వదిలేశాడు. ఈ నిర్ణయములలో పరమాత్ముడు ఏవిధమైన జోక్యము చేసుకోడు. అందుచే ఆనిర్ణయములు జీవాత్మే తీసుకుంటుంది. అందుచే ఆకర్మల ఫలితములను జీవాత్మే అనుభవించవలెను (బృహదారణ్యకోప నిషత్ 4 లేదా 6 : 4 : 5; భాగవతము 11 : 3 : 20). పరమాత్ముని సంకల్పము చేత, మహామాయ (ప్రకృతి) ఈ భౌతిక రూపములో పరిణామము చెందినది. జీవాత్మకు మహామాయతో ఎటువంటి సంబంధములేదు. కానీ జీవాత్మ యొక్క అవిద్య (అజ్ఞానము) కారణముగా, ప్రకృతి యొక్క అందములకు ఆకర్షింపబడి, స్వంత ఇష్టపూరితముగా మహామాయ యొక్క బానిసత్వమునకు వశమైపోయినది. జీవాత్మ యొక్క బానిసత్వమునకు కారణము మరియు ఆ బానిసత్వమునుండి విముక్తికి బాధ్యత మనస్సుదే. జీవాత్మ జ్ఞానేంద్రియముల ద్వారా ప్రపంచ భౌతిక వస్తువులను గ్రహించి వాటితో అనుబంధము ఏర్పరచుకోవటమే జీవాత్మకు మహామాయ యొక్క బానిసత్వమునకు కారణము (భాగవతము 3 : 25 : 15). ఈ బానిసత్వము కారణముగా జీవాత్మలు తమ గుర్తింపు (పరమాత్ముని అంశగా), స్పృహ కోల్పోయి మయారంగములో ఉంటూ శాశ్వతముగా కళంకమయి ఉన్నది (భాగవతము 11 : 2 : 37). ఈ బానిసత్వముచే జీవాత్మలు ప్రకృతి యొక్క

అహంకారము మరియు మూడు గుణముల ప్రభావముతో మోసపోయి తాము చేసే చర్యలకు (కర్మలకు) తామే కర్తలుగా భావించుతూ ఉన్నవి. ఈ కారణముగా అవి నిస్సహాయముగా మంచి లేదా చెడు గర్భములలో జననములు, మరణములు మరియు పునర్జన్మల చక్రములో ఉన్నవి (భాగవతము 3 : 27 : 3). జీవాత్మ, తన స్వాభావిక చైతన్యశక్తి ద్వారా ఏశరీరములో (మహామాయతో ఉత్పత్తి అయినది) ఉంటే ఆశరీరమును చైతన్యవంతము చేయును. దానినే జీవిస్తున్నాడు అంటారు. ఒక్కసారి జీవాత్మ ఆశరీరమును వదిలేస్తే (ఆ శరీరము జడమవుతుంది) దానినే చనిపోయాడు అంటారు (తైత్తిరీయ ఉపనిషత్తు 3 : 3). జీవాత్మ మరియు శరీరము వరుసగా విద్యుచ్ఛక్తి మరియు బల్బుతో పోల్చవచ్చు. ఆత్మ, కర్మలకు (మంచి లేదా చెడు) కట్టుబడి ఉన్నప్పుడు జీవాత్మ అని పిలుస్తారు. జీవాత్మ, అసంఖ్యాకముగా జన్మలు ఎత్తి ఆ కర్మఫలములను అనుభవించవలసి ఉన్నది (బృహదారణ్యకోప నిషత్ 4 లేదా 6 : 4 : 6). కాబట్టి జీవాత్మ (వ్యక్తి), ఈ సత్యమును గ్రహించి, తన అజ్ఞానమును తొలగించుకొని, వేదములలో ఉన్న సత్యమైన జ్ఞానమును (జ్ఞానము కర్మలను కాల్చి నశింపచేయును) పొంది పరమాత్మకు తమకు తాము (జీవాత్మ) సమర్పణ చేసుకుంటే, పరమాత్ముని కృపతో మహామాయ యొక్క బానిసత్వము నుంచి విముక్తి పొందవచ్చు. ఇదే మోక్షము.

పరమాత్ముని లక్షణములకు మరియు జీవాత్మ లక్షణములకు ఈ క్రింద అంశములలో ఒకేవిధముగా ఉన్నవి.

- పుట్టుకలేనివి మరియు నిత్యమైనవి (భగవద్గీత 2 : 20 నుండి 25 వరకు మరియు 10 : 3).
- ఎటువంటి మార్పు లేనివి, ఒకే వర్గమునకు చెందినవి

మరియు ఏమియూ విభిన్నత్వము లేనివి (శ్వేతాశ్వతరోప నిషత్ 1 : 6).

- ❖ ఎప్పుడూ కలిసి ఒకే స్థానములో (జీవుల హృదయములలో) నివసిస్తారు (భగవద్గీత 15 : 15; శ్వేతాశ్వతరోప నిషత్ 4 : 17).
- ❖ చైతన్యము కలిగి, చర్యలను చేయగల శక్తి ఉన్నది. పరమాత్ముడు సర్వశక్తిమంతుడు (పారాశక్తి). జీవాత్మ (ఆత్మ) పరమాత్ముడు ప్రసాదించిన జీవశక్తి (తటస్తశక్తి) (ఇది పారాశక్తి మరియు అపరా లేదా మాయాశక్తికి కన్న తక్కువ శక్తి) కలిగి ఉన్నది.

పరమాత్మునిలో అసంఖ్యాకముగా మరియు అనంతమైన స్థాయిలో సద్గుణములు ఉన్నవి (భాగవతము 1 : 18 : 14). జీవాత్మ, పరమాత్ముని అంశమే అయినా పరమాత్ముని మొత్తము లక్షణములు మరియు ఆ లక్షణములలో కూడా చాల లక్షణములు ఆ స్థాయిలో లేవు. కొన్ని ఈ క్రింద విధముగా ఉన్నవి:

| **పరబ్రహ్మ (పరమాత్మ)** | **జీవాత్మ** |
|---|---|
| 1. సృష్టి, స్థితి, లయ చేయకల సమర్థుడు - ఇది వ్యక్తిగత శక్తి (బ్రహ్మసూత్రము 4 : 4 : 17) | 1. ఈ సామర్థ్యము, శక్తి లేనివాడు |
| 2. మాయాతీతుడు, మాయను తన అధీనములో ఉంచి పాలించే వాడు | 2. మాయాదీనుడు |
| 3. ప్రేరకుడు లేదా కారకుడు | 3.ప్రేరితుడు, కారణమైనవాడు |
| 4. సర్వ వ్యాపకుడు | 4. శరీరమునకు పరిమితుడు |

| | |
|---|---|
| 5. సర్వశక్తిమంతుడు | 5. పరిమితమైన శక్తి కలవాడు |
| 6. సర్వజ్ఞుడు | 6. మాయ యొక్క అవిద్యచే (అజ్ఞానముతో) ఆవరింపబడినవాడు |
| 7. అనంతమైన, అపరిమితమైన, అపారమైనవాడు | 7. అన్నిటికీ పరిమితమైనవాడు |
| 8. సంపూర్ణుడు | 8. అసంపూర్ణుడు |
| 9. స్వతంత్రుడు, మాయాధీషుడు | 9. మాయాదీనుడు |
| 10. అపరిమితమైన ప్రేమ, దయ, కరుణ, కృప కలవాడు | 10. ఈ లక్షణములలో పరిమితముగా ఉన్నవాడు |
| 11. సూర్యుడు లేక మట్టితో పోల్చవచ్చు (“ఏ” అనుకుందాము) | 11. సూర్యరశ్మి లేక కుండతో పోల్చవచ్చు ("బి" అనుకుందాము) |

**<u>గమనిక:</u>** ‘ఏ’ మరియు ‘బి’ ఒక్కటే. కాని ‘బి’, ‘ఏ’ కాదు. ‘బి’ లేకుండా ‘ఏ’ ఉంటుంది. కాని ‘ఏ’ లేకుండా ‘బి’ ఉండలేదు.

**<u>సూచనలు:</u>** భగవద్గీత 15 : 15; శ్వేతాశ్వతరోప నిషత్ 4 : 16; ముండకోప నిషత్ 1 : 1 : 9; బృహదారణ్యకోప నిషత్ 5 లేదా 7 : 1 : 1; తైత్తిరీయోప నిషత్ 3 : అధ్యాయములు 1 నుండి 6 వరకు; భగవంతుడు వేద వ్యాసుడు రచించిన బ్రహ్మ సూత్రములు 1 : 1 : 2 నుండి 4 వరకు; 1 : 2 : 8 నుండి 21 వరకు; 2 : 1 : 1 మరియు 22; 3 : 3 : 21, 22, 23.

ఆత్మ, మహామాయ యొక్క మూడు గుణములకు అతీతమైనప్పటికీ, మూడు గుణములతో మమైక్యమై, వాటితో తయారైన శరీరమే తానుగా భావిస్తుంన్నదుకు, జీవాత్మగా దుష్ట ఫలితములతో భాదింపబడుతూ ఉంటుంది (భాగవతము 1 : 7 : 5). జీవాత్మ, తాను తన అజ్ఞానము కారణముగా మహామాయ బానిసత్వముకు లోనైఉందని గ్రహించి, ఆధ్యాత్మిక జ్ఞానము ద్వారా తాను శరీరము (మహామాయ నుండి పుట్టిన) కాదనీ, తన మూలము, అంతిమ గమ్యము పరమాత్ముడే అని తెలుసుకొని, అదే లక్ష్యముగా విధులు నిర్వర్తించవలెను (భగవద్గీత 7 : 6 మరియు 15 : 15). పరమాత్ముడు సూక్ష్మరూపములో ప్రతి జీవాత్మలో అంతర్యామి అయి నివసిస్తున్నాడని గ్రహించవలెను. ఆత్మ (నేను), శాశ్వతమైన, మార్పులేని, స్వచ్ఛమైన (మహామాయ ద్వారా కలుషితముకాని), శరీరముకాని, ప్రకృతి యొక్క మూడు గుణములకు అతీతమైన, మరొక ఆత్మతో సంబంధములేని, దేదీప్యమానమైన, దైవ గుణములకు పునాదైన, అన్నిటియందూ వ్యాపించిన, అన్నిటికీ సాక్షినైన స్వరూపము (భాగవతము 4 : 20 : 7). ఎవరైతే ఈ విధముగా ఆత్మను అవగాహన చేసుకుంటారో వారు ఎన్నటికీ ప్రకృతి యొక్క మూడు గుణములచే కళంకము కారు (భాగవతము 4 : 20 : 8). ఈ శరీరమునకు అధ్యక్షతైన జీవాత్మ, ఎప్పుడైతే జ్ఞానేనింద్రియములకూ (ఐదు), కర్మేంద్రియములకూ (ఐదు) మరియు మనస్సుకూ ప్రాముఖ్యత ఇవ్వదో అప్పుడు బ్రహ్మానంద స్థితి కలుగును (భాగవతము 4 : 20 : 11).

## దేవతలు (దేవ లోకములో నివసించువారు):

కొన్ని జీవులు, ఏవైతే విశిష్టమైన పుణ్య చర్యలు చేశారో, ఆ పుణ్య చర్యలవలన వారు దివ్య శక్తులు పొంది, దేవ లోకములో

దేవతలుగా ఉన్నతమైన జన్మ పొందుతారు. వారికి పంచభూతములతో తయారుచేయబడ్డ శరీరములు ఉండవు. వారు దివ్యమైన సూక్ష్మ శరీరములతో, కాంతిని వెదజల్లుతూ ఉంటారు. ఉదాహరణ: సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు, దేవేంద్రుడు, వాయుదేవుడు, అగ్నిదేవుడు, వరుణదేవుడు మొదలగువారు. దేవతలు మహామాయ యొక్క బానిసత్వములోనే ఉన్నవారు. దేవతలు మహామాయను అవరోధించలేదు. అందుచే మహామాయ యొక్క గుణములచే ప్రభావితులే (భగవద్గీత 18 : 40). వారు వారి దివ్య శక్తులతో ఈ భూమిమీద నివసించే జీవులందరికీ శుభము కొఱకు మంచి చర్యలు చేస్తారు.



# సృష్టి

హిందూ ధర్మ పవిత్ర గ్రంధములలో, ఈ విశ్వము యొక్క సృష్టి గురించి వివిధ విధములలో తెలియచేశారు. విశ్వము యొక్క సృష్టి, స్థితి మరియు లయ, (ప్రాకృతిక ప్రళయము) పరమాత్మని నియమబద్ధ ప్రణాళిక ప్రకారము కాల చక్రములో నిరంతరమూ జరుగుతూనే ఉంటుంది. ఇది శాశ్వతమైన మరియు నిరంతరమూ జరిగే ప్రక్రియ. దీనికి ఒక ప్రారంభము మరియు ఒక అంతము లేదు. ప్రాకృతిక ప్రళయము సమయములో సృజనాత్మక (జీవ) శక్తులు మరియు దళములు (మహామాయ), సూక్ష్మమైన మరియు నిద్రాణ (అవ్యక్త) స్థితిలో, పరమాత్మలో ఉన్నవి (భగవద్గీత 9 : 7). సృష్టి సమయములో, పరమాత్మని కేవలము ఒకేఒక్క సంకల్పముతో ఆ అవ్యక్త శక్తులు, వ్యక్త రూపములో ఈ విశ్వముగా రూపొందింపబడుతుంది (భగవద్గీత 7 : 6 నుండి 12 వరకు; 9 : 17 నుండి 19 వరకు). పరమాత్మనకు సృష్టి, స్థితి మరియు ప్రాకృతిక ప్రళయము కేవలము ఒక దైవ క్రీడ లేక లీల మాత్రమే.

## సృష్టి యొక్క లక్ష్యము

జీవాత్మలు సూక్ష్మమైనవి, శాశ్వతమైనవి, జీవశక్తి, చైతన్యము కలిగిఉన్నవి మరియు అసంఖ్యాకముగా ఉన్నవి. వాటి స్వంత సూక్ష్మ మనస్సు (వారి స్వంత సంచిత కర్మలతో) సూక్ష్మ శరీరముగా అంటిపెట్టుకుని ఉన్నవి. సృష్టి సమయములో జీవాత్మలు మానవ శరీరము పొందినప్పుడు వారు తమ స్వంత మనస్సు యొక్క వివక్షత ప్రకారము అనేక మంచి లేక చెడ్డ కర్మలు (పనులు) చేస్తారు. ప్రతీ కర్మకు, కర్మ ఫలితము ఉంటుంది. ఆ మంచి లేక చెడు కర్మల వృత్తాంతము (వాసనలు లేదా సంస్కారములు అని పిలుస్తారు) మనస్సు యొక్క

ఉపచేతన విభాగములోనూ మరియు పరమాత్మునిచే నమోదుఅయి నిల్వచేయబడి ఉంటాయి (శ్వేతాశ్వతరోప నిషత్ 4 : 6). కర్మ సిద్ధాంతములో శక్తి పరిరక్షణము సిద్ధాంతము ఉన్నది. ఎవరెవరుచేసే కర్మల ప్రభావముల ప్రకారము, వారి వారి గత (భూత), ప్రస్తుత (వర్తమాన) మరియు భవిష్యత్తు జీవితము నిర్ణయింపబడుతుంది. పరమాత్ముడు కర్మఫలదాత (కర్మలకు ఫలములు ఇచ్చేవాడు). దైవ సహజ న్యాయ సిద్ధాంతము ప్రకారము పరమాత్ముడు అంతిమ నిర్ణయము (తీర్పు) చేస్తాడు. ఏ జీవాత్మా ఈ కర్మ సిద్ధాంతము (చట్టము) నుండి తప్పించుకోలేవు. ప్రాకృతిక ప్రళయము సమయములో, మహామాయ బానిసత్వములో ఉన్న జీవాత్మలు, వారి సంచిత కర్మలతో (గత జీవితములలో వారు ప్రోగుచెసుకున్న కర్మలు), సంపూర్ణ సూక్ష్మ నిద్రాణమైన స్థితిలో పరమాత్మునియందు విశ్రాంతి తీసుకుంటూ ఉన్నవి. ఆజీవాత్మలకు, క్రిందవివరించిన పద్ధతులతో, వారి సంచిత కర్మలను అంతము చేసుకునేందుకు అవకాశము యివ్వాలనే ముఖ్య లక్ష్యముతో పరమాత్ముడు సృష్టిని సంకల్పిస్తాడు.

- ❖ జీవాత్మ తదుపరి జీవితములలో కర్మఫలములు అనుభవిస్తూ కొన్ని కర్మ ఫలములను నాశనము చేసుకుంటుంది. కానీ తదుపరి జీవితములో మరికొన్ని మంచి లేదా చెడు కర్మలు చేస్తూ మరిన్ని కర్మఫలములను ప్రోగుచేసుకుంటూ ఉంటుంది. ఆ జీవితానంతరము యింకా ఎక్కువ సంచిత కర్మఫలముల సంఖ్య (మూట) పెరుతూనే ఉంటుంది. దీనికి అంతము ఉండదు.
- ❖ జీవాత్మ తదుపరి జీవితములో హిందూ ధర్మ పవిత్ర గ్రంధములలో ఉన్న పరిపూర్ణ జ్ఞాన యోగము ద్వారా ఆత్మ

జ్ఞానము పొందవచ్చును. ఆ జ్ఞానము చాలా శక్తివంతమైనదీ మరియు సంచిత కర్మలను నాశనము చేయును. సంచిత కర్మల నాశనముతో, జీవాత్మ ప్రస్తుత జీవితానంతరము (మరణము తర్వాత) పరమాత్ముని కృపతో మోక్షము (జనన, మరణ మరియు పునర్జన్మ యొక్క చక్రము నుండి విముక్తి) పొందుతుంది.

❖ జీవాత్మ తదుపరి జీవితములో భక్తి యోగము ద్వారా, పరమాత్మునిపై సంపూర్ణ భక్తిభావముతో ఆత్మసమర్పణ చేసినచో, తద్వారా పరమాత్ముని కృపతో మోక్షము పొందుతుంది.

## సృష్టిలోని శాశ్వత తత్త్వములు (వాస్తవికతలు)

సృష్టిలో మూడు శాశ్వతమైన తత్త్వములు లేదా వాస్తవికతలు ఉన్నవి (శ్వేతాశ్వతరోప నిషత్ 1 : 12) అవి :

❖ **పరబ్రహ్మము (పరమాత్ముడు):** పరమాత్ముడు ఒకే ఒక్కడు రెండు కానివాడు. అతను దైవ, శాశ్వతమైన, ఆనంద స్వరూపుడు మరియు అనంత సంపూర్ణ సద్గుణములు కలిగి ఉన్నవాడు.

❖ **జీవాత్మలు:** జీవాత్మలు అసంఖ్యాకములు, పరమాత్ముని అంశలు, శాశ్వతమైనవి, సూక్ష్మమైనవి, జీవశక్తితోపాటు వారి సూక్ష్మ మనస్సు, సంచిత కర్మలు (ప్రతి జీవాత్మ మనస్సు యొక్క ఉపచేతన విభాగములో సంపూర్ణసూక్ష్మ, నిద్రాణమైన స్థితిలో ఉండును).

❖ **మహామాయ లేదా ప్రకృతి (దైవ శక్తి):** మహామాయ శాశ్వతమైన, ప్రాణములేని పరమాత్ముని శక్తి. మహామాయలో మూడు శక్తివంతమైన లక్షణములు (గుణములలో) ఉన్నది. అవి (ఎ) సత్వ గుణము (ఆరాధనా

భావము), (బి) రజో గుణము (ఆవేశము, వాంఛ, కోరిక) మరియు (సి) తమో గుణము (అజ్ఞానము, బద్ధకము). ఈ గుణములు సృష్టి యొక్క ప్రతి భాగములోనూ మిశ్రమ నిష్పత్తిలో ఉన్నవి. ఇది ఒక బలమైన శక్తి. ఇది పరిణామము చెందుతూ చివరకు విశ్వముగా వ్యక్తమవుతుంది. ఈ ప్రక్రియ ప్రాకృతిక ప్రళయము వరకూ ముందుకు పోవును.

**విశ్వమును నడిపించే శక్తులు:**

గుడ్డు ఆకృతిలో ఉన్న ఈ విశ్వము ఏడు తొడుగులతో (భూమి, నీరు, అగ్ని, వాయువు, ఖగోళము, అహంకారము మరియు మహత్ తత్త్వము) ఉన్నది. భూమి 40 లక్షల మైళ్ళు వెడల్పుతో కలిగి ఉన్నది. మిగిలినివి వరుసగా ఒకదాని కంటే తరువాతది 10 రెట్లు పెద్దవి. ఒకదానిని తరువాతది కప్పి ఉన్నది. (భాగవతము 3 : 11 : 39 నుండి 41 వరకు).

- **ఎనిమిది కారణ సూత్రములు:** ఆదిమ పదార్ధము, మహత్ తత్త్వము, అహంకారము మరియు ఐదు సూక్ష్మ మూలకములు అనగా శబ్ద, స్పర్స, రంగు, రుచి మరియు వాసన.
- **పదహారు పరిణామములు:** ఐదు స్థూల మూల పదార్ధములు (ఖగోళము, వాయువు, అగ్ని, జలము మరియు భూమి), మనస్సు, ఐదు జ్ఞానేంద్రియములు (శ్రవణ, స్పర్స, దృష్టి, రుచి మరియు ఘ్రాణ అనగా వాసన), ఐదు కర్మేంద్రియములు (స్వరపేటిక, చేతులు, పాదములు, జననాంగము మరియు మలవిసర్జన అవయవము). వీటిలో ఏదీ యిక మరింత పరిణామము చెందవు.
- క్రింది రెండు శక్తులు విశ్వమును ముందుకు నడిపిస్తాయి:

- ❖ **కర్మల (చర్యల) శక్తి:** పైన వర్ణించిన అంతులేని సంఖ్యలో ఉన్న అన్ని ఆత్మలు పోగుచేసిన కర్మల సామూహిక శక్తి విశ్వమును ముందుకు నడిపిస్తుంది.
- ❖ **కాలము (సమయము):** పరమాత్ముడు మాత్రమే కాలాతీతుడు. కాలమునకు, మహామాయ వంటి, శాశ్వతమైన శక్తి ఉన్నది. కాలము యొక్క శక్తి, మహామాయ పక్క పక్కన ఉంటూ, విశ్వమును ముందుకు నడిపించును. పరమాత్ముడు నుండి వెలువడ్డ మిగతా విశ్వము అంతా కాలముతో దాని ఆకారము మరియు రూపము మారుతుంది. కాలము భూత, వర్తమాన మరియు భవిషత్తు గురించి పరిమితిని, అవగాహనను మరియు సంఘటనలను గమనిక చేయుటకు సహాయపడును. సూర్య కిరణము లంబ కోణము ఒక పరమాణువు (అతి చిన్న కణము) నుండి ప్రక్కనున్న పరమాణువునకు మారుటకు పట్టే సమయము అతి చిన్న కాలము కొలతగానూ మరియు పరమ పిత బ్రహ్మ (ఈ బ్రహ్మాండము సృష్టి కర్త) జీవిత కాలము (పర) అతి పెద్ద కాలము కొలతగానూ వివరించినారు. రెండు పరమాణువులు ఒక అణువు, మూడు అణువులు ఒక త్రాసరేణు లేదా ధూళికణము. సూర్య కిరణము 3 త్రాసరేణువుల సమూహము నుండి ప్రక్కనున్న3 త్రాసరేణువుల సమూహమునకు మారుటకు పట్టే సమయమును ఒక త్రుటి అంటారు (భాగవతము 3 : 11 : 4 నుండి 9 వరకు మరియు విష్ణు పురాణము పుస్తకము 1 లో అధ్యాయము 3). 100 త్రుటిలు - ఒక వేధ; 3 వేధలు - ఒక లావ; 3 లావలు - ఒక నిమిషము; 3 నిమిషములు - ఒక క్షణము; 5 క్షణములు - ఒక కస్తము; 15 కస్తములు - ఒక లఘువు; 15 లఘువులు

- ఒక నధిక; 2 నధికలు - ఒక ముహూర్తము (48 నిమిషములు); 30 ముహుర్తములు - ఒక రోజు (సుర్యోదయము నుండి మరుసటి రోజు సుర్యోదయము వరకు - 24 గంటలు).

తెల్లవారుజ్హామున 3 గంటలనుండి 6 గంటల వరకు బ్రాహ్మీ ముహూర్తము అవుతుంది. ఇది చాలా పవిత్రమైన సమయము. ఈ సమయములో అంతరిక్ష ప్రపంచములో ఖగోళ జీవుల కార్యకలాపములు చాలా తక్కువగా ఉండును. ఈ సమయములో ధ్యానము మరియు ఆధ్యాత్మిక కార్యకలాపములు చాలా ఉత్తమము అని భావిస్తారు. ఈ సమయములో ఏపనిఅయినా ప్రయత్నిస్తే పరిష్కరింపబడుతుంది అని విశ్వసిస్తారు. సమయము చాలా విలువైనది. కాలము ఒక్కసారి జారిపోతే ఎప్పటికీతిరిగి రాదు. సమయముతో చాలా సమస్యలు పరిష్కరింపబడును.

## సృష్టి (భాగవతము ప్రకారము)

సృష్టికి పూర్వము, ప్రాకృతిక ప్రళయము సమయములో, ఈ విశ్వము పరబ్రహ్మములోనే ఉన్నది. మరొకటి ఏమియూ లేదు. ఆయన శక్తులు అన్నీ (జీవాత్మలు, వారు పోగుచేసి కర్మల శక్తితో పాటు, మహామాయ, మరియు కాలము) సంపూర్ణ సూక్ష్మ రూపములో మరియు నిద్రాణ స్థితిలో, క్రియారహితముగా ఉన్నవి. కానీ ఆయన స్మారక స్థితి సంపూర్ణముగా మేల్కొనే ఉంటుంది. ఆయన ఒకేఒక్క సంకల్పముతో (సత్ - చిత్ శక్తితో) ఆయన శక్తులు అన్నీ (జీవాత్మలు, వారు పోగుచేసిన కర్మల శక్తితో పాటు, మహామాయ, మరియు కాలము) క్రియాశీలము అవుతాయి (ఐతరేయోప నిషత్ 1 : 1). ఆయన సత్ - చిత్ శక్తి, కాలము మరియు జీవాత్మల కర్మల శక్తి (గమ్యములు), ప్రభావము

మహామాయపై కలిగి, మహామాయ యొక్క గుణముల సమతుల్యతలో క్రమము తప్పి పరిణామము చెందును. పరబ్రహ్మము అన్ని జీవులలోనూ తనను పురుషునిగా (అంశగా) ఉంచుతాడు. మహామాయ యొక్క ఆదిమ పదార్థము, కాలముచే ప్రేరేపించబడి, మహత్తత్వముగానూ, తరువాత మహత్ తత్త్వము, అహంకారముగానూ పరిణామము చెందుతాయి. అహంకారము మూడు విధాలుగా ఉన్నవి (భాగవతము 3 : 26 : 23, 24; 10 : 88 : 3, 4).

- **వైకారిక (సాత్త్వికి) అహంకారము:** ఇది పరిణామము చెంది అహంకారము, చిత్తము, బుద్ధి మరియు మనస్సుగా అవును. దీని ఆలోచనలు మరియు పరివర్తనములు కోరికలను ఉత్పత్తి చేయును.
- **తైజస (రాజసిక) అహంకారము:** ఇది పరిణామము చెంది ప్రాణము, ఐదు జ్ఞానేంద్రియములు (శ్రవణ, స్పర్శ, దృష్టి, రుచి మరియు ఘ్రాణ అనగా వాసన), ఐదు కర్మేంద్రియములు (స్వరపేటిక, చేతులు, పాదములు, జననాంగము మరియు మలవిసర్జన అవయవము) గా అవును.
- **తామసిక అహంకారము:** ఇది పరిణామము చెంది సూక్ష్మ మరియు స్థూల అంశములుగా మారును. మొట్టమొదటిగా శబ్ద నియమావళి అయి దాని నుండి సూక్ష్మ ఆకాశము (శూన్యము, చైతన్యము, జ్ఞానము) మరియు శ్రవణజ్ఞానము అవును. సూక్ష్మ ఆకాశము నుండి స్పర్శ భావన అయి దాని నుండి సూక్ష్మ వాయువు మరియు స్పర్శజ్ఞానము అవును. సూక్ష్మ వాయువు నుండి రంగు నియమావళి అయి దాని నుండి సూక్ష్మ అగ్ని మరియు దృష్టిజ్ఞానము అవును. సూక్ష్మ అగ్ని నుండి రుచి

నియమావళి అయి దాని నుండి సూక్ష్మ నీరు మరియు రుచిజ్ఞానము అవును. సూక్ష్మ నీరు నుండి వాసన నియమావళి అయి దాని నుండి సూక్ష్మ భూమి మరియు వాసనజ్ఞానము అవును (భాగవతము 3 : 10 : 14 నుండి 17 వరకు మరియు 3 : 26 : 1 నుండి 50 వరకు). (అనుబంధము 'సి' పేజి సంఖ్యలు 221, 222 చూడుము). ఈ ఐదు సూక్ష్మ భూతములు వివిధ నిష్పత్తిలో కలిసి పంచీకరణ (ప్రస్తారణ మరియు కలయిక కొన్ని నియమములు ప్రకారము) అయి స్థూల భూతములుగా మారినది.

## పంచీకరణ:

ఐదు సూక్ష్మ భూతములు (మూలకములను) ఐదు రకములుగా కలిసి ఐదు స్థూల భూతములుగా తయారు అవుతాయి. (అనుబంధము "డి" పేజి సంఖ్య 223 చూడుము).

| **సూక్ష్మ భూతములు** | **స్థూల భూతములు** |
|---|---|
| ❖ ½ సూక్ష్మ ఆకాశము + 1/8 సూక్ష్మ వాయువు + 1/8 సూక్ష్మ అగ్ని + 1/8 సూక్ష్మ నీరు + 1/8 సూక్ష్మ భూమి | "స్థూల ఆకాశము" |
| ❖ ½ సూక్ష్మ వాయువు + 1/8 సూక్ష్మ ఆకాశము + 1/8 సూక్ష్మ అగ్ని + 1/8 సూక్ష్మ నీరు + 1/8 సూక్ష్మ భూమి | "స్థూల వాయువు" |

- ½ సూక్ష్మ అగ్ని + 1/8 సూక్ష్మ ఆకాశము + 1/ 8 సూక్ష్మ వాయువు + 1/8 సూక్ష్మ నీరు + 1/8 సూక్ష్మ భూమి — "స్థూల అగ్ని"
- ½ సూక్ష్మ నీరు + 1/8 సూక్ష్మ ఆకాశము + 1/8 సూక్ష్మ వాయువు + 1/8 సూక్ష్మ అగ్ని + 1/8 సూక్ష్మ భూమి — "స్థూల నీరు"
- ½ సూక్ష్మ భూమి + 1/8 సూక్ష్మ ఆకాశము + 1/8 సూక్ష్మ వాయువు + 1/8సూక్ష్మ అగ్ని+ 1/8 సూక్ష్మ నీరు — "స్థూల భూమి"

ఈ పరిణామములు జరుగుతున్నప్పుడు అసంఖ్యాకమైన మండలములు ఏర్పడతాయి. ఆ మండలములన్నీ స్థిరపడినప్పుడు పరబ్రహ్మము అసంఖ్యాకమైన దైవ ఖగోళ ప్రదేశములు (బ్రహ్మాండములు) సృష్టించాడు. పరబ్రహ్మము గుణాతీతుడు అయినప్పటికీ, సృష్టి కోసము ఆయన రజో గుణమును స్వీకరిస్తాడ అప్పుడు రజోగుణము ప్రవృత్తిలో ఉన్న ఆయనను పరమపిత బ్రహ్మ (ఈ బ్రహ్మాండ సృష్టి కర్త) అంటారు. ప్రతీ బ్రహ్మాండమునకు ఒక పరమపిత బ్రహ్మ ఉంటారు. పరమపిత బ్రహ్మ, మహా సరస్వతిదేవి యొక్క మహాజ్ఞానశక్తితో, సృష్టి ప్రారంభిస్తారు.

మన బ్రహ్మాండములో పదార్థముల, ఖగోళ, దైవ అనే మూడు రకముల పరిమాణములు, మరియు పదార్థముల, ఖగోళము అనే రెండు రకముల లోకములు ఉన్నవి. పదార్థముల, ఖగోళ లోకముల సృష్టి, మహామాయతో రెండు

రకముల పరిమాణములతో తయారుచేయబడినవి. దైవ పరిమాణము, పదార్థముల మరియు ఖగోళలోకములలో సమానముగా సర్వవ్యాప్తి చెంది ఉంటుంది. కానీ దైవ పరిమాణము, మహామాయతో తయారు చేయబడ్డ పదార్థముల, ఖగోళలోకముల నివాసులు చూడలేరు. అంతరిక్షములో ఖగోళలోకములు, ఖగోళ పరిమాణములు ఉన్నందున పదార్థముల లోకములోని నివాసులు (మానవులు) చూడలేరు. మన బ్రహ్మాండములో 14 లోకములు ఉన్నవి. పరమపిత బ్రహ్మ నివాసము బ్రహ్మలోకము లేదా సత్యలోకము అంటారు. ఖగోళలోకములు (అతిలోకములు) తపోలోకము, జనలోకము, మహర్లోకము, స్వర్గలోకము (ఇంద్రుని నివాసము), మరియు భువర్ లోకము అని పిలుస్తారు. అప్పుడు భుర్లోకము (భూమి) మరియు భూమి తరువాత అతలలోకము, వితలలోకము, సుతలలోకము, రసాతలలోకము, తలాతలలోకము, మహాతలలోకము మరియు పాతాళలోకములు ఉన్నవి. భుర్లోకము (భూమి) తప్ప అన్ని ఇతర లోకములు, వేరే పరిమాణములు ఉన్నవారు. కనుక మానవులు వాటిని చూడలేరు. పదార్థముల, ఖగోళలోకముల సృష్టిలో భూమి, సూర్యుడు, చంద్రుడు, గ్రహముల వ్యవస్థ, స్వర్గలోకము (ఇంద్రుడు, బృహస్పతి, వాయుదేముడు, అగ్నిదేముడు, వరుణదేముడు, కుబేరుడు మొదలైనవి) ఉన్నవి. పదార్థముల, ఖగోళలోకముల పైన దైవ పరిమాణములోని లోకములు ఉన్నవి. అవి వైకుంఠము, కైలాసము, మణిద్వీపము మొదలైనవి.

భూమి (గ్రహము) ఏర్పడిన తరువాత, భూమిలో అన్ని రకముల విత్తనములు సూక్ష్మ రూపము కలిగి ఉన్నందున, పరమపిత బ్రహ్మ ఆ విత్తనములలో జీవాత్మలను (వారి ప్రారబ్ధ

కర్మల ఫలములు ప్రకారము) ప్రవేశ పెడతారు. జీవుల అందరిలోనూ మొట్టమొదట ఓషదులు (వృక్షసంపద) పుట్టుకొచ్చినవి. తరువాత వాటిద్వారా తమ స్వంత విత్తనములు పుట్టుకువస్తాయి. ప్రకృతి మరింత పరిణామము చెందినప్పుడు కీటకములు, చేపల, పక్షులు, జంతువులు మరియు మానవుల శరీరములు ఏర్పడినప్పుడు పరమపిత బ్రహ్మ వాటిలో జీవాత్మలను (వారి ప్రారబ్ధ కర్మల ఫలములు ప్రకారము) ప్రవేశ పెడతాడు (భగవద్గీత 9 : 8). పరమపిత బ్రహ్మ భూమి మీద అన్ని జీవుల యొక్క మొదటి జత (పురుషుడు మరియు స్త్రీ) సృష్టి చేస్తారు. తర్వాత వారి ద్వారా తరువాత జీవులు పుట్టుకొస్తాయి. ఈ భూమి మీద 84,00,000 రకముల జీవ రాసులు ఉన్నవి. పరబ్రహ్మము, గుణాతీతుడు అయినప్పటికీ, సృష్టి సంరక్షణము కోసము ఆయన సత్వ గుణమును స్వీకరిస్తారు. అప్పుడు సత్వగుణ ప్రవృత్తిలో ఉన్న ఆయనను విష్ణుమూర్తి అంటారు. ఆయన, మహాలక్ష్మిదేవి యొక్క మహాఐశ్వర్యశక్తితో, సృష్టిలోని జీవులందరినీ ధర్మముగా పోషిస్తున్నారు.

ఈ సృష్టి యొక్క జ్ఞానము (క్రమ సిద్ధాంతములతో మరియు కాలక్రమానుసారముగా వివరణాత్మకముగా) 5,000 సంవత్సరముల క్రితము దైవజ్ఞాన సంపన్నుడు భగవాన్ వేద వ్యాసుడు భాగవతములో వివరముగా వర్ణించారు. ఇప్పటి పురోగమించిన ఆధునిక విజ్ఞానశాస్త్రము మరియు సాంకేతిక విజ్ఞానము నైపుణ్యముతో ఉన్నది అని అనుకున్నప్పటికీ, ఖగోళ శాస్త్ర వేత్తలు మరియు చరిత్రకారులు వారి స్వంత సిద్ధాంతములను ప్రకటిస్తున్నారు కానీ నిశ్చయాత్మక సిద్ధాంతములు, సమాధానములు చెప్పలేరు.

**<u>గమనిక:</u>** సృష్టి యొక్క వివరణలు పురాణములలోనూ, మను స్మృతిలోనూ, సాంఖ్య వేదాంతములోనూ వేరు వేరు విధములు, పదములు ఉపయోగించి వివరించినప్పటికీ వాటి అంతరార్ధము పైన భాగవతములో వివరించినదే. అందుచే అవి మరలా వివరించుటలేదు.

## మహా యుగము

నాలుగు యుగములు (కృత లేదా సత్య యుగము, త్రేతా యుగము, ద్వాపర యుగము మరియు కలి యుగము) వాటి మధ్య సంధ్యా సమయములు (ప్రతి యుగము యొక్క ఆరంభమునకు మరియు ముగింపుకు పరివర్తన కాలము) కలిసి ఒక మహా యుగము అవును. ఒక మహా యుగమునకు 12,000 దేవ సంవత్సరములు లేదా 43,20,000 మానవ సంవత్సరములు. ఒక యుగము తరువాత మరొక యుగములో ధర్మము స్థాయి క్షీణించిపోవును. ఒక మహా యుగము అంతములో భారీ వర్షము, వరదలు, వెల్లువలు, భూకంపములు మరియు అగ్నితో భౌతిక ప్రపంచము నాశనము అవును. దీనిని మహాలయ (నాశనము) అంటారు. భూమి మీద జీవులు మరణిస్తాయి. ప్రతి విధ్వంసకము సృష్టి యొక్క వారసత్వము. తరువాత మరొక మహా యుగము మళ్లీ ప్రారంభమై భూమిపై జీవులు పుట్టుకొస్తారు. (విష్ణు పురాణము I : 3) (అనుబంధము "ఇ" దైవ పగలు మరియు రాత్రి - పేజి సంఖ్యలు 224, 225 చూడుము).

- **కృత యుగము లేదా సత్య యుగము:** కృత యుగము లేదా సత్య యుగము యొక్క కాలపరిమితి 4,800 దేవ సంవత్సరములు లేదా 17,28,000 మానవ

సంవత్సరములు (4 x కలి యుగము సంవత్సరములు). ఈ యుగములో ధర్మము, (ఎద్దు యొక్క నాలుగు కాళ్ళు రూపములో ప్రాతినిధ్యము చేయబడినది, విశ్వమును రక్షించునది), పేరిట కఠిన తపస్సు, పవిత్రత, దయ మరియు సత్యము పాటిస్తారు. ధర్మము నాలుగు కాళ్ళు మీద పూర్తిగా స్థిరముగా నిలబడి ఉంటుంది (భాగవతము 1 : 17 : 24). ఈ యుగములో మానవులలో సత్వ గుణము ఆధిపత్యము కలిగివుండి, వారు సత్యము, ధర్మము మరియు ధ్యానము అనుసరిస్తూ మోక్షము కొఱకు సాధన చేస్తూ ఉంటారు. ఈ యుగములో, మిగిలిన అన్ని విషయముల వలె సంతానము, కేవలము సంకల్పము మాత్రముతోనే కలుగుతుంది. మానవులు సుమారు 1,00,000 సంవత్సరములు జీవిస్తారు. ప్రజలు ఎప్పుడూ సంతోషముగా ఉంటారు. ఎవరిలోనూ ఎక్కువ లేదా తక్కువ అనే భావాలే ఉండవు. ద్వేషము మరియు అసూయ అనేవి తెలియనే తెలియవు. భూమినుండి సమృద్ధిగా రసములు ఉత్పత్తి అవుతాయి. జీవులందరూ సంతోషముగా నివసిస్తూ ఉంటారు. పుణ్యము లేక పాపము సంపాదించుకొనాలనే భావనే ఉండదు. యుగాంతర సమయములలో భారీ వర్షము, వరదలు, వెల్లువలు, భూకంపములు మరియు అగ్నితో ప్రాదేశిక ధ్వంసము జరుగుతుంది.

- **త్రేతా యుగము:** త్రేతా యుగము యొక్క కాలపరిమితి 3,600 దేవ సంవత్సరములు లేదా 12,96,000 మానవ సంవత్సరములు (3 x కలియుగము కాలము). ఈ యుగములో ధర్మములోని 'కఠిన తపస్సు' మరుగున పడుతుంది. ఈ యుగములో ధర్మము పేరిట పవిత్రత,

దయ మరియు సత్యము మాత్రమే పాటిస్తారు (అనగా, ధర్మము ప్రామాణికము తగ్గి, మూడు కాళ్ళు మీదనే నిలబడి ఉంటుంది). ఈ యుగములో పవిత్రమైన జ్ఞానము కొఱకు ఎక్కువ ప్రాధాన్యత యిస్తారు. ఈ యుగములో మానవులలో రజో గుణము ఆధిపత్యము కలిగివుండి, వారు ఎక్కువగా యజ్ఞములు చేస్తారు. ఈ యుగములో కేవలము స్పర్శ ద్వారా సంతానము కలుగుతుంది. మానవులు కొన్ని వేల సంవత్సరములు జీవిస్తారు. ఆకాశములో మేఘములు ఏర్పడి భారీ వర్షములకు కారణముగా భూమి యొక్క రసముల ఉత్పత్తి తక్కువై, చాలా చెట్లు పెరిగుతాయి. జీవులందరూ ఆ చెట్ల కణద్రవ్యముతో జీవిస్తారు. వ్యక్తులకు నెమ్మదిగా చెడువైపు ఆలోచనలు పోయి ఆచెట్లను స్వాధీనము చేసుకునేందుకు పోరాటములు ప్రారంభిస్తారు. ఇక ఆచెట్లు కణద్రవ్యము యిచ్చుట మానివేసి, పండ్లు, కూరగాయలు యివ్వటము మొదలుపెడతాయి. మానవులు ఆ పండ్లు, కూరగాయలుతో జీవిస్తారు. మానవులు ఆచెట్లను స్వాధీనము చేసుకునేందుకు పోరాటములు కొనసాగుతూనే ఉంటుంది. అప్పుడు ఆచెట్ల పండ్లు మరియు కూరగాయలు ఉత్పత్తికూడా తగ్గిపోతాయి. ప్రజలు వ్యవసాయము మరియు పశుపాలన నేర్చుకుంటారు. వేడిమి మరియు చల్లదనము ఎక్కువై మానవులు వేడిమి మరియు చల్లదనము నుండి తమను తాము రక్షించుకోనుటకు భవనములు, యిళ్ళు ఏర్పాటు చేసుకుంటారు.

- **ద్వాపర యుగము:** ద్వాపర యుగము యొక్క కాలపరిమితి 2,400 దేవ సంవత్సరములు లేదా 8,64,000

మానవ సంవత్సరములు (2 x కలియుగము సంవత్సరములు). ఈ యుగములో కఠిన తపస్సు మరియు పవిత్రత భ్రష్టమవుతాయి. ధర్మము పేరిట దయ మరియు సత్యము మాత్రమే పాటిస్తారు (అనగా, ధర్మము ప్రామాణికము మరింత తగ్గి, రెండు కాళ్ళు మీదనే నిలబడి ఉంటుంది). ఈ యుగములో మానవులలో రజో గుణము మరియు తమో గుణముల మిశ్రమము ఆధిపత్యము కలిగివుండి, వారు ప్రతిదీ ఎక్కువగా అనుమానిస్తూ ఉంటారు. ప్రజలు అర్చన (పరమాత్మని సేవలు, పూజలు) చేస్తారు. మానవులకు వ్యాధులు మరియు కష్టములు ఎక్కువ అవుతాయి. ఈ యుగములో పురుషుడు మరియు స్త్రీ కలయిక ద్వారా సంతానము కలుగుతుంది. మానవులు కొన్ని వందల సంవత్సరములు జీవిస్తారు. ద్వేషము, అసూయ, మోసము, దురాశ మరియు కలహములు వంటి చెడు లక్షణములు ఈ యుగము నుండి మొదలు అవుతాయి. ఈ యుగములో కరువు మరియు అనావృష్టి మొదటి సారిగా ప్రారంభము అవుతాయి. ద్వాపర యుగము నుండి మానవజాతికి నిజముగా ఎక్కువ సమస్యలు మొదలవుతాయి.

- **కలి యుగము:** కలియుగము అన్ని యుగముల కంటే అత్యంత దారుణమైనది. ఈ యుగము యొక్క కాలపరిమితి 1,200 దేవ సంవత్సరములు లేదా 4,32,000 మానవ సంవత్సరములు. ఈ యుగములో ధర్మము పేరిట సత్యము మాత్రమే పాటిస్తారు. కఠిన తపస్సు, పవిత్రత మరియు దయ చాలా అరుదు (భాగవతము 3 : 11 : 21). కలి యుగములో అధర్మము అభివృద్ధిచెంది ధర్మము

ప్రామాణికము మరింత తగ్గుతుంది (అనగా, ధర్మము ప్రామాణికము మరింత తగ్గి, ఒక్క కాలు మీదనే కుంటుతూ ఉంటుంది). ఈ యుగములో, మానవులలో తమో గుణము మరియు అరిషడ్ వర్గములు (అందరిలోనూ ఉండే 6 దుష్ట సూక్ష్మ శక్తులు) (పేజి సంఖ్యలు 62, 63, 64, 227, 228 చూడుము) ఆధిక్యత పెరుగుతుంది. ఎవ్వరూ మంచి తనమునను పట్టించుకోరు. చెడు ప్రవర్తనలు ఎక్కువ అవుతాయి. కొంతమంది సంకీర్తనలు మరియు స్తోత్రములు ద్వారా పరమాత్ముని ప్రార్థిస్తారు. కలియుగములో, భూమినుండి ఉత్పత్తి అగు వస్తువులు శక్తి క్షీణించి, మానవులలో బద్ధకము, నీరసము, బుద్ధి మాన్ద్యము పెరిగి, ఆయుషు క్షీణించి, దురదృష్టవంతులై, అనారోగ్యముతోనూ మరియు దుష్ట శక్తులచే హింసింపబడుతారు (భాగవతము 1 : 1 : 10). కలియుగములో మానవులు సుమారు వంద సంవత్సరములు జీవిస్తారు. ద్వాపర యుగాన్తములో, శ్రీ కృష్ణ భగవానుడు అవతారము చాలించి వైకుంఠమునకు వెళ్ళినప్పుడు **కలియుగము** ఆరంభము అయినది (భాగవతము 12 : 2 : 29, 33) (క్రీ. పూ. 17/18 ఫిబ్రవరి 3,102 మధ్య రాత్రి). ఆ సందర్భములో మహారాజు యుధిష్టరుడు (ధర్మరాజు), కలియుగము యొక్క ప్రభావమును గుర్తించి రాజ్యమును, అర్జునుడి మనుమడైన, పరిక్షిత్ నకు అప్పగించినారు.

## పరమపిత బ్రహ్మ (మన బ్రహ్మాండ వ్యవస్థ సృష్టికర్త)

**కల్పము:** పరమపిత బ్రహ్మ (మన బ్రహ్మాండ వ్యవస్థ

సృష్టికర్త) యొక్క జీవిత పరిమితి 100 దేవ సంవత్సరములు (31,104 కోట్ల మానవ సంవత్సరములు). దీనిని 'పర' అని పిలుస్తారు. 100 దేవ సంవత్సరములు రెండు భాగములు చేసి, ప్రతి అర్ధ భాగమును 'పరార్ధ' అంటారు. పరమపిత బ్రహ్మ ప్రస్తుత వయస్సు 50 దేవ సంవత్సరములు (15,552 కోట్ల మానవ సంవత్సరములు) పూర్తియి, 51 వ సంవత్సరము యొక్క మొదటి రోజు (పగలు) జరుగుతున్నది. అనగా, ఆయని జీవితము యొక్క 100 దేవ సంవత్సరములలో రెండవ సగములో ఉన్నారు. దీనిని 'ద్వితీయ పరార్ధ' అని పిలుస్తారు. ప్రతి దేవ సంవత్సరములో 360 దేవ రోజులు (పగలు సమయము) మరియు 360 దేవ రాత్రులు (రాత్రి సమయము) ఉన్నవి. పరమపిత బ్రహ్మ యొక్క ఒక దేవ పగలు లేదా ఒక దేవ రాత్రి మానవులు ప్రతిలో ఒక కల్పము అంటారు. అనగా, ఒక దేవ సంవత్సరములో 720 కల్పములు ఉన్నవి. ఇప్పటి వరకు 36,000 కల్పములు (18,000 దేవ పగలులు (సృష్టి) మరియు 18,000 దేవ రాత్రులు (నైమిత్తిక (సందర్భముగా) ప్రళయము) జరిగిపోయినవి. ప్రతి కల్పము కాలపరిమితి 432 కోట్ల మానవ సంవత్సరములతో సమానము. ప్రస్తుతము 36001 వ కల్పము జరుగుతున్నది. ఈ కల్పము పేరు **'శ్వేత వరాహ కల్పము'** (శ్వేత అనగా తెలుపురంగు, వరాహము అనగా పంది). అనగా, విష్ణుమూర్తి శ్వేత వరాహము యొక్క రూపములో అవతారము దాల్చి, హిరణ్యాక్షుడు అనే రాక్షసుడు సముద్రములో దాచిన భూమిని అతని బారినుండి విడిపించి, భూమి యొక్క అభ్యున్నతికి తెచ్చినది ఈ కల్పము ఆరంభములో జరిగినది (భాగవతము 3 : 11 : 33, 34 మరియు 36). ఈ కల్పము (సృష్టి) సుమారు 19,729 కోట్ల మానవ సంవత్సరముల క్రితము ప్రారంభమైనది. పరమపిత బ్రహ్మ పగటి రోజు (కల్పము) అంతములో నైమిత్తిక

(సందర్భముగా) ప్రళయము జరుగును. అప్పుడు పరమాత్ముడు మూడు లోకములను – **"భూర"** (భూమి), **"భువర్"** లోకము (భూమి మరియు స్వర్గలోకము మధ్య భాగము), **"స్వర్"** (స్వర్గలోకము) లను కరిగించి, ఈ ప్రపంచములను పరిసమాప్తి చేసి, వెనక్కి తీసుకుని తనలో సూక్ష్మ మరియు నిద్రాణస్థితిలో ఉంచుకుంటారు (భాగవతము 12 : 4 : 3). పరమపిత బ్రహ్మ పగటి రోజు (కల్పము) ఆరంభములో ఈ మూడు లోకములను మరలా సృష్టించును.

## <u>మన్వంతరము</u>

ఒక కల్పములో 14 మన్వంతరములు ఉన్నవి. ప్రతి మన్వంతరము యొక్క కాల పరిమితి 30.672 కోట్ల మానవ సంవత్సరములు. ప్రతి మన్వంతరములోనూ, పరమపిత బ్రహ్మకు సృష్టి కొఱకు సహాయపడేందుకు గాను, ఒక మనువు ఉంటారు. ప్రస్తుతము 7వ మన్వంతరము జరుగుతోంది. ఈ మన్వంతరము పేరు '**వైవస్వత మన్వంతరము**' (మనువు వైవస్వతుడు, వివస్వాన్ (సూర్యుడు) యొక్క కుమారుడు) (భాగవతము 8 : 13 : 1). ఈ మన్వంతరము 12.22 కోట్ల మానవ సంవత్సరముల క్రితము ప్రారంభమైనది. ప్రతి మన్వంతరము మధ్య, ప్రాతః సంధ్య మరియు సాయం సంధ్య కాలములు (రెండు కలిపి సంధ్యా కాలము) ఉన్నవి. 14 మన్వంతరములనూ వేరుచేసేందుకు గాను 15 సంధ్యా కాలములు అవసరము. ప్రతి సంధ్యా కాలము, ఒక కృత యుగకాలముతో సమానము (అనగా 17,28,000 మానవ సంవత్సరములు). 15 సంధ్యా కాలములు (అనగా 15 X 17,28,000 సంవత్సరములు, 6 మహా యుగములతో సమానము). ప్రతి మన్వంతరములోనూ 71 మహా యుగములు

ఉన్నవి. కాబట్టి ఒక కల్పమునకు 1000 మహా యుగములు (అనగా 14 (మన్వంతరాలు) x 71 (మహా యుగములు) + 6 మహా యుగములు (15 సంధ్యా సమయములు) ఉన్నవి (భగవద్గీత 8 : 17). ప్రస్తుతము 28 వ మహా యుగము, అందులో కలియుగము నడుస్తున్నది. కలియుగము క్రీ. పూ. 17/18 ఫిబ్రవరి 3,102 మధ్య రాత్రి ప్రారంభము అయినది.

## సృష్టి

దేవ రాత్రి ముగింపు సమయములో (పగలు ప్రారంభములో) (జీవులకు ఒక కల్పము ముగిసి మరో కల్పము మొదలవుతుంది) పరమపిత బ్రహ్మ, రజో గుణమును (ప్రవృత్తిని) స్వీకరించి, సృష్టి మొదలుపెడతారు. ఆయన భూర్ (భూమి), భువర్ (భూమి, మరియు స్వర్గలోకము మధ్య భాగము), స్వర్ (స్వర్గ లోకము) మూడు లోకములను అంతకుముందు కల్పమువలె మరలా సృష్టిస్తారు. జీవులు ఈ లోకములలో వారి వారి ప్రారబ్ధ కర్మఫలితముల ప్రకారము (మానవులు, ఉపమానవులు, దేవతలు) ఆ ఆ జన్మలు ఎత్తుతారు (నారద పరివ్రాజకోప నిషత్ 5 : 7; భాగవతము 2 : 9 : 38). సృష్టి ఒక కల్పము వరకూ జరుగుతుంది. దేవ పగలు ముగింపు సమయములో (రాత్రి ప్రారంభములో) (జీవులకు ఒక కల్పము ముగిసి మరో కల్పము మొదలవుతుంది) పరమపిత బ్రహ్మ తమో గుణమును (నివృత్తిని, స్తబ్దత, విశ్రాంతి) స్వీకరించి భూర్ (భూమి), భువర్ (భూమి, మరియు స్వర్గ లోకము మధ్య భాగము), స్వర్ (స్వర్గ లోకము) మూడు లోకములను పరిసమాప్తి (నైమిత్తిక సందర్భముగా ప్రళయము) చేసి, వెనక్కి తీసుకుని తనలో సూక్ష్మ మరియు నిద్రాణ స్థితిలో ఉంచుకుంటాడు. అప్పుడు జీవాత్మలు

కారణ స్థితిలో విశ్రాంతి తీసుకుంటూ ఉంటారు. ఈ నైమిత్తిక (సందర్భముగా) ప్రళయము ఒక కల్పము వరకూ జరుగుతుంది. దేవ రాత్రి ముగింపు సమయములో (పగలు ప్రారంభములో) (జీవులకు ఒక కల్పము ముగిసి మరో కల్పము మొదలవుతుంది) పరమపిత బ్రహ్మ (రజో గుణము ప్రవృత్తిని స్వీకరించి) మరలా సృష్టి మొదలుపెడతారు. పరమపిత బ్రహ్మకు 100 దేవ సంవత్సరములు పూర్తి అయ్యేంతవరకూ పగలు సృష్టి మరియు రాత్రి నైమిత్తిక సందర్భముగా) ప్రళయములు (ప్రక్రియలు) కొనసాగుతూనే ఉంటాయి.

## ప్రాకృతిక ప్రళయము

పరమపిత బ్రహ్మకు 100 దేవ సంవత్సరములు (అనగా 72,000 కల్పములు లేదా ఒక మహాకల్పము) పూర్తి అయినప్పుడు పరమపిత బ్రహ్మ పరమాత్మునిలో విలీనము అవుతారు. పరమాత్ముడు గుణాతీతుడు అయినప్పటికీ, తమో గుణమును స్వీకరిస్తారు. అప్పుడు తమో గుణము ప్రవృత్తిలో ఉన్న ఆయనను శివుడు, ఈశ్వరుడు లేదా రుద్రుడు అంటారు. ఆయన రుద్ర రూపము దాల్చి, మహాశక్తి స్వరూపిణి పార్వతిదేవి యొక్క మహాశక్తితో, ప్రాకృతిక ప్రళయము (అనగా 7 కారణ సూత్రములను (మహత్ తత్త్వము, అహంకారము, 5 తన్మాత్రలు లేదా సూక్ష్మ మూలకములు) కరిగించి పరిసమాప్తి చేసి, వెనక్కి తీసుకుని తనలో సూక్ష్మ మరియు నిద్రాణ స్థితిలో ఉంచుకుంటారు) (భాగవతము 12 : 4 : 5 నుండి 22 వరకు మరియు భగవద్గీత 8 : 19). ప్రాకృతిక ప్రళయము 100 దేవ సంవత్సరములు (మానవులకు ఒక మహాకల్పము లేదా 31,104 కోట్ల మానవ సంవత్సరములు) వరకూ జరుగుతుంది.

## పునఃసృష్టి

తరువాత పరమాత్ముడు, పరమపిత బ్రహ్మకు మరో 100 దేవ సంవత్సరములు జీవిత పరిమితి యిస్తారు. పైన వివరించి విధముగా మరలాసృష్టి, స్థితి మరియు ప్రళయములు నిరంతరము జరుగుతూనే ఉంటుంది. దీనికి ఒక ఆది మరియూ అంతము ఉండదు (భగవద్గీత 8 : 19). ఈ విశ్వము ఒక వ్యవహారిక సత్యము (అనగా ఆ సమయమునకే అది సత్యము). దీనికి ఒక ఆది మరియు అంతము ఉంది. ఎల్లప్పుడూ మార్పు చెందుతూనే ఉంటుంది. ఇది శాశ్వతమైనది అయితే మార్పు ఉండదు. అందుచే ఇది శాశ్వతమైనది కాదు. ఇది పరమార్థిక సత్యము (శాశ్వతమైన, అంతిమ సత్యము) కాదు. పరమాత్ముడు ఒక్కడే మార్పులేని, శాశ్వతమైన సత్య స్వరూపుడు. ఎవరైతే బ్రహ్మానుభూతి పొందుతారో వారికి ఈ విశ్వము ఒక భ్రాంతి లేదా భ్రమలా కనిపిస్తుంది. ఈ సృష్టి మొదలు ప్రస్తుతము వరకూ జరిగిన ప్రధాన సంఘటనలు మరియు భారత దేశములో జరిగిన ప్రధాన సంఘటనలు భాగవతములో, పురాణములలో వివరముగా వర్ణించారు.

పరమాత్ముడు, ప్రస్తుత పరమపిత బ్రహ్మను 15697,39,49,114 మానవ సంవత్సరముల క్రితము (2012 వరకూ) సృష్టించారు. మొదటి కల్పములో (పరమపిత బ్రహ్మకు మొదటి రోజు (పగలు) సమయము) బ్రహ్మ కల్పము అంటారు. బ్రహ్మ కల్పములో సృష్టి కొఱకు పరమపిత బ్రహ్మ, పరమాత్ముడు కోసము ధ్యానము చేశారు. పరమాత్ముడు యొక్క కృపతో, సనత్ కుమార, సనక, సనందన, సనాతన అనే నలుగురు బ్రహ్మ కుమారులు కనిపించి, ప్రాకృతిక ప్రళయములో కోల్పోయిన,

ఆత్మ మహాజ్ఞానమును పరమపిత బ్రహ్మకు బోధించారు (భాగవతము 2 : 7 : 5). రెండవ కల్పములో (మొదటి రోజు (రాత్రి) సమయము) పరమపిత బ్రహ్మ విశ్రాంతి తీసుకొని, మూడవ కల్పము (రెండవ రోజు (పగలు) సమయములో పరమపిత బ్రహ్మ, సంకల్పముతో, బ్రహ్మాండమును, పదిమంది మహర్షులను (వీరిని మానస పుత్రులు, ప్రజాపతులు అంటారు) సృష్టించారు. ప్రజాపతులు జీవులందరికీ తండ్రి అంటారు. వారు మరీచి, అత్రి, అంగిర, పులస్య, పులహ, క్రతు, వసిష్ట, దక్ష, భృగు, మరియు నారద. వీరిలో మొదటి ఏడుగురు సప్త మహర్షులు. తరువాత దేవతలను మరియు అసురలను (రాక్షసులు) సృష్టించారు. తరువాత మొదటి మన్వంతరములో తనకు సృష్టిలో సహాయము కొఱకు మనువు స్వాయంభువను సృష్టించారు. మహర్షులు, పరమాత్మని కృపతో, వేదములను గ్రహించి ప్రజలకు అందచేశారు. క్రమేణ ప్రకృతి పరిణామములు చెంది మానవ నాగరికత అభివృద్ధి చెందుతూ వస్తుంది.



# ధర్మము

ధర్మము అనగా సుగుణము, న్యాయబద్ధమైనది, నైతికమైనది. ఒక వ్యక్తి ఏ ఆలోచనలు, వాక్కులు, క్రియలు లేదా విధులు నిర్వర్తిస్తే, తనకు (జీవాత్మకు), సమాజమునకు, మానవత్వమునకు మరియు అన్ని జీవులకు మంచి లేదా మేలు జరుగుతుందో అదే ధర్మము. మరియు ఏ ఆలోచనలు, వాక్కులు, క్రియలు, పద్ధతులు మరియు సాధనలు ఈ ప్రపంచములో భౌతిక మరియు మానసిక ఆనందము మరియు జీవాత్మ అంతిమ లక్ష్యము అయిన మోక్షము (పరమాత్మను) పొందుటకు సహకరిస్తాయో అదే ధర్మము. '**ధరయతి ధర్మ ఇతి అహు**' '**పృధివిమ్ ధర్మన ధ్రితం**' అనగా ఏదయితే ఈ విశ్వమును సంరక్షిస్తోందో అదే ధర్మము. '**ధర్మో రక్షిత రక్షతః**' అనగా ఎవరైతే ధర్మమును రక్షిస్థారో, వారిని ధర్మము రక్షిస్తుంది. శ్రీరాముడు ధర్మమునకు ప్రతీక.

ధర్మ సూత్రములలో ముఖ్యమైనవి స్వీయ నియంత్రణ మరియు త్యాగము. ధర్మము రెండు విధములు. (ఎ) **'అపర** (వ్యవహారిక, ప్రాపంచిక) ధర్మము'. ధర్మము మానవులలో సత్వ గుణమును అభివృద్ధి చేసేందుకు హిందూ ధర్మ పవిత్ర గ్రంధములలో వివరించిన ఏ కర్మలు, స్వార్ధము లేకుండా చేయదగినవో (మంచివి) లేదా చేయకూడనివో (చెడువి) ఆదేశములు మరియు క్రమశిక్షణ. ఇవి పరమాత్మునిపై నమ్మకము పెంచుతాయి. ఇవి వారికి ఈ జీవితములో తృప్తిని ఇచ్చి, తదుపరి జీవితములో ఉత్తమ గమ్యమును నిర్దేశించబడుతుంది. దేశ, కాల పరిస్థితులను బట్టి, అపర ధర్మము మారుతూ ఉంటుంది. అపర ధర్మము సాధారణ లేదా

ప్రాథమిక స్థాయి. ఇది తదుపరి స్థాయి అయిన పర ధర్మము స్థాయికి ఎదుగుటకు మొదటి దశ. తదుపరి దశ (బి) **'పర'** (పరమాత్ముడు) ధర్మము' లేదా **'పరమార్థిక ధర్మము'**. ఇది ప్రధాన ధర్మము. జీవాత్మ యొక్క అంతిమ లక్ష్యము అయిన పరమాత్ముని పరిపూర్ణత పొందుటకు, పరమార్థిక ధర్మము నిర్ధారించగలదు. ఎవరైతే ఏకోరిక లేకుండా పరమాత్మునిపై అనన్య మరియు నిరంతరమూ భక్తి పారవశ్యము కలిగి ఉంటారో వారు మహామాయ యొక్క బానిసత్వము నుండి విముక్తి (జనన, మరణ పునఃజన్మ యొక్క చక్రము నుండి విముక్తి) పొంది పరమాత్ముని పరిపూర్ణత పొందగలరు (భాగవతము 11 : 14 : 21). ఏధర్మము అయినా భక్తిని ప్రేరేపించకపోతే అది ధర్మమే కాదు (భాగవతము 1 : 2 : 8). ధర్మము భక్తితో ఉంటేనే, అదేయే ధర్మము (భాగవతము 11 : 19 : 27). జీవాత్మకు పరమాత్మునిపై మనస్సులో నికల్మషమైన, నిర్మలమైన మరియు నిష్కామమైన ప్రేమ, అంకితభావము మరియు భక్తి ఉండవలెను (భాగవతము 1 : 2 : 6). భక్తి అన్ని ధర్మములకు, ప్రాంతములకు, సాంప్రదాయములకు, ఆచారములకు, పద్ధతులకు అతీతము. భక్తికి వయస్సుతో, హొదాతో, అంతస్తుతో, కులముతో, ధనముతో, చిన్నా, పెద్ద, తక్కువ లేదా ఎక్కువ అనే వ్యత్యాసమే లేదు. పరమాత్ముని ముందు జీవులు అంతా సమానమే. భక్తిని ఏ వ్యక్తియైనా, ఏ దుస్తులతోనైనా, ఏ పద్ధతిలోనైనా, ఏ ప్రదేశములోనైనా, ఏ సమయములోనైనా పాటించవచ్చు. భక్తి విశ్వవ్యాప్తి ధర్మము. అటువంటి ధర్మము ఏదయితే భక్తియే ఆధారముగా, ప్రధానముగా స్థాపిస్తుందో అది విశ్వ ధర్మము, అదియే సనాతన ధర్మము (శాశ్వతమైన ధర్మము) అని పిలుస్తారు. పరమాత్ముడు ధర్మ సంస్థాపనమునకు అధిష్టానము వహిస్తాడు (భగవద్గీత 4 : 8). సనాతన (శాశ్వతమైన) ధర్మము పరమాత్మనిలో స్థాపించబడి,

శక్తిగా ఆయనియందే ఉన్నది. పరమాత్ముడు సృష్టి సమయములో సనాతన ధర్మమును వేదములు ద్వారా పరమపిత బ్రహ్మకు బహిర్గతము చేసినారు. వాటినే ఋషులు వేదములు, ఉపనిషత్తులు మరియు పురాణములు ద్వారా మానవులకు పునరుత్పత్తి చేశారు.

## ధర్మము

సద్గుణములు, సత్ప్రవర్తన యొక్క నాలుగు స్తంభములు (భాగవతము 3 : 12 : 41):

- **విద్య:** పరమాత్మ జ్ఞానము ద్వారా పొందిన పవిత్రత.
- **దానము:** కరుణతో కూడిన దాతృత్వము.
- **తపస్సు:** కఠిన ధ్యానము, తపస్సు.
- **సత్యము:** యదార్ధము.

## వ్యక్తిగత ధర్మములు

ప్రతీ వ్యక్తి క్రింద పేర్కొన్న సూత్రములను వారి నైతిక మరియు నీతి విధులను అనుసరించవలెను:

- దమ: జ్ఞానేంద్రియములను, కర్మేంద్రియములను స్వాధీనములో ఉంచుకొనవలెను.
- అర్జవ: నిజాయతీగా ఉండవలెను.
- అహింస: ఏ జీవినీ హింసించరాదు.
- సత్య: ఆలోచనలు, మాటలు మరియు క్రియలలో ఎల్లప్పుడూ సత్యముగా, నిజాయతీగా ఉండవలెను.
- అక్రోధ: ఎప్పుడూ కోపము తెచ్చుకోకూడదు.

- సంతోష: ధర్మ బద్ధముగా లభించిన వాటితో  తృప్తిగా మరియు ఆనందముగా ఉండవలెను.
- బ్రహ్మచర్యము: శరీరమునకు  సంబంధించిన  కోరికలను స్వాధీనములో ఉంచుకొనవలెను.
- త్యాగము: స్వార్ధమును త్యజించుము.
- అపైశున: ఎవరిమీదా చాడీలు చెప్పవద్దు.
- అపరిగ్రహః: అనవసరమైన బహుమతులు ఆమోదించకుము.
- హ్రీ: వినయముగా ఉండుము.
- మార్దవ: సౌమ్యముగా ఉండుము.
- దయ: దయ మరియు కరుణ కలిగి ఉండుము.
- శాంతి: మనస్సును స్వాధీనములో ఉంచుకొని ప్రశాంతముగా ఉండుము.
- క్షమ: క్షమించటము ఒక మహాలక్షణము.
- శౌచ: శరీరమును మరియు మనస్సును పవిత్రముగా ఉంచుకొనుము.
- అద్రోహ: ఎవ్వరికీ ద్రోహము చేయకూడదు.  దుర్బుద్ధి, పగ లేకుండా ఉండుము.

**<u>గమనిక:</u>** పైన పేర్కొన్న లక్షణములతో సంపూర్ణ పరిపూర్ణత సాధించుట  ప్రారంభ దశలో చాలా కష్టము. కానీ ఒక నిర్దిష్ట దశ తర్వాత, అభివృద్ధి కోసము నిరంతర కృషి చేస్తే  సంపూర్ణ పరిపూర్ణత పొందవచ్చును).

## పరివారిక (కుటుంబ) ధర్మము

పరివారిక (కుటుంబ) ధర్మము వివాహము అయిన

తరువాత మొదలవుతుంది. భార్య భర్తల మధ్య పరస్పర ప్రేమ, త్యాగము మరియు గౌరవము ఉండవలెను. భార్యను **"ధర్మపత్ని"** అని పిలుస్తారు. భార్య యొక్క సహకారము భర్తకు ఒక అద్భుతశక్తి. ఒకరు లేకుండా మరొకరికి గుర్తింపు ఉండదు. (ఉదాహరణ: అగ్ని మరియు దాని దహన శక్తి, కన్ను మరియు చూపుడు శక్తి). భార్యను **"సాహధర్మ చారిణి"** అనికూడా పిలుస్తారు (అనగా భార్య, భర్త యొక్క ఆధ్యాత్మిక సాధనలో భాగస్వామి) భార్యను **"అర్ధాంగిని"** అనికూడా పిలుస్తారు (అనగా భార్య, భర్త శరీరము యొక్క సగభాగము) (బృహదారణ్యకోప నిషత్ 1 లేదా 3 : 4 : 3). హిందూ ధర్మ విధులలో రెండు ఆధ్యాత్మిక మార్గములు ఉన్నవి: (ఎ) ప్రవృత్తి మార్గము వివాహము అయినవారి ప్రాపంచిక కార్యకలాపాలతో ముడిపడి ఉన్నవారికి. (బి) నివృత్తి మార్గము సన్యాసము స్వీకరించి, ప్రాపంచిక కార్యకలాపాల నుండి ఉపసంహరణము చేసుకుని ఉన్నవారికి (భాగవతము 1 : 9 : 26 నుండి 28 వరకు). మానవ జీవితము యొక్క అంతిమ లక్ష్యము, పరమాత్మతో ఇక్యత. పరివారిక (కుటుంబ) ధర్మము ద్వారా ఈ లక్ష్యము పొందుతారు (**<u>గమనిక:</u>** గృహస్త ఆశ్రమము, ప్రవృత్తి మార్గము కూడా - పేజి సంఖ్యలు 79, 80, 198, 199 చూడుము):

- ❖ హిందూ ధర్మ పవిత్ర గ్రంధములలో వివరించిన ప్రకారము కర్తవ్యమును విధులను (చర్యలను) నిర్వర్తించుము.
- ❖ కర్మఫలితములను పరమాత్మునకు అర్పించుము.
- ❖ ఎప్పుడూ సత్యమునే పలుకుము.
- ❖ జీవితము పరమాత్మునకు, పేదలకు, నిస్సహాయములో ఉన్నవారికి సేవ కొఱకు ఉద్దేశించబడినది.

- జీవనోపాధి నిజాయితీ, ధర్మ మార్గముల ద్వారా సంపాదించుము.
- నిజాయితీగా కష్టపడి ధనమును ఆర్జించుము.
- **“మాతృ దేవోభవ పితృ దేవోభవ ఆచార్య దేవోభవ అతిధి దేవోభవ"** తల్లిదండ్రులు, విద్యను ఇచ్చిన గురువు, ఇంటికి వచ్చిన అతిధి పరమాత్మునితో సమానము. పరమాత్ముని ప్రతినిధులు. ప్రతీవారికి వారి భౌతిక శరీరము తల్లిదండ్రులు ద్వారా లభించినదని మరచిపోకూడదు. వారి బాగోగులు చూస్తూ వారిని ఎల్లప్పడూ సంతోషపరచుము.
- తల్లిదండ్రులకు, పిల్లలకు, పేదలకు మరియు భార్యకు, ఆహారము ఇచ్చిన తరువాతే ఆహారము తీసుకొనవలెను. భార్యాభర్తలకు ఒకరికి మరొకరిపై పూర్తి విశ్వసనీయత కలిగి ఉండవలెను.
- పెద్దలు, స్త్రీల ఉనికినిలో ఎప్పుడూ అక్రమ భాష ఉపయోగించరాదు.
- సంపద, అధికారము మరియు స్థాయి గురించి గొప్పలు చెప్పకూడదు.
- దుస్తులు మరియు బాహ్యరూపమునకు అధిక శ్రద్ధ చూపకూడదు.
- శరీరమును పరిశుభ్రముగాను, హృదయములో మరియు మనస్సులో పవిత్రముగా ఉంచవలెను.
- పిల్లలను ప్రేమతో పెంచి, సరైన విద్యాబుద్ధులు నేర్పించి, వివాహము చేయవలెను.
- క్రియాశీలుడై ఉండవలెను. సోమరి మరియు పిరికివాడు కాకూడదు.

- సోదరులకు, సోదరీమణులకు (పేద వారయితే) మరియు పేదవారికి సహాయము చేయవలెను.
- మంచివారిని మరియు ఉత్కృష్టమైనవారిని గౌరవించుము.
- సామాజిక సేవ చేయుము. మొక్కలు, చెట్లు నాటుము.
- స్వార్ధరహిత చర్యలు, ఆధ్యాత్మిక అభివృద్ధికి సహాయము చేయుము.

  **గమనిక:** వ్యక్తిగత ధర్మములోని అంశములు కూడా వర్తిస్తాయి. పేజి సంఖ్యలు 57, 58, గమనిక కూడా పై లక్షణములకు వర్తిస్తుంది.

## సమాజ ధర్మము

సమాజము సమీకృతముగానూ మరియు పరిశుభ్రముగానూ ఉండుటకు, ప్రతీవ్యక్తి క్రింద పేర్కొన్న విధులను, నియమములను పాటించవలెను.

- అహింస: "**అహింసో పరమో ధర్మః**". అహింస, క్రమశిక్షణ మరియు సద్గుణములు.
- అపహరణ: ఎవరి వస్తువులు అపహరించ కూడదు.
- సత్యము: "**సత్యమేవ జయతే**". ఎల్లప్పుడూ సత్యమే పలుకుము. సత్యమే జయించును.
- కోపము మరియు మోహము: కోపమును మరియు మోహమును నియంత్రించుకోనుము.
- దాతృత్వము: పేదలకు, వికలాంగులకు, వృద్ధులకు శక్తికొలది దానము చేయుము.

❖ ఆతిధ్యము: అతిధులకు వినయముతో ఆతిధ్యము ఇయ్యవలెను.
❖ దయ మరియు వినయము: పొరుగున ఉన్నవారితో దయ మరియు వినయముతో ఉండుము.

## రాష్ట్ర ధర్మము

ప్రతి వ్యక్తికి వారి దేశము పట్ల కొన్ని బాధ్యతలు మరియు విధులు ఉన్నవి. ఆ బాధ్యతలు  నెరవేర్చుటకు వారు దేశము కొఱకు కొన్ని త్యాగములు  చేయవలెను.

## మానవ ధర్మము

ప్రతి వ్యక్తికి మానవత్వము పట్ల కొన్ని బాధ్యతలు మరియు విధులు ఉన్నవి. అందరూ, అన్ని జీవుల పట్ల దయ కలిగి ఉండవలెను. ఇతర జీవులకు సేవ, సహాయము మరియు కొంత త్యాగము చేయవలెను.

## ధర్మము స్థాయిలు

ధర్మము స్థాయిలు - అనుబంధము "ఎఫ్" పేజి సంఖ్య 226 చూడుము.

## అరిషడ్ వర్గములు (అందరిలోనూ ఉండే 6 దుష్ట సూక్ష్మ శక్తులు)

ప్రతి జీవులలోనూ మహామాయ యొక్క గుణముల ప్రభావముల వలన అరిషడ్ వర్గములు (అందరిలోనూ ఉండే 6 దుష్ట సూక్ష్మ శక్తులు) ఉండును (భగవద్గీత 2 : 62, 63, 71; 3 : 37

నుండి 40 వరకు; 6 : 24; 16 : 21). మహా మాయ యొక్క బానిసత్వము వలన కలిగే అవిద్య (అజ్ఞానము, అహంకారము) వలన కలిగే కామము, క్రోధము, లోభము, మోహము, మదము మరియు మాశ్చర్యము వలన కలిగే దుర్గుణములు నిరంతరము జీవాత్మ సమతౌల్యమును తప్పించును.

- **కామము (కోరిక):** ఇతర జీవులపై లేక ప్రపంచముపు వస్తువులపై జ్ఞానేంద్రియముల ద్వారా మనస్సులో కోరిక పుడుతుంది. కోరిక తీరితే లోభమునకు దారితీస్తుంది. కోరిక తీరకపోతే క్రోధమునకు దారితీస్తుంది.
- **క్రోధము (కోపము):** కోపము ఎక్కువ అయితే లోభమునకు దారితీస్తుంది.
- **లోభము (దురాశ):** లోభము ఎక్కువ అయితే మోహమునకు దారితీస్తుంది.
- **మోహము (ప్రేమ):** మోహము ఎక్కువ అయితే సమతౌల్యమును తప్పుతుంది.
- **మదము (అహంకారము):** సమతౌల్యము తప్పితే అహంకారము ఎక్కువ అవుతుంది.
- **మాశ్చర్యము (అనురాగము):** మాశ్చర్యము వలన అనుభందము, స్వార్ధము మరియు అసూయ పెరుగును.

అరిషడ్ వర్గములు మితిమీరితే సమతౌల్యము తప్పి, బుద్ధి (వివక్షత) నష్టపడుతుంది. బుద్ధి నష్టముతో జ్ఞాపకశక్తి క్షీణించి మైమరుపుతో, అయోమయముతో సర్వనాశనమునకు దారితీస్తుంది (భగవద్గీత 2 : 63). అరిషడ్ వర్గముల వలన అనేక దుర్గుణములు (అసూయ, ద్వేషము, దురాశ, అబద్ధము, దొంగతనము, దుర్మార్గము, కిరాతకము, కపటనాటకము, వంచన,

పాపములు చేయుటకు ఉన్ముఖత్వము) పెరుగును. దుర్గుణములకు ప్రదేశములు పాచికలు (అప్రామాణికత), మద్యము (నిషా), మహిళలు (తీవ్రమైన భావావేశములు, వాంఛలు) మరియు క్రూరత్వము (భాగవతము 1 : 17 : 32, 38; 9 : 19 : 14). వాటి ప్రభావములతో వివక్షతలేని చర్యల వలన తనకు, ఇతరులకు మరియు ధర్మమునకు అపరిమిత నష్టము, ఫలితముగా సమాజానికి హాని మరియు బాధలకు కారణము అవుతారు. ఎవరైతే ఈ దుష్ట సూక్ష్మ శక్తులను (దుర్గుణములను) నియంత్రించుకుంటారో వారికి ఆధ్యాత్మిక అభివృద్ధికి తోడ్పడుతుంది (అనుబంధము "జి" పేజి సంఖ్యలు 227, 228 చూడుము).

## కామము (కోరిక)

ఇంద్రియములు, మనస్సు మరియు బుద్ధి కోరికలకు పీఠములు. ఇవి తృప్తిపరచలేని అగ్ని వంటివి. ఇవి జీవాత్మను తప్పుత్రోవ పట్టించును (భగవద్గీత 3 : 39, 40). కోరికలు రెండు విధాలుగా పుట్టును. (ఎ) ఇతర జీవులను, ప్రపంచపు వస్తువులను గమనించి వాటి కోసము కోరిక పుట్టును. (బి) వాసనలు లేదా సంస్కారములు (అనగా గత జీవితములోని కోరికలు సూక్ష్మ రూపములో అవ్యక్తముగా మనస్సులో నాటుకున్నవి). కోరికలలో చాలా స్థాయిలు ఉన్నవి. కోరికలు స్థాయి పెరుగుతున్న కొలదీ, బాధలు మరియు సమస్యలు స్థాయి కూడా అంతగా పెరుగుతాయి. కోరికల స్థాయిలు క్రింద వివరింపబడినవి:

- స్పర్థ: కోరిక అనే భావన.
- ఇచ్చా: కోరిక పూర్తిగా వ్యక్త రూపము దాల్చినది.

- తృప్తి: జీవితమునకు  ఆవశ్యకమైన, అవసరమైన కనీస ప్రాథమిక అవసరములతో సంతృప్తి పొందుట (ధర్మము).
- తృష్ణ (ఆశ): జీవితమునకు అవసరమైన కనీస ప్రాథమిక అవసరముల కంటే మరింత ఎక్కువ కావాలనే కోరిక (అధర్మము).
- అత్యాశ:  తనకు అవసరము లేకపోయినా మరింత ఎక్కువ  కావాలనే  కోరిక  (అధర్మము).
- దురాశ:  ఎవ్వరకూ ఏమీ  లేకుండా, ఎవ్వరు ఏమైనా అన్నీ తనకే కావాలనే కోరిక (అధర్మము).

## పంచ కోశములు

అన్ని జీవుల శరీరములకు ఐదు పొరలు, తొడుగులు లేదా కోశములు ఉన్నవి (తైత్తిరీయోప నిషత్ 2 : 5 : 1 మరియు అధ్యాయము 3 విభాగము 1 నుండి 6 వరకు).

- అన్నమయ కోశము: పంచ భూతములతో తయారుచేయబడ్డ  భౌతిక స్థూల శరీరము.
- ప్రాణమయ కోశము: భౌతిక శరీరము యొక్క జీవనోపాధికి అవసరమైన సూక్ష్మ శ్వాస.
- మనోమయ కోశము: సూక్ష్మమైన మనస్సు.
- విజ్ఞానమయ కోశము: సూక్ష్మమైన బుద్ధి.
- ఆనందమయ కోశము: సూక్ష్మమైన ఆనందము (ఆధ్యాత్మిక తొడుగు).

## అవిద్య (అజ్ఞానము) లేదా పంచ క్లేశములు

అవిద్య (అజ్ఞానము అనగా, జీవాత్మ శరీరముతో

తాదాత్మ్యము లేదా మమైక్యము చెంది శరీరమే నేను (జీవాత్మ) అని భావించుట) వలన శరీరము యొక్క నొప్పి/బాధ యొక్క మూలములను పంచ క్లేశములు అందురు (భాగవతము 3 : 9 : 20 మరియు 10 : 84 : 33; యోగ సూత్రములు 2 : 3).

- అవిద్య: ప్రాధమిక అజ్ఞానము.
- అస్మితము: అహంకారము.
- రాగము: ఆకర్షణ మరియు అనుబంధము.
- ద్వేషము: విరక్తి, విముఖత, లేదా ద్వేషము.
- అభినివేశము: మరణము యొక్క భయము. జన్మించినవి అన్నీ మరణించవలసినదే. మరణము అనివార్యమైన అంతిమ వాస్తవము. ఈ సత్యము తెలుసుకుని, మరణమును ఏవికారము లేకుండా ఆమోదించడానికి మానసిక వైఖరి అవలంభించుకొనవలెను.

**అజ్ఞానము:** ఐదు విధముల అజ్ఞానము (భాగవతము 3 : 12 : 2).

- తామసము: నేను (జీవాత్మ) గురించి అజ్ఞానము.
- మోహము: నేను (జీవాత్మ) శరీరముతో తాదాత్మ్యము చెంది శరీరముమే నేను అనే భావన.
- మహామోహము: శరీరమునకు ప్రపంచపు ఆనందముల కోసము తృష్ణ.
- తమసిరము: కోపము.
- అంధతమసిరము: మరణముతో తన (జీవాత్మ) అంతము అవుతుందనే భావన.

  **<u>గమనిక:</u>** ఏ మంచికర్మలు చేసినా (మంచి పనులు మాత్రమే) ఫలితములు కోరకుండా లేక ఆశించకుండా

పరమాత్మనకు అర్పితము చేయవలెను (భగవద్గీత 5 : 10; 9 : 27; ఈశావాస్యోప నిషత్ - 1).

**"ఏ తత్ ఫల సర్వం శ్రీపరమేశ్వరార్పణమస్తు"**
(ఏ మంచికర్మలు (మంచి పనులు మాత్రమే) చేసినా వెంటనే, ఆ కర్మ ఫలములు శ్రీపరమాత్మనకు అర్పిస్తున్నాను).




**“శ్రీరామ రామ రామేతి రమే రామే మనో రమే**
**సహస్ర నామ తత్తుల్యం రామ నామ వరాననే"**

**<u>అర్థము:</u>** శ్రీరామ శ్రీరామ శ్రీరామ అని మూడు మార్లు మనస్సులో రమించిన వారికి విష్ణు మరియు శివ సహస్రనామములు జపించినంత ఫలములు రామ నామము ఇచ్చును. రామనామము అంత మహాశక్తివంతమైన మహా మంత్రము.

# హిందువుల జీవన విధానము

మన ఋషులు, పూర్వీకులు హిందువుల జీవన విధానములలో హిందూ ధర్మ పవిత్ర గ్రంధములలో ఉన్న అంశములను (కర్మ యోగము, జ్ఞాన యోగము మరియు భక్తి యోగము) జోడించి ఏర్పాటు చేశారు. అనగా హిందువులు వారికి తెలియకుండానే ఆ అంశములు పాటించేవారు. ఇందులో కర్మ యోగమునకు అధిక ప్రాముఖ్యత ఉంది. కాబట్టి భరత దేశము కర్మ భూమి అని కూడా పిలుస్తారు. ఏయే కర్మలు చేయతగినవి లేదా చేయకూడనివి అనే అంశములపై హిందూ ధర్మ పవిత్ర గ్రంధములు మూల ఆధారములు. హిందువులు అందరూ హిందూ ధర్మ పవిత్ర గ్రంధములలోని సూచనలను, ఆజ్ఞలను, ఆదేశములను తప్పక పాటించవలెను (భగవద్గీత 16 : 24). హిందువుల యొక్క ప్రధాన జీవనోపాది వ్యవసాయము మరియు గోవుల సంరక్షణ. వర్షపు మరియు శీతాకాలములలో గోవులకు రాత్రి ఆశ్రయముల కొఱకు గోశాలలను ఏర్పాటు చేసుకునేవారు. గోశాలకు సంస్కృత పదము గోత్రము. గోసంపద ఎక్కువగా పెరిగినప్పుడు రాత్రి ఆశ్రయముల కొరత కారణముగా గోవులను ఉమ్మడి గోశాలలలో ఉంచేందుకు ఏర్పాటు చేసుకునేవారు. అందుచే గోవులు కలసిపోవటముతో కుటుంబముల మధ్య వివాదములు వచ్చేవి. వారి వివాదములను పరిష్కరించుటకు ఋషులు, యోగీశ్వరులు, మహాపురుషులు మరియు మహాత్ములను న్యాయమూర్తులుగా (గోత్రాధిపతులుగా) ఎంచుకునేవారు. ప్రజలు మరియు వారి వారసులు వారి గుర్తింపు కొఱకు గోత్రాధిపతుల పేర్లను ఉపయోగించుకొనేవారు. హిందువులందరికీ గోత్రాధిపతులు ఉంటారు. ఉదాహరణ -

భరద్వాజ, శ్రీవస్తవ, కశ్యప, కౌండన్య మొదలైన గోత్రములు.

## వర్ణములు

మానవులలో నాలుగు వర్ణములు ఉన్నవి. చర్మము, రక్తము, మాంసము, ఎముకలు మరియు జీవాత్మకు ఏ వర్ణము లేదు. వర్ణములు సమాజము మరియు ప్రాపంచిక వ్యవహారములు క్రమపద్ధతిలో జరుగుటకు మాత్రమే నిర్ణింపబడినవి (నిరాలంబ ఉపనిషత్ - 6 ). జన్మతః మానవులందరూ శూద్రులే అని నిర్ణింపబడినది. వర్ణములు మానవులలో ఉండే స్వాభావిక గుణాత్మక (మహామాయ యొక్క గుణములు, లక్షణములు, కర్మలు) ఆధారముగా నిర్ణింపబడినవి. **మానవులలో స్వాభావికముగా ఉండే గుణములు మరియు కర్మలు అనుసరించి సమాజములో నాలుగు వర్ణములు నాచేత సృష్టింపబడినవి** (భగవద్గీత 4 : 13; 18 : 41, 42, 43, 44). శ్రీకృష్ణ పరమాత్మ భగవద్గీతలో మహామాయ యొక్క గుణముల ప్రభావములను చాలా అధ్యాయములలో విస్తృతముగా వివరించినారు. ఎవరిలోనయితే సహజముగా సత్వ గుణము యొక్క లక్షణములు (జ్ఞానము, నిజాయితీ, నిష్కల్మషమైన మనస్సు, అహింస, దయ, నిస్వార్ధము, కరుణ, దాతృత్వము, ఆధ్యాత్మిక మరియు నైతిక సుగుణములు) అత్యధికముగా ఉన్నవో వారిని సాంకేతముగా బ్రాహ్మణులుగానూ, గురువులుగానూ (ఇతరులకు ఆధ్యాత్మిక జ్ఞానము బోధింపతగినవారు) పరిగణింపబడినారు. ఎవరిలోనయితే సత్వ గుణము మరియు రజో గుణము యొక్క లక్షణముల మిశ్రమము (దయ, దానము, తీవ్రమైన భావావేశములు మరియు యుద్ధము, రాజ్య పాలన లక్షణములు) అత్యధికముగా ఉన్నవో వారిని

సాంకేతముగా క్షత్రియులుగా పరిగణింపబడినారు. ఎవరిలోనయితే రజో గుణము మరియు తమో గుణముల యొక్క మిశ్రమ లక్షణములు (తీవ్రమైన భావావేశములు మరియు అజ్ఞానము) అత్యధికముగా ఉన్నవో వారిని (వ్యాపారస్తులు, సేద్యకారులు, పశుపోషకులు, కళాకారులను) సాంకేతముగా వైశ్యులుగా పరిగణింపబడినారు. ఎవరిలోనయితే తమో గుణము (సోమరితనము మరియు అజ్ఞానము) ప్రబలముగా ఉన్నవో వారిని సాంకేతముగా శూద్రులు (సేవకులుగా) పరిగణింపబడినారు (భాగవతము 10 : 24 : 20).

**<u>గమనిక:</u>** ఈ విధమైన వర్గీకరణము మతాచార్యులు లేదా ఉపాధ్యాయులు, పాలకులు (రాజకీయ నాయకులు), వ్యాపారవేత్తలు, మరియు కార్మికులు ఏదో ఒక విధముగా వర్గీకరణము ప్రతీ ఇతర ధర్మములలోనూ, సమాజములోనూ మరియు దేశములోనూ ఉన్నవే.

పూర్వము వర్ణముల మధ్య ఉత్తమము లేక ఎక్కువ, అధమము లేక తక్కువ వర్ణము అనే భావనే లేదు. పవిత్ర విధులను (యజ్ఞములు, యాగములు) నిర్వర్తించుటకు అన్ని వర్ణముల (ముఖ్యముగా శూద్రుల) యొక్క సహకారము అత్యవసరము. అందులో శూద్రుల స్థానము అతిముఖ్యము మరియు అతిఉత్తమము. బ్రాహ్మణుల పురుషార్ధము (జీవిత లక్ష్యము) మోక్షము (నాలుగువది) పొందుట. క్షత్రియుల పురుషార్ధము (జీవిత లక్ష్యము) కామము (మూడవది) భోగములను అనుభవించుట. వైశ్యుల పురుషార్ధము (జీవిత లక్ష్యము) అర్ధము (రెండవది) ధనార్జన. శూద్రుల పురుషార్ధము (జీవిత లక్ష్యము) ధర్మము (మొదటిది) ఆధాత్మిక యోగ్యత మరియు మానవ సేవ

(**మానవ సేవయే మాధవ సేవ**). పురుషార్ధములలో ధర్మమునకు ప్రధమ మరియు ఉత్తమ స్థానము. అందుచే శూద్రులు వారి సేవతో, పరమాత్మని  పొందుతారు (భాగవతము 3 : 6 : 33). బ్రాహ్మణులు  పరమాత్మని నోరుని, క్షత్రియులు పరమాత్మని భాహువులను, వైశ్యులు పరమాత్మని తొడలను  మరియు శూద్రులు పరమాత్మని పాదములను సూచిస్థాయి (భాగవతము 2 : 1 : 3; 3 :  6 : 30, 34). శూద్రులు పరమాత్మని పాదములు సూచిస్థాయి అనే  అంశము మీద అనేక వివాస్పదమైన వ్యాఖ్యలు ఉన్నవి. చాలామంది ఈ శ్లోకముల అంతఃరార్ధము పూర్తిగా అవగాహన  చేసుకోకుండా "పాదములు సూచిస్థాయి" పదము బదులు కొంతమంది పాదములనుండి  పుట్టారు అనే అర్ధము తీసుకొని, శూద్రులను పాదములతో పోల్చి తక్కువ చేశారనే  భావనతో  వివాదములు సృష్టించారు. ఈ శ్లోకముల అంతఃరార్ధము, ఆ ఆ వర్ణములకు (ఆ ఆ గుణముల వలన), పరమాత్మని ఆ ఆ అవయవములలో ఉన్న శక్తితో మాత్రమే పోలిక. మరియు పాదములు లేకపోతే ఏ జీవి సుఖముగా జీవించలేవు. అందరూ పరమాత్మని పాదములనే పూజిస్తారు, అందరూ పెద్దల, మహాత్మల పాదములకే నమస్కరిస్తారు. పాదములు ఎంత పూజ్యనీయమో  శూద్రవర్ణము అంత పూజ్యనీయము అని అర్ధము. పరమాత్ముడు సర్వాంతర్యామి. ఈ విశ్వము ఆంతా సమానముగా వ్యాపించి ఉన్నారు. పరమాత్ముడు లేని ప్రదేశమే లేదు. అందుచే సనాతన ధర్మములో రాళ్ళను, పుట్టలను, పర్వతములను, నదులను, చెట్లను, జంతువులను కూడా పరమాత్మనిగా  భావించి పూజించాలని ఉన్నది.

<u>**గమనిక:**</u> ఈ వివాస్పదమైన అంశమును చాలా సంస్థలు, తమ స్వంత ప్రయోజనముల కొఱకు, తారాస్థాయికి

తీసుకుపోయి, సమాజములోనూ మరియు భారత దేశములోనూ విభజినలు  సృష్టించారు. వర్ణముల యొక్క వర్గీకరణ ఒక వ్యక్తి యొక్క స్వాభావిక గుణములు మరియు లక్షణములు ఆధారముగానే వర్ణించబడినది. కాలక్రమేనా అది వారసత్వముగా మారి, స్వాభావిక గుణములు మరియు లక్షణములు లేకుండానే, అర్హతలేని వారు  లేక అసమర్థులు గురువులుగానూ, రాజులుగాను అయి ఆ ఆ పదవులకు అప్రతిష్టలు  తీసుకువచ్చారు. (**గమనిక:**  డాక్టరు కుమారుడు, తగిన విద్యార్హత లేకుండా డాక్టరు  అవలేడు, ఇంజనీరు కుమారుడు, తగిన విద్యార్హత  లేకుండా ఇంజనీరు అవలేడు). కాలక్రమేనా ఈ వారసత్వము తప్పుడు సంకేతమును యిచ్చి ఒక వర్ణముపై మరొక వర్ణము ఆధిక్యత అల్లుకుని,  మతిభ్రమ చెంది సనాతన ధర్మమును వక్రీకరించారు. మహర్షి వాల్మీకి (రామాయణము రచయిత) శూద్ర వర్ణమున జన్మించి, అయన జీవితము యొక్క మొదటి భాగములో క్రూరమైన బందిపోటు దొంగ. భగవాన్ వేద వ్యాసుడు, సత్యవతికు (మత్యకారుని కుమార్తె) జన్మించారు. వారు తమ కఠిన తపస్సుతో తమ గుణములను మరియు లక్షణములను పరిపూర్ణము చేసుకుని మహర్షులు అయ్యారు. మరియు భారతదేశ చరిత్ర  పరిశీలిస్తే  అనేక గొప్ప వ్యక్తులు తక్కువ (ప్రస్తుత నమ్మకము ప్రకారము) వర్ణములలో జన్మించినా మహోన్నతమైన కార్యములు చేశారు. మహాత్మా గాంధీజీ "శూద్రులను అంటరానివారుగా తప్పుడు భావన హిందూ ధర్మములో భాగముగా ఉన్నట్లయితే నేను హిందూ ధర్మమును పాటించను" అన్నారు.

## ఆశ్రమములు (జీవితములో దశలు) (భాగవతము 3 : 12 : 41)

- ❖ బ్రహ్మచర్య ఆశ్రమము (విద్యార్థి దశ).
- ❖ గృహస్త ఆశ్రమము (గృహస్తుని దశ).
- ❖ వనప్రస్త ఆశ్రమము (విరమణ దశ).
- ❖ సన్న్యాస ఆశ్రమము (సన్న్యాసి దశ)

## బ్రహ్మచర్య ఆశ్రమము (విద్యార్థి దశ)

బ్రహ్మచర్యము అనగా పరమాత్మని (బ్రహ్మజ్ఞానము) కొఱకు బ్రహ్మవిద్య ద్వారా అన్వేషణ, అభ్యాసన. పిల్లలకు 5 సంవత్సరములు వయస్సు పూర్తి అయిన పిదప, ఉపనయనము చేసి, విద్యార్థిగా (బ్రహ్మవిద్యను అర్థిస్తూ) విద్యాభ్యాసము కొఱకు గురుకులమునకు (గురువు యొక్క నివాసము) పంపుతారు. గురువు అనగా జీవాత్మకు మరియు పరమాత్మకు మధ్య గోడగా ఉన్న అవిద్యను (అజ్ఞానమును) తొలగించువారు. పరమాత్మని అంశము అయిన జీవాత్మ, మహామాయ యొక్క ఆకర్షణకులోనై స్వయముగా మహామాయ బానిసత్వము స్వీకరించి, పరమాత్మని నుండి విముఖత అయి, మహామాయ బానిసత్వము వలన కలిగిన అజ్ఞానముతో ఉంటాడు. జీవాత్మను ఆవరించిఉన్న అజ్ఞానమును తొలగించితే స్వయంసిద్ధిగా జీవాత్మకు ఉన్న జ్ఞానము ప్రకాశించును. గురువు, అనగా స్వయముగా పరమాత్మని తెలిసికొని, చూసి, పరమాత్మనితో ఒక్కటై, పరమానందమును అనుభవిస్తున్నవారు. గురువు, గురు ప్రార్థన **"గురుర్ బ్రహ్మ గురుర్ విష్ణు గురుర్ దేవో మహేశ్వరః, గురుర్ సాక్షాత్ పరబ్రహ్మ తస్మై శ్రీగురవే నమః"**. బ్రహ్మచర్య ఆశ్రమము

(విద్యార్థి దశ) విద్యాభ్యాసము కోసము విద్యార్థి గురుకులములో గడిపిన సమయము. (**<u>గమనిక:</u>** ఏ ఏ వర్ణము విద్యార్థి ఏ ఏ స్థాయిలో ఉన్నాడో ఆ ఆ స్థాయికి తగిన విద్య మాత్రమే గురువు బోధిస్తారు). విద్యాభ్యాసము పూర్తి అయిన పిదప ఆ విద్యార్థిని 'స్నాతకము' (అనగా విద్య అనే నీటిలో విజయవంతంగా స్నానము చేసినవాడు) అంటారు. గురువు ఆయన ఆశ్రమము (నివాసము) వద్ద విద్యాభ్యాసము పూర్తి అయిన పిదప తన విద్యార్థులకు వీడ్కోలు సమయములో క్రింది అంశములను బోధిస్తారు (త్రైత్తిరీయోప నిషత్ 1 : 11 : 1 నుండి 6 వరకు):

- **సత్యము వద:** ఎల్లప్పుడూ సత్యమే పలుకుము (ఆలోచనలోనూ, మాటలులోనూ మరియు చేతలలోనూ).
- **ధర్మం చెర:** హిందూ ధర్మ పవిత్ర గ్రంధములు ప్రకారము ఎల్లప్పుడూ సద్గుణములను ఆచరిస్తూ మంచి పనులు చేయుము.
- సంతానము, అనే దారమును కత్తిరించకుము, కొనసాగింపుము.
- పరమాత్మని, దేవతల మరియు తల్లితండ్రుల సంక్షేమము, శ్రేయస్సు, హిందూ ధర్మ పవిత్ర గ్రంధముల అధ్యయనము, బోధనలను మరియు విధులను నిర్లక్ష్యము చేయకుము.
- ఎల్లప్పుడూ సమతుల్యముగా, స్వీయ నియంత్రముగా ఉండుము.
- నీ విధులను సంతోషముగా, ఉల్లాసముగా నిర్వర్తించుము.
- **"మాతృ దేవోభవ, పితృ దేవోభవ, ఆచార్య దేవోభవ, అతిధి దేవోభవ"** (తల్లి, తండ్రి, గురువు, అతిథి నీకు భగవంతునితో సమానము).

- నిష్కళంకమైన పనులు సాధన చేయుము.
- దానము, (విశ్వాసముతో, విధేయతతో, ప్రేమతో, దయతో, నమ్రతతో, సిగ్గుతో, భయముతో, ఆనందముతో మరియు పుష్కలముగా), ఇవ్వవలెను.
- ఎప్పుడైనా, యేవిధమైన సందేహము వచ్చినా మహాత్ముల పద్ధతులను అనుసరించుము.
- ఇవి ఆదేశములు, బోధనలు, సూచనలు. ఇది వేదము యొక్క రహస్యమైన సిద్ధాంతము. కాబట్టి వీటిని పూజించవలెను.

**ఆడపిల్లలు**

పూర్వము ఆడపిల్లలు కూడా మొగపిల్లలు వలె విద్యాభ్యాసము చేసేవారు. సమాజములో మరింత మార్పులు వచ్చిన మీదట, ఆడపిల్లలకు ఇంట్లోనే, పురుష బంధువుల దగ్గర, విద్యాభ్యాసము చేయుట సంప్రదాయముగా మారినది. ఆడపిల్లల సహజ ప్రవృత్తి వలన వారు సామవేదము నుండి వచ్చిన శాస్త్రీయ సంగీతము మరియు శాస్త్రీయ నృత్యము నేర్చుకునేవారు. పూర్వకాలములో అనేకమంది మహిళ గురువులు ఉండేవారు. పురుష గురువులకు ఇవ్వబడిన గౌరవము మరియు స్థానము మహిళ గురువులకు ఇచ్చేవారు. వారిలో ముఖ్యమైన మహిళ ఋషులు, ఋషి గార్గి వాచక్ను, ఋషి వచక్నుని కుమార్తె, వాక్కు (అనగా విద్యకు దేవత అయిన మహాసరస్వతిదేవి) అనే శీర్షిక పొందిన, ఋషి పత్యస్వతి, ఋషి విశ్వవర, ఋషి ఘోష మరియు ఋషి ఆపల. బృహదారణ్యకోప నిషత్ లో మహర్షి యాజ్నవల్క్యను క్లిష్టమైన ప్రశ్నలు అడిగిన వ్యక్తులు తన ధర్మపత్ని మైత్రేయి, మహిళ ఋషి గార్గి వచక్ను.

## హిందూ ధర్మము ప్రకారము స్త్రీలు

ఆదినుండి స్త్రీ శక్తిని గుర్తించి, గౌరవించి, ఆదరించి, ఆరాధించి, పూజిస్తున్నది హిందూ ధర్మమే. హిందూ ధర్మములో అందరి దేముళ్ళలోనూ మహోన్నతమైన దేవత, ఆదిశక్తి "శ్రీలలితామాత". ఇంకా మహాసరస్వతిదేవి (జ్ఞానమునకు అధిష్టాత్రి), మహాలక్ష్మీదేవి (సంపదకు అధిష్టాత్రి) మరియు మహాపార్వతిదేవి (శక్తికి అధిష్టాత్రి) మహోన్నతమైన దేవతలుగా హిందూ సమాజము పరిగణిస్తుంది. త్రీమూర్తులు (బ్రహ్మ, విష్ణు మరియు మహేశ్వరుడు) వారి వారి ధర్మపత్నిల శక్తులు లేకుండా వారి వారి విధులను నిర్వర్తించలేరు. భూమాత, నదులలో ఉన్న స్త్రీ శక్తిని గుర్తించి, ఆరాధిస్తున్నది హిందూ ధర్మమే. మనువు స్వయభువ ప్రకారము **"ఎక్కడైతే స్త్రీలు సత్కరింపబడతారో, దేవతలు సంతోషించి, అక్కడ శుభములు కలుగచేస్తారు. ఎక్కడ స్త్రీలను గౌరవించరో అక్కడ ఏ పవిత్ర కర్మలు (యాగములు, నిత్యకర్మలు) చేయకూడదు, చేసినా ఫలించవు"** (మను స్మృతి 3 : 56).

హిందూ సమాజము స్త్రీలకు అత్యంత గౌరవమిస్తున్నది. హిందూ ధర్మములో ఆడపిల్లలకు స్వయంవరము (స్వయముగా వరుడును ఎంపిక చేసుకొనుట) ద్వారా వారు స్వయముగా ఎంచుకున్న పురుషునితో వివాహము చేసుకునే స్వాతంత్రము ఉన్నది. స్త్రీలు తల్లి, సోదరి, భార్య మరియు కుమార్తె పాత్రలు నిర్వహణలో నిజంగా స్వచ్ఛమైన ప్రేమ, అభిమానము, దయ, పవిత్రత మరియు నిస్వార్ధతో కుటుంబములోని సభ్యులందరినీ ఆకట్టుకుంటారు. వారి ప్రేమ ప్రాపంచిక ఇతర ప్రేమల కంటే ఎంతో ఉన్నతమైనది. హిందూ సమాజములో తల్లి, సోదరి,

భార్య లేదా కుమార్తెకు  ఏ అవమానము జరిగినా తట్టుకోలేరు. కుటుంబములో ఆడపిల్ల  పుట్టినప్పుడు ఆమెను  లక్ష్మీదేవి (సంపదకు అధిష్టాత్రి) వారి ఇంటిలో పుట్టినట్లు భావిస్తారు. కుమార్తె (కుమారుడు కంటె) పెరుగుతున్న సమయములో తల్లిదండ్రులు, బంధువులు అత్యంత ఆనందము పొందుతారు. ఆడపిల్లతో ఆ కుటుంబములో కళ్ళకు ఇంపైన శుభమైనకళ ఉంటుంది. ఆడపిల్ల వివాహ సమయములో 'కన్యా దానము' అనే ప్రక్రియ  అన్ని దానముల కంటె ఉత్కృష్టమైన దానము. కాలక్రమేనా  ధర్మము (సత్వ గుణము లక్షణములు) స్థాయి తగ్గటము వలన ప్రజలు వారి స్వార్ధపూరిత వైఖరి (రజో, తమో గుణముల లక్షణములు) ఎక్కువై, ఆడపిల్ల పుట్టితే ఒక భారము (ఆమె పెంపకము, వివాహము ఖర్చు) మరియు చివరకు వివాహము తర్వాత ఆమె మరొక కుటుంబమునకు వెళ్లిపోవును. అదే మొగ పిల్లవాడు పుట్టితే పెరిగి, సంపాదించి కుటుంబమును పోషిస్తాడు, తరువాత ముసలితనములో తల్లిదండ్రులను చూసుకుంటాడు  మరియు తల్లిదండ్రులను  పున్నాగ నరకము నుండి విముక్తి చేస్తాడు) అనే తప్పుడు  భావన ఏర్పడినది. తల్లి మరియు ఇతర స్త్రీలు కూడా అదే అభిప్రాయమును కలిగిఉండటము వారి స్వంత లింగమునకు  అవమానకరము. కొన్ని రాజపుట్  కుటుంబములలో ఆడపిల్ల పుట్టితే అది  వారికి అవమానకరముగా భావిస్తారు.

## గృహస్త ఆశ్రమము (గృహస్తుని దశ)

గృహస్త ఆశ్రమము వివాహము  అయిన వెంటనే మొదలవుతుంది. హిందూ ధర్మ పవిత్ర  గ్రంధముల యొక్క ఆజ్ఞలను అనుసరించి భార్య మరియు భర్త ఇద్దరూ గృహస్తు

జీవితమును గడుపుతారు. హిందూ ధర్మము ప్రకారము, వివాహ వ్యవస్థ ఒక పురుషుడు మరియు ఒక స్త్రీ మధ్య పవిత్రమైన దైవ సంబంధము (అనుబంధము "ఎచ్" పేజి సంఖ్యలు 229 నుండి 233 వరకు చూడుము). ఈ సంబంధము వారిద్దరి జీవితాంతము వరకూ కొనసాగుతుంది (హిందూ ధర్మములో విడాకులు లేనే లేవు). సరైన వివాహ ముహూర్త సమయములో (ముహూర్త బలము), వివాహ మంత్రములు సరిగ్గా ఉచ్చరిస్తే (మంత్ర బలము), దంపతులుల చూపులు కలసినట్లయితే మరియు మనస్సులో పవిత్రమైన ఆలోచన ఉన్నట్లయితే (మనోబలము) వీటి ప్రభావములతో దంపతుల మధ్య ప్రేమ, అనురాగము, ఉదారభావము మరియు పరస్పర గౌరవము నిత్యమూ, జీవితాంతము కొనసాగుతుంది. ప్రతిజ్ఞలు తీసుకొనే మంత్రములు వారి ఇద్దరి మూడు పురుషార్ధములు (జీవిత లక్ష్యములు) (అనగా ధర్మము, అర్ధము, కామము) నేరవేరుటకు భాగస్వాములు. నాలుగో పురుషార్ధము అయిన మోక్షము పూర్తిగా వ్యక్తిగత బాధ్యత. వివాహ వేడుకలలో ఒకరి నొకరు అర్ధము చేసుకొనుటకు, ఆ జంట జీవితకాల సంబంధము ఎర్పడుటకు మరియు వారి కుటుంబముల మధ్య అవగాహన ఎర్పడుటకు చేస్తారు. వివాహము ఒక పవిత్రమైన దైవ సంబధిత వ్యవస్థ. కాలక్రమేనా ఈ వ్యవస్థకు, వరకట్నము విధానాన్ని పెట్టి ఒక భయంకర చీకటి వ్యాపార సంస్థగా మార్చి, లావాదేవీలు పడుతూ, వివాహబంధముగా మార్చి మలినపరచారు. ప్రస్తుతము వివాహము ఒక పవిత్రమైన దైవ వ్యవస్థకు బదులుగా కోరిక, మోహము మరియు తీవ్రమైన లైంగిక వాంఛగా మారి ఆ పవిత్ర సంబంధము యొక్క విలువ కోల్పోయింది. హిందూ ధర్మము ప్రకారము భార్య, భర్తను పుణ్య కార్యములను చేయమని ప్రోత్సహిస్తూ, ఆ కార్యములకు సహకారము చేస్తునందుకుగాను,

ఆమె భర్త యొక్క పుణ్య ఫలములలో సగభాగము భార్యకు దక్కుతుంది. గృహస్తు తన రోజువారీ విధులు నిర్వహిస్తూ మరియు అతని చర్యలను పరమాత్మునికి అంకితము చేసిన, గృహస్థ జీవితము బంధము, బానిసత్వము కాదు (భాగవతము 4 : 30 : 19). గృహస్తు యొక్క ముఖ్యమైన మార్గదర్శకములు:

- ❖ భార్యను **అర్ధాంగిని** అంటారు. ఈ పదము ఆది దంపతులు పార్వతి పరమేశ్వరులకు ప్రతీక. అదేవిధముగా భార్య, భర్త శరీరము యొక్క సగభాగము (బృహదారణ్యకోప నిషత్ 3 లేదా 5 : 4 : 3). భార్య, భర్త యొక్క ఆధ్యాత్మిక జీవితములో **సహ – ధర్మ - చారిణి** అనగా భాగస్వామి. భార్య మరియు భర్త ఇద్దరూ వారి ఆధ్యాత్మిక అభివృద్ధి కొఱకు మరియు వారి జీవిత అంతిమ లక్ష్యమైన మోక్షము కొఱకు ఒకరికొకరు సహాయము చేసుకొనవలెను.
- ❖ నిత్య అగ్ని హోత్రము (అగ్నికి హోమము) అనే రోజువారీ కర్మ జరుపవలెను. అగ్ని స్వచ్ఛమైన పరమాత్మగా పరిగణింప బడుతుంది మరియు హోమములను సంబంధిత దేవలకు అందిస్తుంది.
- ❖ సత్యమును, విజ్ఞానమును పొందుటకు నిరంతరము వేదములు అధ్యయనము చేయుము. జీవనోపాధిని ధర్మముగా సంపాదించుము.
- ❖ అతిధులను గౌరవించి ఆతిధ్యము ఈయుము.
- ❖ పిల్లలను ప్రేమతో మరియు ఆప్యాయతతో పెంచి వారికి ఉత్కృష్టమైన లక్షణములు నేర్పుము.
- ❖ పేదలకు దానము, (విశ్వాసముతో, విధేయతతో, ప్రేమతో, భయముతో, సిగ్గుతో, ఆనందముతో, నమ్రతతో, దయతో,

పుష్కలముగా), ఇవ్వవలెను.

- అతనితో నివసిస్తున్న తల్లిదండ్రులు మరియు ఇతర బంధువులు యొక్క శ్రద్ధ వహించవలెను.
- స్త్రీలకు గౌరవము, మర్యాద ఇచ్చి వారు సంతోషముగా ఉండేలా చూసుకొనవలెను. మనువు స్వయంభువ మాటల ప్రకారము, "ఏ కుటుంబములో స్త్రీలు బాధతో నివసిస్తూ ఉంటారో ఆ కుటుంబము తప్పక నశించిపోవును. ఏ కుటుంబములో స్త్రీలు సంతోషముగా ఉంటారో ఆ కుటుంబము సిరిసంపదలతో అందరూ సంతోషముగా ఉంటారు."
- భార్యాభర్తలు ఒకరిపై మరొకరికి సంపూర్ణ విశ్వసనీయత ఉండవలెను.
- కుటుంబములో సంతోషకరమైన వాతావరణము సృష్టించుటకు భార్యాభర్తలిద్దరూ భాద్యత వహించవలెను. మనువు స్వయంభువ సందేశము ప్రకారము "ఏ కుటుంబములో భర్త భార్యను, భార్య భార్తను సంతోష పరిచి ఆనందముగా ఉంటారో ఆ కుటుంబములో ఆనందము చిరకాలము ఉంటుంది. అటువంటి కుటుంబములో పిల్లలు ప్రేమతో పెరుగుటకు ఆదర్శవంతమైన పర్యావరణము ఉంటుంది."

**<u>గమనిక:</u>** వ్యక్తిగత ధర్మము, పరివారిక ధర్మము మరియు ప్రవృత్తి మార్గము లోని అంశములు కూడా వర్తిస్తాయి. పేజి సంఖ్యలు 57 నుండి 61 వరకు, 198 మరియు 199 చూడుము).

## వనప్రస్త ఆశ్రమము (విరమణ దశ)

హిందూ ధర్మ పవిత్ర గ్రంధముల ప్రకారము వనప్రస్త ఆశ్రమము, 60 సంవత్సరముల వయస్సువచ్చిన తరువాత (అప్పటికి వారి పిల్లలు పెరిగి, వివాహము అయి వారు వారి జీవితములో స్థిరపడి ఉంటారు), గృహస్తు భార్యతోసహా వనప్రస్త ఆశ్రమము ప్రారంభము చేయవలెను. వనప్రస్త ఆశ్రమములో ఈ ప్రపంచపు విషయములపై అనుబంధము నుండి నిర్లిప్తతము మరియు పరమాత్మునుతో అనుసంధానము కొఱకు సాధన. ఇది తత్వజ్ఞానము (సత్యమును అవగాహన - ఈ ప్రపంచము, అనుబంధములు మహామాయ యొక్క పరిణామములే) మరియు ఆత్మజ్ఞానము పొందుటకు అనుకూల వాతావరణము. వనప్రస్త ఆశ్రమము సమయములో వారు కేవలము తమ భౌతిక శరీరము ఉండుటకు కనీస ఆహార మరియు అవసరములతో సాధారణ జీవితమును సాగిస్తూ, ఆధ్యాత్మిక అభివృద్ధి మరియు అంతిమ లక్ష్యము అయిన మోక్షము పొందుటకు సాధన చేయవలెను. వారి పిల్లల, బంధువుల వ్యక్తిగత జీవితములలో జోక్యము మరియు పునరావృతము చేయకూడదు. వారు సలహాలు ఏమైనా అడిగినప్పుడు, అప్పుడు మాత్రమే మీ సలహాలు ఇయ్యవచ్చును. వారు మీ సలహాలను పాటించాలని భావించవద్దు.

## సన్న్యాస ఆశ్రమము (సన్న్యాసి దశ)

సన్న్యాస ఆశ్రమము (సన్న్యాసి దశ) ప్రాపంచిక కార్యకలాపములను నుండి ఉపసంహారణము. ప్రాపంచిక బంధముల నుండి విముక్తి మార్గమును పాటిస్తూ, బ్రహ్మ జ్ఞానము

కోసము జీవిత విధానములను అవలంభించుట. వారు కతృత్వ భావములను, కర్మఫలములు విడిచిపెట్టుతారు (నారద పరివ్రాజకోప నిషత్ 4 : 1 నుండి 14 వరకు; 5 : 1 నుండి 15 వరకు; సన్న్యాసోప నిషత్ 1 : 1, 2, 3; 2 : 1 నుండి 21 వరకు).

## ఉమ్మడి కుటుంబ వ్యవస్థ

హిందువుల జీవిన విధానములో ఉమ్మడి కుటుంబ వ్యవస్థ ఒక ముఖ్యమైన అంశము. ఉమ్మడి కుటుంబ వ్యవస్థ ద్వారా అరిషడ్ వర్గముల (కామము, క్రోధము, లోభము, మోహము, మదము మరియు మాశ్చర్యము) వలన కలిగే దుర్గుణములు, స్వార్ధమును అదుపులో ఉంచుకునేందుకు గొప్ప అవకాశము. ఈ వ్యవస్థ పరస్పర ప్రేమ, గౌరవము, అవగాహన, త్యాగము, మానసిక శాంతి, సామరస్యము, ఆనందము మరియు ఏకత్వముల గొప్ప శక్తికి దారితీస్తుంది. కుటుంబములో పెద్దల ఆధ్వర్యములో అనుకూల వాతావరణము, పిల్లలు అభివృద్ధి మరియు సమతుల్య వ్యక్తిత్వముతో కలిసి పెరుగుటకు అవకాశము ఇస్తుంది. దురదృష్టవశాత్తు, ఇటీవల ధర్మ పరమైన మరియు ఆధ్యాత్మిక వైఖరి యొక్క క్షీణత మరియు పైన పేర్కొన్న అరిషడ్ వర్గముల ప్రభావములు ఎక్కువై, ఫలితముగా భౌతిక విలువలు, పశ్చిమ సంస్కృతి యొక్క ప్రభావములకు ఆకర్షింపబడి, ఈ ఉమ్మడి కుటుంబము వ్యవస్థ కనిపించకుండా పోయింది. మరియు ఈ రోజుల్లో పిల్లలు తల్లితండ్రులను ఒక భారముగా భావించి, వారి తల్లిదండ్రుల బాగోగులు పట్టించుకోవటములేదు (వారి స్వంత పిల్లల నుండి వారు ఇటువంటి అనుభవము పొందితే వారు ఎలా బాధపడతారో వారికి ఇప్పుడు అర్థము కాదు). ఇది హిందూ సామాజమునకు నిజముగా తలవంపు.

## హిందువుల ఆహారము

అన్ని జీవులకు ఆహారము ఒక ప్రధాన పాత్ర పోషిస్తుంది (తైత్తిరీయోప నిషత్ 3 : 2). సంప్రదాయ హిందువుల కుటుంబములలో వేదములలో మరియు మనుస్మృతిలో సూచించిన ఆహారపు పద్ధతులను అనుసరిస్తారు. విశ్వము మహామాయ నుండి ఉద్భవించినది. కాబట్టి అన్ని మొక్కలు మరియు మొక్కల నుండి ఉత్పత్తి అయ్యే అన్ని ఆహార పదార్ధములలోనూ మహామాయ యొక్క మూడు గుణములు సూక్ష్మ రూపములో ఉన్నవి. ఆహారములో, శక్తి (1/3), పదార్ధము (1/3) మరియు గుణములు (1/3) ఉన్నవి. ఆహారము తిన్న తరువాత జీర్ణమయి, ఆహారములోని శక్తి, రక్త వ్యవస్థ లోనికి పోయి శరీరమునకు శక్తి, మాంసము, ఎముకలుగా మారుతుంది. పదార్ధము వ్యర్ధముగా బయటకు పోవును. గుణములను మనస్సు పీల్చుకుంటుంది. కాబట్టి జీవుల మనస్సు, ఆలోచనలు మరియు చర్యల మనస్సు పీల్చుకున్న గుణముల శాతము మీద ఆధారపడి ఉంటుంది. "**ఆహారము ఏదో మనస్సు అలాగే**, **మనస్సు ఏదో మనిషి అదే**". క్రింద పేర్కొన్న కొన్ని ఆహారపదార్ధములలో ఏ గుణము అధిక శాతము ఉంటుందో పేర్కొనబడినది (భగవద్గీత 17 : 7 నుండి 10 వరకు).

- ❖ **సాత్వీక (సమతుల్య) ఆహారము:** తేజము, బుద్ధి, ఆరోగ్యము మరియు ఆనందము పెంచును. ఆవు పాలు, వెన్న, నెయ్యి, తాజా కూరగాయలు, తినేఆకులు, తాజాపండ్లు, రసములు, ధాన్యములు, పప్పులు, బాదము, జీడిపప్పు, ఎండుద్రాక్ష మొదలైనవి.

- ❖ **రాజసిక (ఉద్వేగభరిత) ఆహారము:** బాధ, విచారము మరియు అనారోగ్యము కలిగించును. చేదువి, పుల్లనివి, కారమువి, ఉప్పువి, వగరువి, పొడివి, క్షారమైనవి, ఎండినవి, గాఢమైనవి, అతివేడివి, అల్లము, మసాలా దినుసులు, చింతపండు, నిమ్మకాయ, ఉల్లిపాయ, వెల్లుల్లి, సుగంధ ద్రవ్యములు, గుడ్లు, చేపలు, తెల్లని మాంసము మొదలైనవి.
- ❖ **తామసిక (హింసాత్మక) ఆహారము:** మగత, నిద్ర మరియు హింస కలిగించును. సగము వండినవి, సగము పండినవి, ఎక్కువగా పండినవి, రుచిలేనివి, చెడిపోయినవి, కాలానుగుణముకాని పండ్లు మరియు కూరగాయలు, పులియబెట్టినవి, నిల్వఉన్న ఆహారము (ఆహార వండిన 1 ½ గంటల తర్వాత నిల్వఉన్నదిగా, చెడిపోయినావిగా పరిగణించబడుతుంది), ఘనీభవించినవి, ప్రక్రియచేసినవి, తగరములో నిల్వచేసినవి మరియు ఎరుపు మాంసము మొదలైనవి.

ఆహారము తయారచేయుట కూడా ఒక ముఖ్యమైన పాత్రను పోషిస్తుంది. ఆహారము తయారుచేస్తున్నప్పుడు క్రింది అంశములు దృష్టిలో ఉంచుకొనవలెను:

- ❖ ఆహారము తక్కువ మంటతో వండవలెను. సమయము తీసుకుంటుంది, అయితే నెమ్మదిగా ప్రక్రియ ఉండవలెను. ఓవెన్, మైక్రోవేవ్ వేడి మంచిది కాదు.
- ❖ వంటచేసే, వడ్డించే వ్యక్తి యొక్క ఆలోచనలు, భావములు మరియు ప్రయోజనములు కూడా ఆహారములోనికి సూక్ష్మ రూపములో వెళ్ళి ఆహారము భుజించేవారి

మనస్సులోనికి వెడుతుంది.

- ❖ ఆహారము స్వయముగా వినియోగము కోసము ఎప్పుడూ తయారు చేసుకోకూడదు. ఆహారము తయారు చేసుకున్న తరువాత, మొదట దానిని పరమాత్మకు సమర్పణ చేయాలి. అప్పుడు ఆ ఆహారము పరమాత్మని ప్రసాదముగా అవుతుంది. ఆ ప్రసాదములో కొంతభాగము అతిథులకు, పక్షులకు, జంతువులకు మరియు సూక్ష్మ జీవులకు (పర్యావరణ సమతుల్యనము కొఱకు) పెట్టి తరువాత కుటుంబ సభ్యులకు (క్రమములో పిల్లలకు, తల్లిదండ్రులకు, పెద్దలకు) పెట్టిన తరువాత మాత్రమే కుటుంబ యజమాని తీసుకొనవలెను (భగవద్గీత 3 : 13 నుండి 15 వరకు; 4 : 31). ఉప్పును వ్యక్తిగత అవసరముల కొఱకు (తర్వాత జోడించటమునకు) ఎప్పుడూ వేరుగా వడ్డించకూడదు.
- ❖ ఆహారము ½ కడుపు యొక్క సామర్ధ్యము వరకు మాత్రమే తినవలెను, అప్పుడు 1/4 సామర్ధ్యము వరకు నీరును త్రాగవలెను. మిగిలిన 1/4 సామర్ధ్యము (గాలి మరియు సరైన జీర్ణక్రియ ప్రసరణకు) ఖాళీగా ఉండవలెను. ఆహారము శరీరము యొక్క జీవనోపాధి కోసము ఒక యజ్ఞముగా భావించవలెను (శరీరము లోపల పరమాత్ముడే, జీవాత్మగా నివసిస్తున్నారు, అదియే ఒక ఆలయము అనే ఒక పవిత్రమైన భావముతో ఆ పరమాత్మునకు ఆహారము సమర్పించవలెను). ఈ యజ్ఞములో, నోరు యజ్ఞకుండము (పవిత్ర సమర్పనకు స్థానము), కడుపులో ఆకలి అగ్ని (పవిత్రమైన అగ్ని), హవిస్ (కడుపు వెళ్ళే ఆహారము (బలి, అనగా పవిత్రమైన త్యాగము యొక్క పదార్ధము) గా భావించవలెను

(భగవద్గీత 9 : 27). ఆహారము కేవలమూ ఆనందించుటకు, ఆకలితోఉన్న కడుపు నింపుటకు మాత్రమే కాదు.

- ఆహారము నిలబడి తినరాదు. తినే సమయములో ఎప్పుడూ లేవకూడదు. ఆహారము తయారుచేసిన విధానమును మరియు దాని రుచి గురించి ఎప్పుడూ ప్రతికూల వ్యాఖ్యలు చేయకూడదు. తినే సమయములో ఎప్పుడూ కోపము తెచ్చుకోకూడదు.

ఈ నియమములు పాటించినట్లయితే, మనస్సు పీల్చుకునే ఆహారములోని గుణములను పరిశుభ్రపరిచి, దైవికమై ఆధ్యాత్మికతకు మరియు జ్ఞానోదయమునకు అర్హత కలిగించును.

## పంచ యజ్ఞములు (లేదా ఐదు ఋణములు)

ఈ సృష్టిలో అన్ని జీవులు పర్యావరణ వ్యవస్థకు చెందినవి. జీవులు ఒకదానిపై మరొకటి ఆధారపడి ఉన్నవి. పరమాత్ముడు ఈ సృష్టిలో శాశ్వతమైన నైతిక క్రమము కొనసాగేలా నిర్దేశించినారు. ప్రతి మానవునకు క్రింది వివరించిన ఐదు ఋణములు ఉండును. ఈ ఋణములను తీర్చకుండా ఏజీవి మోక్షము పొందలేవు (మను స్మృతి 3 : 118). ఈ ఋణములు, గృహస్త ఆశ్రమము సమయములో ప్రవృత్తి మార్గము పాటిస్తూ హిందూ మత పవిత్ర గ్రంథములలో ఉన్న నిత్య కర్మలు, యజ్ఞములు ద్వారా మాత్రమే తీరును (పేజి సంఖ్యలు 78, 79 మరియు 201, 202 చూడుము).

- **దేవ (పరమాత్మునికి) ఋణము:** పరమాత్ముడు ఈవిశ్వమును (ప్రతి జీవికి అవసరము అయిన ఆకాశము,

సూర్యుడు, చంద్రుడు, వాయువు, అగ్ని, జలము మరియు భూమి మొదలైనవి) సృష్టించినారు. కాబట్టి ప్రతి జీవి పరమాత్మునకు ఋణపడి ఉన్నాడు (భగవద్గీత 3 : 11, 12).

- **ఋషి (ఋషులకు) ఋణము:** ఋషులు మోక్షము పొందుటకు అవసరము అయిన జ్ఞానమును ఈ ప్రపంచమునకు అందించినారు. కాబట్టి ప్రతి జీవి ఋషులకు ఋణపడి ఉన్నాడు.
- **పితృ ఋణము (పూర్వీకులకు ఋణము**): పూర్వీకులు (తల్లిదండ్రులు) ప్రతి జీవిని ఉనికిలోనికి (పుట్టుటకు కారణము) తీసుకువచ్చారు. కాబట్టి ప్రతి జీవి వారి పూర్వీకులకు ఋణపడి ఉన్నాడు.
- **మానవ (మానవజాతికి) ఋణము**: మానవుడు ఒంటరిగా జీవించలేడు. తన జీవితము యొక్క అవసరములకు ఇతర మానవుల మీద ఆధారపడి ఉండవలసి ఉంటుంది. కాబట్టి మానవజాతికి ఋణము.
- **భూత (ఉప మానవులందరికీ) ఋణము:** ఇతర జీవులు పర్యావరణ వ్యవస్థ నిర్వహణకు మరియు సమతుల్యమునకు ఎంతో అవసరము ఉన్నది. కాబట్టి మానవులు ఉప మానవులందరికీ ఋణము.

## సంస్కారములు

హిందువుల జీవితములో ధర్మము మరియు ఆధ్యాత్మిక పురోగతి ప్రధాన అంశములు. హిందువులు క్రింది సంస్కారములు ప్రధానముగా జరుపుకుంటారు.

- గర్భాధానము: శోభనము.

- పుంసవనము: గర్భవతి యొక్క గర్భధారణము మొదటి సంకేతము.
- సీమంతము: తల్లి (గర్భము యొక్క 7వ నెలలో) వెంట్రుకల మధ్య పాపట తీయుట.
- జాత కర్మ: తల్లి తన స్తనములతో శిశువునకు మొదట పాలు ఇవ్వటము.
- నామ కరణము: శిశువునకు పేరు పెట్టుట (పుట్టిన తరువాత 11 వ రోజు).
- నిష్క్రమనము: శిశువునకు మొట్టమొదట సూర్యుడును మరియు చంద్రుడును చూపించుట.
- అన్న ప్రాసనము: శిశువునకు మొట్టమొదట ఘన ఆహారము ఇచ్చుట.
- చూడ కరణము: శిశువునకు మొదటి జుట్టు కత్తిరింపు (శిఖ వదిలి).
- కర్ణ ఛేదము: చెవులు కుట్టించుట (7 లేదా 8 వ నెల).
- ఉపనయనము: ఉపనయనము (ఒడుగు) చేయుట (బాలలుకు మాత్రమే) 5 సంవత్సరములు తర్వాత. తరువాత బ్రహ్మచర్య ఆశ్రమము ప్రారంభమవుతుంది.
- కేశాంతము: బ్రహ్మచర్య ఆశ్రమము పూర్తిఅయిన తరువాత జుట్టు కత్తిరించి (శిఖ వదిలి) మరియు గురుదక్షిణ ఇవ్వబడుతుంది.
- సమవర్తనము: కేశాంతము తర్వాత గురుకులము నుండి ఇంటికి తిరిగి వచ్చుట.
- వివాహము: వివాహము.
- వనప్రస్త ఆశ్రమము: విరమణ దశ.
- సన్యాస ఆశ్రమము: సన్యాసి దశ.
- అంత్యేష్టి: మరణము తరువాత అంతిమ కర్మలు.

**హిందువుల ఆచారములు:** హిందువులు క్రింది ఆచారములను పాటిస్తారు:

- **శంకు స్థాపనము:** నూతన గృహ నిర్మాణమునకు ప్రారంభములో భూమిలో శంకువును స్థాపించుట.
- **గృహ ప్రవేశము:** నూతన గృహములో ప్రవేశించుట.
- **పుష్పవతి:** బాలికలకు యుక్తవయస్సు వచ్చుట (బాలికలకు మాత్రమే).
- **శ్రాద్ధము (పితృకర్మములు):** శ్రాద్ధము అనగా శ్రద్ధతో, భక్తితో కర్మ చేయుట. హిందువుల మరణము తరువాత వారి కుమారులు చేసే అంత్యక్రియలు చాలా ముఖ్యమైన క్రతువు. ఇందులో భాగాముగా దహనక్రియ (శ్మశానములో మృత దేహమును కాల్చుట), తరువాత వెనువెంటనే మొదటి పదమూడు రోజుల కర్మలు, మాసికములు (చనిపోయిన మొదటి సంవత్సరములో నెలవారీ కర్మ), సంవత్సరికములు (చనిపోయిన సంవత్సరము ఆఖరిలో మూడు రోజులు కర్మలు), తరువాత ప్రతీ సంవత్సరము శ్రాద్ధము తప్పనిసరిగా చేయవలసిన విధి. హిందూ ధర్మ గ్రంధములలో ఈ విధులను చాలా వివరముగా తెలియచేశారు. పితృదేవతలకు, ఈవిధముగా శ్రద్ధతో మరియు ప్రేమతో ఈ క్రతువుల ద్వారా సేవించిన, వారి దీవెనలు మరియు ఆశీర్వచనములు వారి పిల్లలకు శ్రేయస్సు మరియు దుష్ట శక్తుల నుండి రక్షణ కలిగిస్తాయి. వారికి పితృ (పూర్వీకుల) ఋణము (పేజి సంఖ్య 87 చూడుము) నుండి విమోచనము కలుగుతుంది. కానీ ఈ మధ్యకాలములులో చాలా మంది హిందువులు, వారి అశ్రద్ధ మరియు

అజ్ఞానము వలన, ఈ ముఖ్యమైన విధి నిర్వర్తించుట లేదు. తల్లితండ్రుల ఆస్తులు వారి హక్కుగా కొట్లాడైనా, కోర్టులకు వెళ్లి అయినా తీసుకుంటారు కాని వారి స్వంత విధులు చేయరు. ఆధ్యాత్మిక దృష్టి కోల్పోయి, ఈ ఆచారములు మూఢ నమ్మకములని భ్రాంతితో, వారికి సమయము లేదని కుంటి సాకులు చెప్పి తప్పించుకుంటున్నారు. ఇది చాల దురదృష్టకరము.

## షోడశ - ఉపచారములు (పదహారు సేవలతో నిత్య పూజ)

హిందువుల ఆచారములలో పరమాత్ముడను షోడశ ఉపచారములతో (పదహారు సేవలతో నిత్య పూజ) ఆరాధన చేస్తారు. ఆరాధన ఆరంభించే ముందు (ఏ) స్నానము చేయవలెను; (బి) శుభ్రముగా ఉతికిన దుస్తులను ధరించవలెను; (సి) గణపతికి మొదట ప్రార్థన; (డి) పరమాత్మని విగ్రహము లేదా ఫోటో సమీపములో ఆవు నెయ్యి లేదా నువ్వుల నూనెతో దీపము వెలిగించవలెను; (ఇ) ఆచమనము, పరమాత్మని 24 నామములతో ధ్యానించవలెను (ఎఫ్) సంకల్పము చేయవలెను; (జి) విగ్రహములో ప్రాణప్రతిష్ఠ చేయవలెను; (ఎచ్) ఆధ్యాత్మిక గురువును ధ్యానించవలెను. తరువాత పరమాత్ముడను (ఎవరికి ఇష్టమైన నామ రూపములతో) సేవలు లేక పూజ క్రింది పదహారు విధముల చేయవలెను. ఇవి భక్తుని మనస్సులోని భావనలు :

- ఆవాహనము: పరమాత్ముని ఆహ్వానించుట.
- ఆసనము: పరమాత్మునకు కూర్చునేందుకు ఆసనము సమర్పించుట.

- పాద్యము: పరమాత్మునకు పాదములు కడుగుకునేందుకు నీరును సమర్పించుట.
- అర్ఘ్యము: పరమాత్మునకు చేతులు కడుగుకునేందుకు నీరును సమర్పించుట.
- ఆచమనీయము: పరమాత్ముడు త్రాగుటకు నీరును సమర్పించుట.
- స్నానము: పరమాత్ముని పంచామ్రుతములతో (ఆవు పాలు, ఆవు పెరుగు, ఆవు నెయ్యి, తీనె, పంచదార) స్నానము చేయించుట.
- వస్త్రము: పరమాత్మునకు కట్టుకునేందుకు పట్టు వస్త్రములు సమర్పించుట.
- యజ్ఞోపవీతము: పరమాత్మునకు యజ్ఞోపవీతమును సమర్పించుట.
- గంధము: పరమాత్మునకు గంధము సమర్పించుట.
- పుష్పము: పరమాత్ముని వివిధ పేర్లు మరియు సుగుణములతో జపిస్తూ పువ్వులతో పూజించుట.
- ధూపము: అగరవత్తులు వెలిగించి వాసనగల పొగను పరమాత్మునకు అర్పించుట.
- దీపము: ఆవు నెయ్యి లేదా నువ్వుల నూనెతో వెలిగించిన దీపమును పరమాత్మునకు అర్పించుట.
- నైవేద్యము: ఆహారము (పండ్లు లేదా వండిన పదార్థములు) పరమాత్మునకు అర్పించుట. (మధ్య, మధ్యలో త్రాగుటకు నీరును అర్పించవలెను).
- తాంబూలము: పరమాత్మునకు తాంబూలము (తమలపాకులు, వక్కలు) సమర్పించుట.
- నమస్కారము: పరమాత్మునికి నమస్కరిస్తూ ప్రదక్షిణము చేయుట.

❖ ఉద్వాసనము: పూజానంతరము పరమాత్మని స్వస్థానమునకు చేర్చుట.

**<u>గమనిక:</u>** పై పదహారు దశల పరమాత్మని పూజ తరువాత పరమాత్మని ప్రసాదము (నైవేద్యము ఇచ్చినవి) మొదట ఇతరులకు పెట్టి తరువాత పరమాత్మని బహుమతిగా ఆ ప్రసాదమును తినవలెను.

## హిందువుల పండుగలు, ఉత్సవములు

మన పూర్వీకులు అన్ని జీవుల అభివృద్ధి, ఆరోగ్యము, ప్రకృతి, పర్యావరణము సంరక్షణ, సమాజిక ఐక్యత, వారి ఆనందము అందరితోనూ పంచుకునేందుకు మరియు ఆధ్యాత్మిక వికాసము కొఱకు హిందువుల పండుగలలో, ఉత్సవములలో ఈ అంశములను అంతర్గతముగా అమర్చి ఏర్పాటుచేసినవి. వివిధ ప్రాంతములు, భాషలు, సాంప్రదాయములవారు చిన్న, చిన్న మార్పులతో చాల ఉత్సాహముతో, ఆనందముతో పండుగలు, ఉత్సవములు జరుపుకుంటారు. వీటిలో మార్పులు ఉన్నా వాటి ముఖ్య లక్ష్యములు ఒక్కటే. కొన్ని ప్రాంతములలో కొన్ని పండుగల ప్రాముఖ్యత ఎక్కువ ఉంటుంది. ఈ మధ్యకాలములో ఈ పండుగల, ఉత్సవముల లక్ష్యములు అర్థముకాక, తెలియక కొంతమంది జరుపుకొనుట లేదు, లేదా రజో, తమో గుణముల ప్రభావములు ఎక్కువై భావావేశములతో, ఉగ్రవాదములతో హింసాత్మకముగా మారి వికృత విధములలో జరుపుతూ వాటిలో ఉన్న లక్ష్యములకు వ్యతిరేకముగా చేస్తున్నారు. కొంతమంది హిందువులు పాశ్చాత్య దేశముల సంస్కృతికి ఆకర్షితులై,

హిందువులు పండుగలు మాని, వారి పండుగలు అత్యంత ఉత్సాహముతో జరుపుకుంటున్నారు. భారత దేశములో కొంతమంది చాంద్రమానము మరికొంతమంది సౌరమానము అనుసరిస్తారు. అందుచే ఆ ఆ మానముల (క్యాలెండర్) మరియు సాధారణముగా ప్రపంచవ్యాప్తముగా అనుసరించే గ్రెగోరియన్ క్యాలెండర్ ప్రకారము హిందువుల పండుగలు, ఉత్సవములు జరుపుకునే రోజులలో అంతరము ఉండవచ్చు. హిందువుల పండుగలు, ఉత్సవములు చాల ఉన్నవి. ముఖ్యమైన కొన్ని హిందువుల పండుగల, ఉత్సవముల వివరములు క్రిందవ్రాయబడినవి:

- **<u>బోగి లేదా లోడి:</u>** బోగి లేదా లోడి పండుగ 13 జనవరి జరుపుకుంటారు. వ్యవసాయము మరియు ఆరోగ్యము కొఱకు ఆ సమయములో వర్షములు అవసరము. అందుకు ఆ రోజు వర్షముల కొఱకు దేవేంద్రుడను ప్రార్థిస్తూ బోగి లేదా లోడి మంటలు వేస్తారు.
- **<u>మకర సంక్రాంతి:</u>** మకర సంక్రాంతి పండుగ 14 జనవరి జరుపుకుంటారు. ఆ రోజున సూర్యుడు మకర రాశిలోనికి ప్రవేశిస్తాడు. ఆ రోజునుండి సూర్యుని కిరణములు 90 డిగ్రీలతో మకర రేఖకు ఉత్తరమునకు ప్రయాణము మొదలవుతుంది. ఈ రోజునుండి ఉత్తరాయణము ప్రారంభమవుతుంది. అనగా శీతాకాలము చివరి రోజులు మరియు వ్యవసాయము ఆరంభ సమయము. ఆ రోజున భూదేవిని ఆరాధిస్తారు.
- **<u>మహాశివరాత్రి:</u>** మహాశివరాత్రి పండుగ ఫిబ్రవరి లేదా మార్చిలో వస్తుంది. ఆ రోజు అర్ధరాత్రి మహేశ్వరుడు, పరమపిత బ్రహ్మ మరియు విష్ణుమూర్తిలకు

అగ్నిస్థూపముగా (లింగోద్భవము) వంటి నిర్గుణ, నిరాకార పరమాత్ముడు, (లింగము వంటి) మరియు సగుణ, సాకార పరమాత్ముడు (శివుని రూపము వంటి) కనిపించారు. ఆ రోజు పార్వతీదేవి మరియు శివుని కళ్యాణమహోత్సవము జరుపుతారు.

❖ **<u>హోలి:</u>** హోలి పండుగ ఫిబ్రవరి లేదా మార్చిలో వస్తుంది. రాక్షసరాజు హిరన్యకసిపుడు, అందరూ అతనినే ఆరాధించాలని ఆజ్ఞాపించాడు. కానీ అతని స్వంత కుమారుడు విష్ణుభక్తుడైన ప్రహరాదుడు విష్ణువును (హిరన్యకసిపుడు విష్ణువును ప్రధమ శత్రువుగా భావించేవాడు) ఎల్లప్పుడూ ఆరాధించేవాడు. కాబట్టి హిరన్యకసిపుడు, తన కుమారుడు ప్రహరాదుడను హత్య చేయించాలని నిర్ణయించుకొని, తన సోదరి హోలికను (హోలికకు అగ్ని కాల్చలేదని వరము ఉంది) ప్రహరాదుడుతో సహా అగ్నిలో ప్రవేశించమని ఆజ్ఞాపించాడు. హోలిక కాలి బూడిద అవుతుంది కానీ ప్రహరాదుడను అగ్నినుండి విష్ణుమూర్తి కాపాడుతారు. చెడు(హోలిక) మీద భక్తి మరియు మంచి (ప్రహరాదుడు) విజయము పొందుతుందని భావనతో హోలి పండుగ జరుపుకుంటారు.

❖ **<u>యుగాది లేదా ఉగాది:</u>** యుగాది లేదా ఉగాది పండుగ మార్చి లేదా ఏప్రిల్ లో వస్తుంది. యుగాది లేదా ఉగాది అనగా యుగము లేదా శకము యొక్క ఆరంభము. ఆ రోజున పరమాత్ముడు సృష్టిని ప్రారంభించిన రోజు. ఆ రోజున కొత్త సంవత్సరము, మొదటి నెల మరియు మొదటి రోజు ప్రారంభము.

- **<u>వసంత నవరాత్రి:</u>** వసంత నవరాత్రి పండుగ మార్చి లేదా ఏప్రిల్ లో వస్తుంది. వసంత ఋతువును (ముఖ్యమైన సౌర (సూర్యుని), మరియు వాతావరణము కూడలి. శీతాకాలము పోయి వేసవికాలము మొదలవుతుంది) ఆహ్వానిస్తూ వసంత నవరాత్రి (తొమ్మిది రాత్రులు) జరుపుతారు. నవరాత్రి, తొమ్మిది రాత్రుల పండుగ సమయములో, శక్తిదేవిని (పరమాత్మని శక్తి, విశ్వమునకు కారకమైన తల్లి రూపములో), దుష్ట శక్తుల నుండి రక్షణ, ప్రాపంచిక సంపద, శ్రేయస్సు మరియు ఆధ్యాత్మిక జ్ఞానము కోసము తొమ్మిది రూపములలో భక్తితో ఆరాధిస్తారు. తొమ్మిది రాత్రుల అనంతరము పదవరోజున శ్రీరామ నవమి పండుగ మొదలవుతుంది.
- **<u>శ్రీరామ నవమి:</u>** శ్రీరామ నవమి పండుగ ఏప్రిల్ లో వస్తుంది. ఆ రోజున మధ్యాహ్న సమయములో, విష్ణుమూర్తి మానవుని అవతారము ఎత్తి, శ్రీరాముడుగా జన్మించిన రోజు. శ్రీరాముడు మానవ రూపములో ధర్మమును పాటించి ప్రజలందరికి ఆదర్శమూర్తిగా నిలిచాడు. శ్రీరాముడే ధర్మము, ధర్మమే శ్రీరాముడు. ఆరోజున రామునకు, సీతాదేవికి కళ్యాణమహోత్సవము జరుపుతారు.
- **<u>కృష్ణాష్టమి లేదా జన్మాష్టమి:</u>** కృష్ణాష్టమి లేదా జన్మాష్టమి పండుగ ఆగష్టు లేదా సెప్టెంబరులో వస్తుంది. ఆరోజున అర్ధరాత్రి సమయములో, విష్ణుమూర్తి మానవుని అవతారము ఎత్తి, శ్రీకృష్ణపరమాత్మనిగా జన్మించిన రోజు. విష్ణుమూర్తి, ఎత్తిన అన్ని అవతారములలో, కృష్ణావతారములో పరిపూర్ణ అంశములతో ఎత్తిన

అవతారము. అందుకు కృష్ణావతారము పరిపూర్ణ అవతారము అంటారు. ఆ రోజున అర్ధరాత్రి సమయములో శ్రీకృష్ణపరమాత్మను బాలుడు రూపములో ఉయ్యాలలో ఊపుతారు.

- **<u>గణేష్ చతుర్థి:</u>** గణేష్ చతుర్థి పండుగ సెప్టెంబర్ లేదా అక్టోబరులో వస్తుంది. గణపతి (గణములకు అధిపతి) లేదా విఘ్నేశ్వరుడు (విఘ్నములను తొలగించువాడు) జ్ఞానమునకు, వివేకమునకు, అభ్యుదయమునకు, శ్రేయస్సుకు, అదృష్టమునకు ప్రతీక. ఆ రోజున గణపతి జన్మించిన రోజు. గణపతి ఉత్సవములు 10 రోజులు అతివైభవముగా జరుపుకుంటారు.
- **<u>శరద్ లేదా శ్రావణ నవరాత్రి మరియు దసరా:</u>** శ్రావణ నవరాత్రి మరియు దసరా పండుగ అక్టోబరు లేదా నవంబరులో వస్తుంది. శరద్ లేదా శ్రావణ ఋతువు (ముఖ్యమైన సౌర (సూర్యుని), మరియు వాతావరణము కూడలి. వర్షాకాలము పోయి శీతాకాలము మొదలవుతుంది) శ్రావణ నవరాత్రిగా (తొమ్మిది రాత్రులు) జరుపుతారు. నవరాత్రి, తొమ్మిది రాత్రుల పండుగ సమయములో, శక్తిదేవిని (పరమాత్ముని శక్తి, విశ్వమునకు కారకమైన తల్లి రూపములో), దుర్గాదేవిని (మహిష అనే రాక్షసరాజును సంహరించినది) దుష్ట శక్తులనుండి రక్షణ, ప్రాపంచిక సంపద, శ్రేయస్సు మరియు ఆధ్యాత్మిక జ్ఞానము కోసము, తొమ్మిది రూపములో భక్తితో ఆరాధిస్తారు. తొమ్మిది రాత్రుల అనంతరము పదవరోజున దస్ - హర (అనగా పది - ఐదు జ్ఞానేంద్రియములు + ఐదు కర్మేంద్రియములను నియంత్రించుట) దసరా లేదా విజయ దశమి పండుగ అతివైభవముగా జరుపుకుంటారు.

❖ **<u>దీపావళి:</u>** దీపావళి పండుగ అక్టోబరు లేదా నవంబరులో వస్తుంది. దీపావళి అనగా దీపముల వరుస. శ్రీరాముడు, రాక్షసరాజు రావణుడను చంపిన తరువాత, సీతాదేవి మరియు వానర సైన్యముతో కలిసి అయోధ్యకు తిరిగి వచ్చిన రోజుగా పరిగణిస్తారు. ఈ పండుగ చెడుపై, మంచి యొక్క విజయమును సూచిస్తుంది. దీపములు చీకటిని వెదజల్లి, వెలుగును ప్రసాదిస్తాయి. ఆ వెలుగులో మనము అన్నింటినీ స్పష్టముగా చూసి వాటిని తెలుసుకోగలము. దీపము జ్ఞానమునకు సంకేతము. అలాగే జ్ఞానము, అజ్ఞానమును పోగొట్టి, అన్నింటినీ స్పష్టముగా అర్థము చేసుకోగల శక్తిని ఇస్తుంది. జ్ఞానముతో అన్ని అవరోధములను దాటి ఆత్మజ్ఞానమును పొంది ('నేను' ను – ఆత్మానుభవము పొంది) అనంతమైన, శాశ్వతమైన, దైవ పరమానందము పొందుతారు. ఇది దీపావళి పండుగలోని అంతరార్థము.



# వేదములు

"**వేదము**" అనగా బ్రహ్మజ్ఞానము. వేదముల శాశ్వతమైన దైవ జ్ఞానమును, సత్యములను పరమాత్ముడు తనలో ఉంచుకొని, ఆయనచే రక్షించబడుతున్నవి. సృష్టి సమయములో పరమాత్ముడు, ఈ శాశ్వతమైన దైవ జ్ఞానమును, సత్యములను పరమపిత బ్రహ్మకు వెల్లడిచేసినారు (భగవద్గీత 3 : 15; 17 : 23). వేదములలో ఉన్న జ్ఞానముతో, పరమపిత బ్రహ్మ, ఏమియులేని స్థితినుండి, ఈ బ్రహ్మాండమును సృష్టించినారు. వేదములు '**అపౌరషేయ**' (మానవులచే వెల్లడింపబడినవి కావు), '**శబ్దాద్మిక**' (శబ్దముల ఆధారముగా ఉన్నవి. అనగా పుస్తకములలో వ్రాయబడినవి లేక చదివేవి కావు), '**అలౌకిక**' (మానవుల మేధస్సు, మనస్సు మరియు భావములకు అతీతము) మరియు '**ప్రమాణ**' (అధీకృతమైన జ్ఞానము). వేదములు '**శ్రుతులు**' నోటినుండి శబ్దములతో ఉచ్చరింపబడేవి. ఈ బ్రహ్మాండము యొక్క సృష్టి సమయములో పరమపిత బ్రహ్మ, వేదములను ఋషులకు వెల్లడించినారు (భాగవతము 3 : 12 : 37). ఎప్పటికప్పుడు ఆ ఋషులు ఈ భూమిమీద ప్రజలకు వేదములను వెల్లడించినారు. వేదములలో 7 కోట్ల శ్లోకములు కలవు, కానీ ప్రస్తుతము సుమారు 20,379 శ్లోకములు మాత్రమే అందుబాటులో ఉన్నవి. క్రీ. పూ. 3102 ముందు భగవాన్ వేద వ్యాసుడు వేదములను విభజించి పునరుత్పత్తి చేసినారు. అవి (ఎ) ఋగ్వేదము (21 శాఖలు), (బి) యజుర్వేదము (109 శాఖలు), (సి) సామవేదము (1,000 శాఖలు), మరియు అధర్వణ వేదము (50 శాఖలు) (భాగవతము 1 : 4 : 20). వేదములు మొత్తము 1,180 శాఖలలో ఉన్నవి. నాలుగు వేదములు యొక్క ప్రాధమిక లక్ష్యము జీవులకు పరమాత్మని తత్వమును తెలియచేయుట

(భగవద్గీత 15 : 15). వేదములలో ఉన్న శాశ్వతమైన దైవ జ్ఞానము, సత్యములు జీవులకు దైవానుభూతి పొందే అవకాశము ఇస్తుంది. 'సత్యము ఏవ జయతే' సత్యము మాత్రమే జయిస్తుంది (ముండకోప నిషత్ 3 : 1 : 6). ఇది భరతదేశము యొక్క ఆదర్శము. దీనిని భారత జాతీయ ముద్రపైన చెక్కబడి ఉన్నది. వేదము నాలుగు విభాగములుగా ఉన్నవి. అవి:

- **మంత్రములు లేదా సంహితములు:** ఇవి శ్లోకములు, ప్రార్థనలు, దీవెనలు, దైవము కోసము సమర్పణ సూత్రములు మరియు శ్లోకములు యొక్క ఉచ్చారణలు. ఇవి దేవతలను కీర్తించి చేసే యజ్ఞములు, యాగములు మరియు వేద ఆచారములు. అన్ని వేద శ్లోకములు వ్యక్తిని పరమాత్మునిపట్ల స్ఫూర్తి కలిగిస్తాయి.
- **బ్రాహ్మణములు:** ప్రతి వేదము యొక్క బ్రాహ్మణము విభాగము వివరణాత్మక భాగము. యజ్ఞములు, యాగములు చేసే పద్ధతులు, ఆచారములు, ఆదేశములు, అర్థములు, నేపథ్యములు, వ్యాఖ్యలు మరియు పరమాత్మని వివిధ రూపములు అయిన దేవతలకు చేసే యజ్ఞముల, యాగముల వివరములు ఉన్నవి. బ్రాహ్మణముల విభాగములో 1,180 శాఖలు ఉన్నవి. వాటిలో ప్రస్తుతము కొన్ని శాఖలు మాత్రమే అందుబాటులో ఉన్నవి (ఐతరేయ, తైత్తిరీయ, కౌషీతకీ మొదలైనవి).
- **ఆరణ్యకములు:** ఆరణ్యకములు విభాగములో పరమాత్ముడను, వేదముల సారంశము ఐన పరమార్థిక సత్యములను వివరిస్తాయి. ఈ విభాగము ఉపాసకులకు (భక్తులకు) సాధనకు ఉపయోగకరమైనది. ఆరణ్యకములు

యొక్క 1,180 శాఖలలో కొన్ని పూర్తి శాఖలు మాత్రమే ఇప్పుడు అందుబాటులో ఉన్నవి.

- **ఉపనిషత్తులు**: మంత్రములు లేదా సంహితములు చివర ఆధ్యాత్మిక వివరణలు (సారాంశము) ఉపనిషత్తులలో ఉన్నవి. అందుకే ఉపనిషత్తులను వేదాంతములు అనికూడా అంటారు. ఉపనిషత్తులలో అలౌకిక (పరమాత్ముని) మరియు లౌకిక (ప్రాపంచిక) ఆధ్యాత్మిక సత్యములు మరియు మోక్షము పొందుటకు మార్గములు వివరముగా చెప్పబడినవి. వేదముల 1,180 శాఖలకు సంబంధించిన 1,180 ఉపనిషత్తులలో ప్రస్తుతము 108 ఉపనిషత్తులు మాత్రమే అందుబాటులో ఉన్నవి.

(పైన వివరించిన నాలుగు విభాగములు కలిపి వేదములు అంటారు)

## పురుషార్థములు

పురుషార్థములు (మానవుల లక్ష్యములు లేక అనుసరించ వలసినవి). వేదములలో ఉన్న అత్యధిక దైవ సత్యములు జీవాత్మకు, పరమాత్ముడను పొందుటకు, సహకరించును. పురుషార్థములు క్రింది వివరించబడినవి (భాగవతము 1 : 9 : 26 నుండి 28 వరకు):

- **ధర్మము:** ధర్మమును (నైతిక విధులు, స్వీయ నియంత్రణ మరియు త్యాగము) పాటించుట.
- **అర్థము (ధనము):** కేవలము ప్రాథమిక అవసరములు కోసము ధర్మ మార్గముల ద్వారా ప్రాపంచిక సంపద లేదా

ఆస్తులు సంపాదించుట.

- **కామము (కోరిక):** ధర్మ మార్గముల ద్వారా ఇంద్రియముల కోరికలను సంతృప్తి పరచుట.
- **మోక్షము**: జీవాత్మ యొక్క అంతిమ లక్ష్యము అయిన మోక్షము పరమాత్ముని కృపతో పరిపూర్ణత పొందుట.

## ఋగ్వేదము

ఋగ్వేదము అనగా ఆరాధన. ఇవి దైవ శ్లోకములు. ఋగ్వేదము యొక్క ప్రధాన దైవము పరమపిత బ్రహ్మ. గోత్రము ఆత్రేయ. ఛందస్సు గాయత్రి. ఇది ఐదు విభాగములుగా ఉన్నది (ఎ) అశ్వలయని, (బి) సంఖ్యని, (సి) శాకల, (డి) పౌశల మరియు (ఇ) మాండుకేయ. దీనిలో ఇంద్రుడు, వాయువు, అగ్ని, వరుణుడు మొదలగు దేవతల సుగుణములను వర్ణిస్తూ మరియు వారిని ప్రశంసిస్తూ గానములు కలిపి 10.600 శ్లోకములు (10 మండలములలో (విభాగములు) ఉన్నవి). ఒక శ్లోకము మూడు భాగములుగా ఉంటుంది. మొదటి భాగము ప్రబోధము, రెండవ భాగము ప్రార్థన రూపములో దేవత యొక్క ప్రశంసలు మరియు మూడవ భాగము ప్రత్యేక అభ్యర్థన ఉంటుంది. రిషి పైల, భగవాన్ వేద వ్యాసుని శిష్యుడు, ఋగ్వేదమును అభ్యసించినారు. ఋగ్వేదములో బ్రాహ్మణము లేదా వైదికము గురించి వివరించినారు. దీనిలో సూర్యుడు (సూర్య), చంద్రుడు (సోమ), ఇంద్రుడు, వాయువు, అగ్ని, వరుణడు (నీరు), మరియు భూదేవిని మొదలైన ప్రకృతి యొక్క అన్ని శక్తులు శ్రేయస్సు కొఱకు యజ్ఞములు, యాగములు ఉన్నవి. ఋగ్వేదములో అత్యంత ముఖ్యమైన అంశము విశ్వము యొక్క అంతిమ వాస్తవికత, స్వరాత్మక నిర్మాణము మరియు వాటి క్రమము. ఇదియే

కాలక్రమేనా ధర్మము లేదా సనాతన ధర్మము అయినది. యజ్ఞములో, యాగములో వేసిన హవిస్సును అగ్నిదేవుని ద్వారా దేవతలకు చేరి, దానితో వారు సంతుష్టి పొంది, శక్తి పుంజుకొని, వారు ప్రజలను దీవిస్తూ, వారి వారి శక్తుల ద్వారా పజలకు శుభములు చేకూర్చెదరు. ఋగ్వేదములో అతి ముఖ్యమైన యజ్ఞములు రుద్రయజ్ఞము మరియు సోమయజ్ఞము. సోమరసము ఒక మూలిక నుండి తయారు చేయబడుతుంది.

## యజుర్వేదము

యజుర్వేదము ప్రార్థనా ప్రకరణము. యజుర్వేదము ప్రధాన దైవము శివుడు (రుద్రుడు). గోత్రము భరద్వాజ. ఛందస్సు త్రిష్టుప్. యజుర్వేదములో ఆచారములు మరియు యజ్ఞ సూత్రములు ఉన్నవి. దీనిలో 1,975 శ్లోకములు (40 అధ్యాయములలో) ఉన్నవి. రిషి వైసంపాయన, భగవాన్ వేద వ్యాసుని శిష్యుడు, యజుర్వేదమును అభ్యసించినారు. యజుర్వేదములో రెండు విభాగములు ఉన్నవి (ఎ) శుక్ల యజుర్వేదము (బి) కృష్ణ యజుర్వేదము. యజుర్వేదము మానవులకు కర్మయోగముపైన ఆసక్తిని ప్రేరేపించును. అందుచే యజుర్వేదమును కర్మవేదముగా సూచిస్తారు. యజుర్వేదములోని మంత్రము, "దేవోవః సవిత ప్రప్రయతు శ్రేష్టమయ కర్మనే" (విశ్వ సృష్టికర్తా! శ్రేష్టమైన పనులు నిర్వహించుటకు మాకు స్ఫూర్తిని ఇమ్ము).

## సామవేదము

సామవేదము అనగా వేదమును స్వర, రాగములతో శ్రావ్యముగా గానము చేయుట. దీనిలో నినాదముల, శ్రావ్య

గీతముల జ్ఞానము ఉన్నది. సామవేదము ప్రధాన దైవము విష్ణుమూర్తి. గోత్రము కశ్యప. ఛందస్సు జగతి. రిషి జైమిని, భగవాన్ వేద వ్యాసుని శిష్యుడు, సామవేదమును అభ్యసించినారు. భారతీయ శాస్త్రీయ సంగీతము సామవేదము నుండి ఉద్భవించినది. దీనిలో 1,875 శ్లోకములు (21 అధ్యాయములలో ఉన్నవి). ఈ వేదము కూడా ఋగ్వేదమును ఆధారితముగా ఉన్నది. సామవేదము యొక్క భాగములను సోమయజ్ఞము సమయములో ఋషులు పాడుతారు. ఇంద్రుడు, సోమ (చంద్రుడు), వాయువు, అగ్ని, వరుణుడు, మరియు భూదేవి దేవతలను ఈ వేదముతో ఆవాహన చేస్తారు. ఛాందోగ్యోప నిషత్, సామవేదము యొక్క అనుబంధ గ్రంథము.

## అధర్వాణ వేదము

అధర్వాణ వేదములో పాండిత్యము మరియు పద్ధతులు ఉన్నవి. దీనిలో చాలా సూత్రములు ఉన్నవి. అధర్వాణ వేదము ప్రధాన దైవము ఇంద్రుడు. గోత్రము వైజ్ఞాన. ఛందస్సు త్రిష్టుప్. దీనిలో 5,977 శ్లోకములు (20 అధ్యాయములలో) ఉన్నవి. రిషి సుమంతు, భగవాన్ వేద వ్యాసుని శిష్యుడు, అధర్వాణ వేదమును అభ్యసించినారు. దీనిని బ్రహ్మవేదము అని కూడా పిలుస్తారు. దీనిలోని మంత్రోచ్చారణలో పలికే మాటలు వివిధ యజ్ఞములలో, యాగములలో బ్రాహ్మణులు ఉపయోగిస్తారు. మూలికలు మరియు నీరు యొక్క వ్యాధినిరోధక శక్తులను, సంస్కృత అక్షరముల ప్రాముఖ్యత మరియు వాటిలోని శక్తి, పాప కర్మల ఫలితములు వాటికి ప్రాయశ్చిత్తములు, ఆచారదోషముల నివారణములు మొదలైన వివరముల గురించి ఉన్నవి.

## మహా వాక్యములు

వేదములలో ముఖ్యమైన సందేశము ప్రతీదానిలో మరియు ప్రతీజీవిలో దైవత్వము (బ్రహ్మము) ఉన్నది. అవి పూర్తిగా పరిణామము చెంది పరిపక్వము అయితే అవియే బ్రహ్మము అవుతాయి. బ్రహ్మము అన్నిటిలోనూ సమానముగా వ్యాపించి ఉన్నారు. రాళ్ళు, చెట్లు, జంతువులు, మానవులు మరియు దేవతలు బ్రహ్మము యొక్క అభివ్యక్తి వివిధ దశలలో ఉన్నవి. జీవాత్మ యొక్క సత్యము బ్రహ్మము. వేదములలోని మహా వాక్యములు ఈ సత్యమును క్రింద విధముగా ప్రకటించాయి:

- **అహం బ్రహ్మాస్మి (యజుర్వేదము - బృహదారణ్యకోప నిషత్ 1 లేదా 3 : 4 : 10)**

  'అహం బ్రహ్మాస్మి' అనగా 'నేను బ్రహ్మము'. 'నేను' అనగా 'ఆత్మ' (శరీరము కాదు) బ్రహ్మము యొక్క అంశము లేదా పరావర్తనము అనే భావన దృఢముగా విశ్వసిస్తే ఆత్మ మరియు బ్రహ్మము ఏకత్వమును అనుభవించవచ్చును. మహామాయ యొక్క అజ్ఞానము కారణముగా 'నేను ఈ శరీరము', 'ఈ శరీరము నాది', 'ఈ గృహము నాది', 'నేను చేస్తున్నాను' అనే భావన మనస్సులో దృఢముగా నాటుకు పోయినది. జ్ఞానము ఈ అజ్ఞానమును తొలగించి 'నేను బ్రహ్మము', 'బ్రహ్మమే నేను', 'ఈ విశ్వము అంతా బ్రహ్మమే' అనే భావన ఏర్పడుతుంది.

- **ప్రజ్ఞానం బ్రహ్మ (ఋగ్వేదము - ఐతరేయోప నిషత్ 3 : 1 : 3)**

  '**ప్రజ్ఞానం బ్రహ్మ**' అనగా '**జ్ఞానము బ్రహ్మ**'.

బ్రహ్మ జ్ఞానము (మేధస్సు, తెలివి, బుద్ధి) ఈ విశ్వముగా మారినది. జ్ఞానము అంతిమ వాస్తవమునకు ఆధారము. మహామాయ (అజ్ఞానము) ఈ జ్ఞానమును ఆవరించి కప్పబడి ఉన్నది. జ్ఞానము అనే అగ్నిలో అజ్ఞానము దహనము అవుతుంది. అప్పుడు ఆత్మయే బ్రహ్మము అని గుర్తిస్తారు.

- **తత్వమసి (సామవేదము - ఛాందోగ్యోప నిషత్ 6 : 8 : 7)**

'**తత్వమసి**' అనగా '**అది నేను**'. అది అనగా బ్రహ్మము. బ్రహ్మము నేను (ఆత్మ). బ్రహ్మము ఏది అయి ఉన్నదో అది నేను. నేను ఏది అయి ఉన్నదో అదియే బ్రహ్మము. బ్రహ్మము ఒక్కటే సత్యము. ప్రపంచములోని సూక్ష్మ సారాంశము ఆత్మ (నేను). ఆత్మ, మహామాయ యొక్క బానిసత్వము క్రిందఉన్న, (జీవాత్మ) మహామాయ యొక్క అజ్ఞానముతో కప్పబడి ఈ సత్యమును అవగాహన చేసుకోలేక నేను శరీరమును అనే భావనతో వ్యవహరిస్తూ ఉంటుంది. మహామాయ యొక్క అజ్ఞానము, జ్ఞానముచే తొలగబడిన వెనువెంటనే ఆత్మ ఈ సత్యమును గ్రహించ గలదు.

- **అయ మాత్మా బ్రహ్మ (అథర్వణ వేదము - మాండూక్యోప నిషత్ - 2)**

**'అయ మాత్మా బ్రహ్మ'** అనగా '**నా ఆత్మ బ్రహ్మ**'. ఆత్మ యొక్క సూక్ష్మ సారాంశము సత్యము. జీవాత్మ, మహామాయ యొక్క అజ్ఞానముతో మోసగింపబడి ఆత్మ,

బ్రహ్మము కంటే వేరుకాదు అనే భావన మర్చిపోయింది. జీవాత్మ తన స్వభావమైన జ్ఞానముతో తన నిజస్వరూపము బ్రహ్మము అని గుర్తిస్తే ఆత్మ, బ్రహ్మముతో విలీనమైపోవును.

**గమనిక:** ఆత్మ, బ్రహ్మము యొక్క శాశ్వతమైన అంశము లేదా బ్రహ్మమే. పరమాత్మ, ఆత్మ లోపల నివసిస్తున్నారు. ఆత్మకు, పరమాత్మ యొక్క చిత్శక్తికి అనుసంధానింపబడి ఉన్న జీవశక్తి. జీవాత్మ శరీరములో ప్రవేశించిన వేనువెంటనే ఆ శరీరమును క్రియాశీలపరుస్తుంది. అజ్ఞానముతో ఆశక్తి శరీరము యొక్క శక్తి అని భావిస్తారు. ఆశక్తి కేవలము బ్రహ్మముదే. ఆత్మ, బ్రహ్మము ఒక్కటే. ఈ విశ్వమంతా బ్రహ్మమే. బ్రహ్మము తప్ప వేరొకటి లేదు.

## వేదాంగములు (ముండకోప నిషత్ 1 : 1 : 5; భాగవతము 3 : 3 : 2):

వేదాంగములు అనగా వేదముల అవయవములు. వేదాంగములు, వేదములను అర్థము చేసుకునేందుకు సాంకేతికపరమైన అనుబంధ విజ్ఞానము. ఆరు వేదాంగములు ఉన్నవి. వాటి వివరములు:

- **శిక్ష (ధ్వనిశాస్త్రము):** ఉచ్చారణకు అనుగుణముగా స్వర, శబ్దముల శాస్త్రము.
- **వ్యాకరణము:** సంస్కృతభాష యొక్క నియమములు, రూపభేదములు మరియు పదములమధ్య సంబంధిత శాస్త్రము.

- **ఛందస్సు:** పద్యలక్షణములు, అధ్యయనము, లయలు యొక్క శాస్త్రము. 26 ఛందస్సులు ఉన్నవి.
- **నిరుక్తము:** వేద పదముల, శబ్ద లక్షణము అర్థము వివరించు శాస్త్రము.
- **జ్యోతిషము (ఖగోళ శాస్త్రము):** ఖగోళముల యొక్క శాస్త్రము.
- **కల్పము (సూత్రములు):** ఆచారములు, శిష్టాచారములు, యజ్ఞములు మరియు యాగములు యొక్క సూత్రములు.

## ఉప వేదములు (భాగవతము 3 : 12 : 38)

ఉప వేదములు అనుబంధ విజ్ఞానము. నాలుగు ఉప వేదములు సాంకేతిక అంశములను వివరిస్తాయి.

- **ఆయుర్వేదము (ఔషధ జ్ఞానము):** ఇది ఔషధముల మరియు వైద్య శాస్త్రము. ఋగ్వేదము సంబంధము కలిగి ఉన్నది.
- **ధనుర్వేదము (విలువిద్యా జ్ఞానము):** విలువిద్య మరియు యుద్ధము యొక్క శాస్త్రము. ఇది యజుర్వేదము సంబంధము కలిగి ఉన్నది.
- **గాంధర్వ వేదము (సంగీత జ్ఞానము):** ఇది శాస్త్రీయ సంగీత శాస్త్రము. ఇది సామవేదము సంబంధము కలిగి ఉన్నది.
- **స్థాపత్య వేదము (వాస్తు జ్ఞానము):** భవన నిర్మాణ కళ మరియు వాస్తు శాస్త్రము. ఇది అధర్వణ వేదము సంబంధము కలిగి ఉన్నది.

# ఉపనిషత్తులు

"**ఉప నిషత్**" అనగా సమీపముగా క్రింద భక్తి శ్రద్ధలతో కూర్చునట. '**ఉప**' అనగా పరమాత్మునికి (గురువు) సమీపముగా, '**నిషత్**' అనగా క్రింద భక్తి శ్రద్ధలతో కూర్చునట. ఉప నిషత్ శబ్ద ప్రమాణము అయినందున గురువు శిష్యునకు బోధించే సమయములో, శిష్యుడు గురువు సమీపములో క్రింద భక్తి శ్రద్ధలతో కూర్చొనవలెను. మంత్రములు లేదా సంహితములు చివర ఆధ్యాత్మిక వివరణలు (సారాంశము) ఉపనిషత్తులలో ఉన్నవి. అందుకే ఉపనిషత్తులను వేదాంతములు అనికూడా అంటారు. ఉపనిషత్తులలో, వేదములలో ఉన్న పరమార్థిక, ఆధ్యాత్మిక అంతిమ సత్యములు, సంభాషణ పద్ధతిలో చెప్పబడి ఉన్నవి. అందుచే ఉపనిషత్తులను జ్ఞాన కందము (వేదముల వాస్తవమైన జ్ఞానమునకు మూలము) అని పిలుస్తారు. జీవాత్మ ఆదినుండి మహామాయ యొక్క బానిసత్వములో ఉన్నది. అవిద్య (అజ్ఞానము) ప్రభావము వలన, ప్రతిజీవీ ప్రాపంచిక ఆకర్షణలకులోనై వాటిలోని ఆనందములను (ఇవి తాత్కాలికము, పరిమితము) అనుభవించాలని కోరుకుంటారు. వారి స్వాభావిక బలహీనతతో ఎండమావివంటి తాత్కాలిక సంతోషము, సంపదలు, పేరు మరియు కీర్తి కొఱకు వారి జీవితమంతా కర్మలు చేస్తూ, ఆ కర్మల ఫలితములు అనభవించుట కొఱకు అంతమైన జన్మలు ఎత్తుతూ, సంసార చక్రములో (జన్మ, మృత్యు, పునఃజన్మలు) నిరంతరమూ తిరుగుతూ ఉంటారు. కానీ వారి కోరికలకు అంతము ఉండదు. ఉపనిషత్తులు, జీవాత్మ, మహామాయ యొక్క బానిసత్వము నుండి విముక్తిపొంది, అనంతమైన శాశ్వతమైన దైవ పరమానందము పొందే మార్గములు వివరిస్తాయి (తైత్తిరీయోప నిషత్ 2 : 7). వేదముల

1,180 శాఖలకు సంబంధించిన 1,180 ఉపనిషత్తులలో ప్రస్తుతము 108 ఉపనిషత్తులు అందుబాటులో ఉన్నవి (ముక్తికోపనిషత్ 1 : 3, 6 నుండి 8 వరకు). ఈ 108 ఉపనిషత్తులు తత్వజ్ఞానము కలిగి ఉన్నవి. ఈ ఉపనిషత్తులు ఋక్వేదీయములు - 10, శుక్ల యజుర్వేదీయములు - 19, కృష్ణ యజుర్వేదీయములు - 32, సామ వేదీయములు - 16, అధర్వణ వేదీయములు - 31 ఉన్నవి (మొత్తము 108). మరియు ఈ 108 ఉపనిషత్తులను ముఖ్య ఉపనిషత్తులు - 10, సన్యాసమును ప్రధానముగా బోధించిన ఉపనిషత్తులు - 17, యోగవిద్యలను ప్రధానముగా బోధించిన ఉపనిషత్తులు - 20, వేదాంత విజ్ఞానమును ప్రధానముగా బోధించిన ఉపనిషత్తులు - 24, వైష్ణవ సిద్ధాంతమును ప్రధానముగా బోధించిన ఉపనిషత్తులు - 14, శైవ సిద్ధాంతమును ప్రధానముగా బోధించిన ఉపనిషత్తులు - 15, శక్తి (దేవీ) సిద్ధాంతమును ప్రధానముగా బోధించిన ఉపనిషత్తులు - 8 (మొత్తము 108) విభజించిరి. వాటిలో, 10 + 2 (12) ఉపనిషత్తులు ప్రధాన ఉపనిషత్తులు అని పిలుస్తారు. అవి: (ఎ) ఈశావాస్యోప నిషత్, (బి) కేనోప నిషత్, (సి) కఠోప నిషత్, (డి) ప్రశ్నోప నిషత్, (ఇ) ముండకోప నిషత్, (ఎఫ్) మాండూక్యోప నిషత్, (జి) తైత్తిరీయోప నిషత్, (హెచ్) ఐతరేయోప నిషత్, (జె) ఛాందోగ్యోప నిషత్, (కె) బృహదారణ్యకోప నిషత్, (ఎల్) శ్వేతాశ్వతరోప నిషత్ మరియు (ఎమ్) కౌషీతకీబ్రాహ్మణోప నిషత్. వీటిలోని కొన్ని ముఖ్య ఉపనిషత్తులలోని ముఖ్య అంశములు క్లుప్తముగా వ్రాయుచున్నాను.

## ఈశావాస్యోప నిషత్

ఈశా అనగా బ్రహ్మము. ఈశావాస్యోప నిషత్ శుక్ల యజుర్వేదాంతర్గతము. "**ఈశా వాస్య మిదగం సర్వం**" (అనగా ఇదంతా ఈశ్వరుని ఆజ్ఞ). దీని ముఖ్య ఉద్దేశము పరమాత్మ (కారణ భూతుడు), విశ్వము (కార్యము) యొక్క ఐక్యత మరియు జీవాత్మ యొక్క పరిపూర్ణ జ్ఞానము పొందుటకు మార్గములు బోధిస్తుంది. బ్రహ్మము ఈ విశ్వమంతా సమానముగా వ్యాపించి ఉన్నారు. ఈశావాస్యోప నిషత్ బ్రహ్మ విద్య (పరమాత్ముడు స్వభావము గురించి జ్ఞానము), ఉపాసన (భక్తి భావము) మరియు ఉపాసక (భక్తుడు) గురించి వివరిస్తుంది.

- ❖ ఆయాత్మ చలించును, చలించదు. ఆయాత్మ దూరములో నున్నది; దగ్గరగా నున్నది. ఆయాత్మయే సర్వవ్యాపకముగా నున్నది. ఈ ప్రపంచమునకు వెలుపల లోపలగూడ నున్నది (5).
- ❖ అన్ని ప్రాణులు తన ఆత్మకంటే భిన్నములు కావనీ, తన ఆత్మయే అన్ని జీవులలో నున్న ఆత్మ అనీ దర్శించే జ్ఞాని, ఆ దర్శన వివేకము చేత దేనిని ద్వేషింపడు (6).
- ❖ కర్మోపాసనలు రొండింటినీ కూడా ఒకడే యాచరింపదగునని తెలిసుకొని ఈ రెండింటిని కూడా నాచారించు మనుష్యుడు - కర్మచేత భయరూపమగు మృత్యువు నతిక్రమించి, ఉపాసనచేత దేవతాస్వరూప భావము నొందును (11).

## కేనోప నిషత్

కేనోప నిషత్ సామవేదాంతర్గతము. ఇది పరబ్రహ్మము, ప్రపంచము యొక్క అంతర్లీన సంపూర్ణ సూత్రము మరియు పరిపూర్ణ ఈశ్వరుడను వివరిస్తుంది. ఎవరైతే ప్రాపంచిక వ్యవహారముల నుండి తమ ఆలోచనలు వెనక్కి మరలించి, పరమాత్ముడు యొక్క అంతిమ వాస్తవము మీద దృష్టి కేంద్రీకరించగలరో వారికి పరబ్రహ్మము యొక్క జ్ఞానోదయము కలిగి మహామాయ యొక్క బానిసత్వము నుండి విముక్తి కలుగుతుంది. జీవాత్మ, పరబ్రహ్మము యొక్క ఉపాసనతో క్రమముగా జ్ఞాని అయి జీవాత్మ, పరమాత్మ ఏకత్వ అనుభూతి పొందుతాడు.

- ❖ ఆయాత్మ చెవికి చెవి, మనస్సునకు మనస్సు, వాక్కునకు వాక్కు మరియు ప్రాణమునకు ప్రాణము, కన్నుకు కన్ను. వీటియందు ఆత్మ భావము వదలి, ఇంద్రియ వ్యవహార జీవితము వదలుకొనిన బ్రహ్మ జ్ఞానులు అమృత పదవిని పొందుతారు (2 : 1).
- ❖ పరబ్రహ్మమును నేత్రములతో చూచుటకు వీలుకాదు; వాక్కుతో చెప్పుటకు వీలుకాదు. మనస్సుతో చింతించుటకు వీలుకాదు; అట్టి ఆత్మను బోధించుట ఎట్లు? మాకు తెలియదు. అది తెలియువాటికి తెలియబడని వాటికి అతీతముగా నున్నది. మా గురుదేవులు ఈ రీతిగా చెప్పుచుండుట వినియుంటిమి (1 : 3).
- ❖ ఈ మానవ జన్మయందు పరమాత్మను గూర్చి తెలిసికోనినచో, అతనికి సత్యమైన బ్రహ్మానందము

❖ సిద్ధించుచున్నది. ఆ ప్రకారముగ ఈ జన్మయందు భగవంతుని గూర్చి తెలిసికోనలేనిచో గొప్ప వినాశము సంభవించుచున్నది. ధీరులగువారు సమస్తభూత కోట్ల యందును అద్వితీయాత్మ తత్త్వమును తెలిసికొని ఈ లోకము నుండి (దేహము నుండి) వేరై జనన మరణ రహితులగుచున్నారు (అమృతత్వమును పొందుచున్నారు) (2 : 5).

## కఠోప నిషత్

కఠోప నిషత్ కృష్ణ యజుర్వేదాంతర్గతము. గౌతముడు (వాజశ్రవసుడు) అను ఋషి విశ్వజిత్ అను పేరు గల యజ్ఞము చేసి అందులో తన సర్వస్వమును ఋత్త్విక్కులకు దానముగా నిచ్చెను. అతని పుత్రుడగు నచికేతుడు, తండ్రి దక్షిణలు పంచిపెట్టుచుండగా, బాల హృదయములో తండ్రి యొక్క భావి శ్రేయస్సును గురించి తీవ్రమైన శ్రద్ధ అవహించెను. అప్పుడు నచికేతు ఈ రీతిగా భావించెను "**దానమిచ్చిన గోవులు ఇంక నీరు త్రాగలేనివి, గడ్డిని తినలేనివి, వట్టిపోయినవి. కాబట్టి అట్టి గోవులను దానము చేయువారు నరకలోకమునకు వెళ్ళగలరు**". నచికేతుడు తండ్రిని సమీపించి "తండ్రీ! నన్నెవరికి దానమిచ్చెదవు?" అని అడిగెను. తండ్రి బదులు పలుకకపోగా, అదే ప్రశ్నను రెండవసారి, మూడవసారి అడిగెను. చిరాకుతో, కోపముతో "మృత్యువున కిచ్చెదను" అని తండ్రి జవాబు చెప్పెను. నచికేతుడు యమసదనమునకు వెళ్ళెను. 3 దినముల పిమ్మట వైవస్వతుడు (యముడు) రాగానే ఇంటిలోని పెద్దలు ఈ విధముగా చెప్పిరి "అతిధిగా వచ్చిన బ్రాహ్మణుడు అగ్ని వలె గృహములో ప్రవేశించును. ఆ బ్రాహ్మణుని యజమాని

తృప్తిపరచవలెను. ఎవరి గృహములో బ్రాహ్మణుడు నిరాహారుడై యుండునో, అట్టి అజ్ఞాని ఆశలు, ఆకాంక్షలు, సత్సాంగత్యము, మైత్రి, యజ్ఞములు, పుణ్యదానములు, పుత్ర పశుసంపదలు అన్నియు నాశనమగును. అప్పుడు వైవస్వతుడు "అతిధిగా వచ్చియున్న బ్రాహ్మణోత్తమా! నీవు నా గృహములో మూడు రాత్రులుపవాస ముంటివి. దానికి ప్రాయశ్చిత్తముగా మూడు వరములను ఈయదలచితిని కోరుకోనుము. నీకు నమస్కరించుచున్నాను. నాకు శుభమగుగాక" అని నచికేతునితో చెప్పెను (1 : 1 నుండి 9 వరకు).

అప్పుడు నచికేతుడు "ఓ వైవస్వతా! నా తండ్రి గౌతముడు నామీద కోపము లేక, కరుణ కలిగి, సమాధానపడి, నీవు పంపిన నేను, తిరిగి వెళ్ళగానే నన్ను అంగీకరించునటుల చేయుము. ఇయ్యది నీవిచ్చెదనన్న మూడు వరములలో మొదటిది" అని వచించెను. నచికేతుడడిగిన మొదటి వరమునకు యముడు అంగీకారము తెలుపుతూ "పూర్వము నీ తండ్రి యెట్టి ప్రేమ కలిగియుండెనో అట్టి ప్రేమనే నీయందు కలిగియుండును" అని పలికెను (1 : 1 : 10, 11). తరువాత నచికేతుడు "ఓ వైవస్వతా! స్వర్గసాధనమైన అగ్ని (యజ్ఞము) నీకు బాగా తెలియును. శ్రద్ధాళువైన నాకు ఆ యజ్ఞ విజ్ఞానమును రెండవ వరముగా కోరుచున్నాను". దానికి యముడు "ఆ యజ్ఞము శాశ్వత స్వర్గ సుఖము ననుభవించుటకు సాధనము, సకల లోకములకు ఆధారము." ఆ పిమ్మట యముడు ఆ అగ్ని విజ్ఞానమును వివరించెను (1 : 1 : 13, 14, 15). తరువాత నచికేతుడు "మనుష్యుడు (జీవాత్మ) తన దేహమును విడిచి వెళ్ళిన పిమ్మట, కొందరతడున్నాడని, కొందరతడు లేడని పలుకుచున్నారు. నీ చేత బోధింపబడినవాడినై నేనా రహస్యమును నీనుండి

శ్రవణము చేయగోరుచున్నాను. మూడవ వరము ఇదియే". యముడు "నచికేతా! ఆత్మ విషయమగు నీ ధర్మము అత్యంత సుక్షమైనది. ఈ విషయముపై పూర్వము దేవతలుకూడా సంశయము గల వారైరి. సూక్ష్మాతి సూక్ష్మమగుటచే ఇది అంత తేలికగా తెలిసికొనుట సాధ్యముకాదు. ఈ విషయమున నన్ను నిర్బంధింపకుము. దీనిని విడిచిపెట్టి మరియొక వరమును కోరుకొనుము". అప్పుడు నచికేతుడు "ఓ మృత్యుదేవా! నీకంటే గొప్పవాడు ఆత్మ ధర్మమును చెప్పగలవాడు మరొకడు లేడు. ఈ వరముతో సమానమైన వరము మొరొకటి లేదు (1 : 1 : 21, 22). "నన్ను పరీక్షించుట మాని ఆత్మజ్ఞానమును మాత్రమే నాకు చెప్పుము" (1 : 1 : 29) అని పట్టుబట్టెను. అప్పుడు యముడు సంతుష్టుడై ఆత్మజ్ఞానము గురించి వివరముగా (శ్రేయస్సు, ప్రేయస్సు; విద్య, అవిద్య; గురుబోధన; కోరికలు, కర్మలు, కర్మఫలములు; ఓం కారము - ప్రణవము; ఆత్మతత్త్వము - మనస్సు, ఇంద్రియములు) నచికేతుడునకు బోధించెను (ప్రధమాధ్యాయము 2 వ వల్లి మరియు 3 వ వల్లి; ద్వితీయాధ్యాయము). అందులో కొన్ని ముఖ్యమైనవి:

- ❖ వివేకి, ప్రేయస్సు (ప్రపంచమును) త్యజించి, శ్రేయస్సుని (పరమాత్ముని) కోరుకుంటాడు (1 : 2 : 1, 2, 3).
- ❖ అవివేకి, అవిద్యతో (అజ్ఞానముతో) ధనమోహముతో పరలోకము లేదు అని తలచి మృత్యుదేవత వశమగుచున్నాడు (1 : 2 : 6).
- ❖ ఆయాత్మ (పరమాత్మ), అల్పబుద్ధులచే బోధించిన, తెలిసికొనుటకు శక్యము కాదు. కాని ఆయాత్మ, బ్రాహ్మైక్యము పొందిన సద్గురువు చేత బోధించిన, దానిని పొందవచ్చు (1 : 2 : 8).

- యోగి, అత్మధ్యాన సాధన ద్వారా, పురాణమైన, చర్మచక్షువున కగోచరమై, హృదయకుహరమందు గుప్తమై సంసార బంధమున చిక్కుకొని బుద్ధి మధ్యస్థుడై యుండి ఆ పరమాత్మను దర్శించి సుఖదుఃఖములను త్యజించుచున్నాడు (1 : 2 : 12).
- ఓం (ప్రణవము) పరబ్రహ్మ. ఈ అక్షర పరబ్రహ్మమును తెలిసికొనిన వానికి సర్వకార్యములు సిద్ధించును (1 : 2 : 16).
- ఈ ఆత్మ జన్మించదు, మరణించదు, నిత్యమైనది, శాశ్వతమైనది, దేనినుండి ఉద్భవించలేదు మరియు ఈ ఆత్మ నుండి ఏదియు ఉద్భవించలేదు (1 : 2 : 18).
- అత్మతత్త్వము అణువుకంటె అణువుగాను, మహత్తుకంటె మహత్తుగాను ప్రతి జీవి యొక్క హృదయకుహరము నందు నివసించుచున్నది (1 : 2 : 20).
- ఆత్మ ప్రాప్తి, వేదాధ్యయన, గ్రంథార్థ శ్రవణము, పాండిత్యము చేత సాధ్యము కాదు. సాధకుడు స్వాత్మభూతుడగు ఆత్మను పొందవలయునని కోరునో అట్టివానిచే స్వయముగా అత్మలభ్యుడగునని తెలిసికొనవలెను (1 : 2 : 23).
- ఆత్మని రథములోని యజమానిగా తెలిసికొనుము. శరీరము రథముగాను, బుద్ధిని సారథిగాను, మనస్సును కళ్ళెముగాను, ఇంద్రియములు గుర్రములుగాను, వాటి మార్గములు ఇంద్రియ విషయములుగాను తెలిసికొనుము. ఆత్మను ఈ దేహేంద్రియ మనస్సుతో కూడినపుడు 'భోక్త' అంటారు (1 : 3 : 3, 4). ఎవనికి విజ్ఞానమను సారథియు, స్వాధీనములో నున్న మనస్సు అనుకళ్ళెమును (మనోనిగ్రహము) ఉండునో, అట్టివాడు జీవిత మార్గము

యొక్క గమ్యమగు బ్రహ్మపదమున చేరుచున్నాడు (1 : 3 : 9).

- ❖ జ్ఞానేంద్రియములు కంటె శబ్దాది విషయములు సూక్షమైనవి. శబ్దాది విషయములు కంటె సూక్ష్మమైనది మనస్సు. మనస్సు కంటె బుద్ధి గొప్పది. బుద్ధి కంటె మహాతత్త్వము పరమైనది. మహాతత్త్వము కంటె పరమైనది అవ్యక్తము, అవ్యక్తము కంటె పరమైనవాడు ప్రత్యగాత్మ పురుషుడు. ఆ పురుషుడు కంటె శ్రేష్టమైనది మరొకటి లేదు (1 : 3 : 11, 12).

## ముండకోప నిషత్

ముండకోప నిషత్ అథర్వణ వేదాంతర్గతము. బ్రహ్మ విద్యను పరం పరగా పరమ పిత బ్రహ్మ - అధర్వుడు - అంగిరుడు - సత్యవహుడు - అంగిరసులకు ఉపదేశించెను. గృహస్తుడగు శౌనకుడు, అంగిరసుడను శాస్త్ర ప్రకారము పూజించి "హే భగవాన్! దేనిని తెలుసుకున్నచో అన్నింటినీ తెలిసికొనినట్లు అగును? అది యేది?" అని ప్రశ్నించెను. ఈ ఉపనిషత్తులో అంగిరసుడు, శౌనకునకు బోధించి వాటిలో కొన్ని ముఖ్యమైనవి:

- ❖ పర విద్య, అపర విద్య అని రెండు విద్యలు తెలియతగినవి. అపరవిద్య (వేదములు, వేదాంగములు), ఏ విద్యచే, అక్షరుడగు పరమాత్మ యొక్క స్వరూపము ప్రాప్తించునో అది పరవిద్య (బ్రహ్మ విద్య) (1 : 1 : 4, 5).
- ❖ ఈ పరబ్రహ్మ తత్త్వము దర్శించుటకుగాని, గ్రహించుటకుగాని వీలుకానిది, సంబంధములేనిది, రంగులు రూపములుగాని, నేత్రములు శ్రోత్రములుగాని,

హస్తములు పాదములుగాని లేనిది. నిత్యమైనది, సర్వవ్యాపకమైనది. సర్వగతము, అత్యంత సూక్ష్మము, అవ్యయము, సమస్త భూతముయొక్క ఉత్పత్తి స్థానమై యున్నది (1 : 1 : 6).

- అక్షర బ్రహ్మము నుండి యీ సర్వ జగత్తు పుట్టుచున్నది. అక్షర బ్రహ్మము జ్ఞాన తపస్సుతో అభివృద్ధి యగుచున్నది. ఆ బ్రహ్మము నుండి అవ్యాకృతము (అన్నము), అవ్యాకృతము నుండి హిరణ్యగర్భుడు, మనస్సు, ఆకాశాది పంచభూతములు, సప్త లోకములు, కర్మలు, కర్మఫలములు పుట్టుచున్నవి. (1 : 1 : 7, 8).
- ప్రకాశించి ప్రజ్వలించుచున్న అగ్ని నుండి, ఆ అగ్నితో సమాన రూపముగల నిప్పురవ్వలు వేలకొలది ఎట్లు పుట్టుచున్నవో అదే రీతిగా అక్షరము నుండి అనేక విధములైన జీవులు జన్మించుచున్నారు. ఆ అక్షర పరబ్రహ్మమునందే లీనమగుచున్నారు (2 : 1 : 1).
- మాయోపాధితోకూడిన విరాత్పురుషుని నుండి ప్రాణములు, మనస్సు, అన్ని ఇంద్రియములు, ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథివి జన్మించుచున్నవి (2 : 1 : 3).
- ఏది కాంతి గలదో, అణువు కంటెను అణువైనదో, దేనియందు పృథివ్యాది లోకములను, మనుష్యాదులను, ఉంచబడినారో అదియే ఈ అక్షర బ్రహ్మము. అదియే ప్రాణము, వాక్కు, మనస్సు. సత్యము, నాశరహితము. మనస్సునకు లక్ష్యముగా చేయదగినది (2 : 2 : 2).
- దేనియందు స్వర్గలోకము, భూమి, అంతరిక్షము, సకల ప్రాణాదికరణములతో కూడిన మనస్సు, సమర్పితమై ఉన్నవో, ఆ అక్షర బ్రహ్మమునే, అద్వితీయునిగాను,

మీయొక్క అత్మనుగాను తెలుసుకోనుడు. ఈ ఆత్మజ్ఞానము మోక్షమునకు వారధియైయున్నది (2 : 2 : 5).

## మాండూక్యోప నిషత్

మాండూక్యోప నిషత్ అథర్వణ వేదాంతర్గతము.

- **'ఓమ్'** ('అ' కారము + 'ఉ' కారము + 'మ' కారము + '--' (మాత్రారహితమైనవి బిందువు మరియు నాదములను సూచించును) అని చెప్పబడే అక్షరమే భూతకాలము, వర్తమానకాలము, భవిషత్కాలము మొత్తమంతయును ఓంకారమే. ఇంకనూ త్రికాలతీతమై యేదైతే కలదో అదికూడా ఓంకారమే. ఓంకారము బ్రహ్మరూపమే. ఈ ఆత్మయే బ్రహ్మము. ఈ ఆత్మయే నాలుగు పాదములు కలది (1 : 1 : 1, 2).
- జాగ్రదవస్థ స్థానముగ కలవాడు బహిః ప్రజ్ఞకలవాడు, స్థూల భోక్త అయిన వైశ్వానరుడు ప్రథమ పాదము (1 : 1 : 3).
- స్వప్నము స్థానముగ కలవాడు అంతః ప్రజ్ఞకలవాడు, సూక్ష్మ భోక్త అయిన తైజసుడు ద్వితీయ పాదము (1 : 1 : 4).
- ఏ చోట ఏ సమయంలో నిద్రించుచున్నవాడైమ యెట్టి కోర్కెను కోరడో, యే స్వప్నమును చూడడో, అది సుషుప్తి. సుషుప్తియే స్థానంగా కలవాడు ప్రాజ్ఞుడు మూడవ పాదము. ఇతడే సర్వేశ్వరుడు, సర్వజ్ఞుడు, అంతర్యామి, అంతటికి కారణము, సమస్త భూతముల యొక్క ఉత్పత్తిలయాలకు స్థానము (1 : 1 : 5, 6).
- ఆ తురీయుడు పై మూడు స్థానములకు అతీతుడు, అదృశ్యుడు, వ్యవహారమునకు అందనివాడు,

గ్రహించుటకు వీలుకానివాడు, లక్షణ రహితుడు, చింతింపరానివాడు, శబ్దముతో నిర్దేశింప వీలుకానివాడు, ఏకాత్మ ప్రత్యయసారుడు, ప్రపంచోపశముడు, శాంతుడు, శివుడు, అద్వైతుడు, అతడే తురీయుడు. అతడే ఆత్మ. అతనిని తెలిసుకోనవలెను (1 : 1 : 7).

**<u>గమనిక:</u>** బృహదారణ్యకోప నిషత్ 4 లేదా 6 : 3 : 9 నుండి 32 వరకు, మరియు పేజి సంఖ్య 185, 186, 187 చూడుము.

## తైత్తిరీయ ఉపనిషత్తు

తైత్తిరీయోప నిషత్ కృష్ణ యజుర్వేదాంతర్గతము. దీనిలో బ్రహ్మ జ్ఞానము మరియు సృష్టి వివరణలు ఉన్నవి. ఓం, పరబ్రహ్మమునకు మరియు ఈశ్వరుడునకు, చిహ్నము (1 : 1 : 8). ఒక వ్యక్తి యొక్క ప్రవర్తన క్రింది విధముగా ఉండవలెను. ఇవి వేదములలో గుప్తముగా ఉన్న ఆదేశములు, బోధనలు, శిక్షణ మరియు ప్రార్ధన (1 : 11 : 1 నుండి 6 వరకు):

- సత్యం వద. ఎప్పుడూ సత్యమునే పలుకుము.
- ధర్మం చర. ఎప్పుడూ దర్మమునే పాటించుము.
- వేదములు అధ్యయనము చేయుము.
- గురువును ఆదర్శముగా భావించుము.
- సంతానమునకు విచ్చేదము చేయకుము.
- ఐశ్వర్యము కొఱకు మంగళయుక్తమగు కర్మలు చేయుము.
- దేవ, పితృ కార్యములు చేయుము.తల్లితండ్రులను, ఆచార్యులను, అతిధిని దైవముగా భావించుము.
- అనిందకార్యములు చేయుచూ, నిందకార్యములు విడువుము.

❖ దానము ఫలములు ఆశించకుండా, పుష్కలముగా, విశ్వాసముతో, వినయముతో, శ్రద్ధతో చేయుము.

**"సత్యం, జ్ఞానం, అనంతం బ్రహ్మ"**. ఇట్టి పరబ్రహ్మము హృదయాకాశము నందు బుద్ధి గుహయందున్నది. ఆత్మ శబ్దమే గుణముగా కలిగి సమస్త భూతములకు అవకాశమునకు ఆకాశము పుట్టినది. ఆ ఆకాశము నుండి సబ్ద, స్పర్శ రెండు గుణములు గల వాయువు పుట్టినది. ఆ వాయువు నుండి సబ్ద, స్పర్శ, రూపము మూడు గుణములు గల అగ్ని పుట్టినది. ఆ అగ్ని నుండి సబ్ద, స్పర్శ, రూపము, రసము నాలుగు గుణములు గల జలము పుట్టినది. ఆ జలము నుండి సబ్ద, స్పర్శ, రూపము, రసము, గంధము ఇదు గుణములు గల భూమి పుట్టినది. ఆ భూమి నుండి ఓషదులు పుట్టినవి. ఆ ఓషదులు నుండి అన్నము పుట్టినది. ఆ అన్నము నుండి పురుషుడు (అనగా పురుష, స్త్రీ లింగములు రెండునూ) పుట్టినవి (2 : 1 : 1).

పరమాత్మ అనేక విధములుగా కావలెనని తలంచెను. పరమాత్మ ఈ సమస్త జగత్తును సృజించెను. సృజింపబడిన ఈ జగత్తిను అనుసరించి, ప్రవేశించి, మూర్తస్వరూపముగానూ, అమూర్తస్వరూపముగానూ, తానే అయ్యేను (2 : 6 : 2). సృష్టికి ముందు అవ్యాకృతమైన పరబ్రహ్మముగా నుండెను. అట్టి అవ్యాకృత పరబ్రహ్మము నుండియే ప్రవివిక్తమగు నామరూప విశేషముగల జగత్తు పుట్టెను. స్వకర్తృకమైన పరబ్రహ్మము, తృప్తి హేతువగు ఆనందకరమైన రస స్వరూపముగా నున్నది (2 : 7 : 1). వరుణపుత్రుడు బృగువు బ్రహ్మవిద్యను చెప్పమని తండ్రిని అడుగగా, వరుణుడు పరబ్రహ్మ విద్యాప్రాప్తియందు దేహమును, ప్రాణమును, నేత్రములను, శ్రోత్రములను, వాక్కును, మనస్సును

సాధనములైన ద్వారములు. తపస్సు చేతనే బ్రహ్మస్వరూపమును తెలిసికోగలరని చెప్పెను. బృగువు తపస్సు చేసి తండ్రి దగ్గరకివచ్చి 'అన్నము బ్రహ్మము' అని చెప్పగా, వరుణుడు ఇంకనూతపస్సు చేయమని చెప్పెను. బృగువు తపస్సుచేసి తండ్రి దగ్గరకివచ్చి 'ప్రాణము బ్రహ్మము' అని చెప్పగా, వరుణుడు ఇంకనూతపస్సు చేయమని చెప్పెను. బృగువు తపస్సుచేసి తండ్రి దగ్గరకివచ్చి ' మనస్సు బ్రహ్మము' అని చెప్పగా, వరుణుడు ఇంకనూతపస్సు చేయమని చెప్పెను. బృగువు తపస్సుచేసి తండ్రి దగ్గరకివచ్చి 'విజ్ఞానము బ్రహ్మము' అని చెప్పగా, వరుణుడు ఇంకనూ తపస్సు చేయమని చెప్పెను. బృగువు తపస్సు చేసి **"ఆనందము నుండియే సమస్త భూతములు పుట్టి, ఆనందముచేతనే జీవించుచూ, అంతమునందు ఆనందమును గూర్చి పోయి, తామంతటను ఆనందస్వరూపమై ప్రవేశించి ఆనందమే యగుచున్నవి. కనుక ఆనందమే పరబ్రహ్మ స్వరూపముగా దెలిసికొనెను"**. ఈ పరబ్రహ్మవిద్య శ్రేష్ఠమగు హృదయ గుహయందలి పరమాకాశము నందుంచబడియున్నది (3 : 6 : 1 నుండి 6 వరకు).

## ఐతరేయోప నిషత్:

ఐతరేయోప నిషత్ ఋక్వేదాంతర్గతము.

- సృష్టికి పూర్వము నిత్యసత్య శుద్ధబుద్ధ పరబ్రహ్మము తప్ప మరొకటి లేదు. ఆ పరబ్రహ్మము సృష్టి చేయుటకు సంకల్పించెను (1 : 1 : 1).
- పరమాత్మ సృష్టి చేయదలచి క్రమముగా నాలుగు లోకములు - అంభోలోకము (స్వర్గలోకము), మరీచిలోకము

(ఆకాశము), మరలోకము (భూలోకము), జలలోకము సృష్టి చేసెను (1 : 1 : 2).

- ❖ ఈ లోకములను పరిపాలించగల వారిని సృష్టి చేయదలచి ఆ జలము మధ్యలో నుండి ఒక విరాట్ పురుషుని (పరమాత్ముడు) చేసెను. ఆ విరాట్ పురుషుని నుండి ఈ సర్వ జగత్తు, ఆకలిదప్పులు జన్మించినది (1 : 1 : 3, 4, 5).
- ❖ ఆకలిదప్పులు తీర్చుటకు అన్నమును సృష్టి చేసెను (1 : 3 : 2).
- ❖ ఆ పరమాత్మ ఈ పిండశరీరము నన్ను వదలి యే రీతిగా నుండగలదని అలోచించి, శిరస్సును ఛేదించి (బ్రహ్మరంధ్రము), విదృతిమార్గము ద్వారా లోపలి ప్రవేశించెను. ఇది ఆనంద స్థానము (సహస్రారము). ఆ ఆత్మకు మూడు నివాస స్థానములు (నేత్రములు, కంఠము, హృదయము) ఉన్నవి (1 : 3 : 11, 12).

## ఛాందోగ్యోప నిషత్ :

ఛాందోగ్యోప నిషత్ సామవేదాంతర్గతము.

- ❖ **"ఓం"** అనే అక్షరమే ఉద్గీథము. ఓంకారమును ఉపాసించవలెను. ఇది ప్రణవగాన వివరణము. ఈ సమస్త సృష్టి యొక్క సారము పృథివి. పృథివి రసమయముగా ఉన్నది. జలము భూమియొక్క సారము. ఓషదులు జలము యొక్క సారము. పురుషుడు ఓషదుల సారము. వాక్కు పురుషుని యొక్క సారము. ఋక్కు

(ఋక్వేదమంత్రములు) వాక్కు యొక్క సారము. సామము (సామవేదమంత్రములు) ఋక్కు యొక్క సారము. ఓంకారము సామవేద సర్వస్వమై యున్నది. ఈ ఓంకారమే సర్వమునకు సారభూతమై సర్వోత్కృష్టమై యున్నది. ఈ ఓంకారము పరమాత్మ యందుండును (1 : 1 : 1, 2, 3).

- ప్రణవమే ఉద్గీథము, ప్రకాశించు భానుడే ఉద్గీథము మరియు ప్రణవము. **సూర్యుడు ఓంకార జపముతో సంచరించుచున్నాడు.** సూర్యుడు తన పుత్రుడగు కౌషీతకి ఇట్లు చెప్పెను. "నేను ప్రణవ గానము చేయు విధముగా నీవునూ చేయుము. నా కిరణములను ఉద్గీథముగా భావించుము. దేవతలు చేయునట్టి ప్రనవగానము (ధ్యానము) ఇదియే (1 : 5 : 1, 2).
- ఈ లోకములో ఆకాశము సారభూతమైనది. జీవులందరూ ఆకాశము నుండి పుట్టుచున్నారు, చివరకు ఆకాశమునందే లీనమగుచున్నారు. ఆకాశము అన్నిటికంటే పెద్దది, సర్వదా అన్నింటికీ ఆధారమైనది. ఉద్గీథ గానము అన్నిటికంటే శ్రేష్టము, ఉత్తమము మరియు అనంతమై యున్నది. ఉద్గీథమునే ధ్యానించువారు ఉత్తమ జీవితమును గడిపి, ఉత్తమమైన దివ్యలోకములను పొందెదరు (1 : 9 : 1, 2).
- యజ్ఞ ధర్మములు మూడు రూపములుగా ఉన్నవి. (ఎ) ఆధ్యయనము, దానము; (బి) బ్రహ్మచర్యము (బ్రహ్మవిద్య ఉపాసనము); (సి) గురుకుల వాసము, ఆచార్య సేవ. వీటిని ఆచరించుట వలన పుణ్యలోక ప్రాప్తి, బ్రహ్మ సన్నిధానములో అమృత పదవి లభించును (2 : 23 : 1).

- అరుణుని పౌత్రుడు అరుణ ముని. అరుణ ముని కుమారుడు శ్వేతకేతునకు తత్త్వము (జ్ఞానము) బోధిస్తూ, ఈ దేహమునకు మూలము జలము. జలమునకు మూలము తేజస్సు. తేజస్సుకు మూలము "సత్". మరణించు మనుష్యుని వాక్కు మనస్సునందు, మనస్సు ప్రాణమునందు, ప్రాణము తేజస్సునందు, తేజస్సు పరమగు ఆత్మయందు లయము నొందుచున్నవి. అయ్యది పరమాత్మ తత్త్వము, మిక్కిలి సూక్ష్మమైనది. ఈ సర్వస్వము పరబ్రహ్మ స్వరూపము. ఇదియే బ్రహ్మము. "**తత్త్వమసి**" ఆ బ్రహ్మము నీవే అయి ఉన్నావు (6 : 8 : 6, 7).
- ఈ బ్రహ్మపురము (పురుషుడు, - లింగ బేధము లేదు, స్త్రీ లేదా పురుషుడు, నివసించు పురము) నందు, హృదయ గుహలో చిన్న పద్మము కలదు. ఆ పద్మములో సూక్షమగు అంతరాకాశము కలదు. బయలులోనున్న ఆకాశము, వాయువు, అగ్ని, జలము, సూర్యుడు, చంద్రుడు, విద్యుత్తు, నక్షత్రములు (ఉండినవియు, లేనివియు) సర్వము ఆ హృదయ సూక్ష్మ ఆకాశములో స్థితమై యున్నవి. సత్యకామమై, సత్య సంకల్పమై ఉన్న ఇట్టి ఆత్మను తెలుసికోనవలెను. ఆత్మతత్త్వమును, సత్యకామములు తెలిసినవారు సర్వలోకములలోనూ స్వతంత్రముగా సంచరించెదరు (8 : 1 : 1 నుండి 6 వరకు).
- దేవతల పక్షమున ఇంద్రుడు, రాక్షసుల పక్షమున విరోచనుడు ప్రజాపతి బ్రహ్మదేవుని సన్నిధిలో 32 సంవత్సరములు తపస్సు చేసి, బ్రహ్మతత్త్వమును బోధించమని అడిగిరి. అంతట ప్రజాపతి బ్రహ్మ క్రింద విధముగా చెప్పెను:

- "ఈ సర్వస్వమునందు కనిపించు పురుషుడే, ఆత్మ" (8 : 7 : 1, 2, 3, 4).
- "ఈ దేహమునకు మరణించు స్వభావము కలదు. ఈ దేహము, అమృతమగు ఆత్మకు, ఉపాధిగానున్నది. ఆ ఆత్మ దేహముతో నున్నప్పుడు అహంభావముతో యుండును. దేహాత్మ బుద్ధి ఉన్నంతకాలము రాగద్వేషములు నశించవు. శరీరములేని ఆత్మకు రాగద్వేషములు లేవు. శరీరములులేని ఆకాశము, వాయువు, విద్యుత్తు, పిడుగులకు ఉపాధిలు లేవు. ఇవన్నియు ఆకాశమునకు అవ్వలగావెళ్లి, పరంజ్యోతిలో లీనమై, అచ్చట స్వస్వరూపముతో ప్రకాశించు రీతిగా, ప్రత్యగాత్మ యీ శరీరమును వెడలి, పరమ జ్యోతి యందొకటియై, స్వస్వరూపమున ప్రకాశించును (8 : 12 : 1, 2, 3).
- ఈ ఆత్మ జ్ఞానమును బ్రహ్మ, ప్రజాపతికి బోధించేను. ప్రజాపతి మనువునకు, మనువు ప్రజలకు బోధించెను (8 : 15 : 1).

## బృహదారణ్యకోప నిషత్

బృహదారణ్యకోప నిషత్ శుక్ల యజుర్వేదాంతర్గతము. బృహదారణ్యకోప నిషత్తులో మూల తత్త్వములైన పరమాత్మ, ఆత్మ తత్వశాస్త్రము బోధిస్తుంది. మరియు ధ్యానము, ఉపాసన (శ్రవణము, మననము, నిదిధ్యాసనము) రీతులను బోధిస్తుంది. ఈ ఉపనిషత్తులో మహర్షి యాజ్ఞవల్క్యను క్లిష్టమైన ప్రశ్నలు అడిగిన వ్యక్తులు అతని ధర్మపత్ని మైత్రేయి మరియు మహిళ

ఋషి గార్గి వచక్ను. ఈ ఉపనిషత్తులో వివిధ దేవతలను వివరించి చివరకు ఒకేఒక్క సత్యము ఉన్నది. అది ఆత్మ. ఆత్మ పరమాత్మని ప్రతిబింబము, అంశము. ఈ ప్రపంచములో ప్రతీదానికి నామము, రూపము మరియు క్రియ కలవు. ఇవన్నియూ పరమాత్మని పరిణామములే. ఈ ఉపనిషత్తులోని పవమాన మంత్రము మరియు ముఖ్యమైన ఇతర మంత్రములు క్రింద వివరించబడినవి:

- **"ఆసతో మా సధ్గమయ, తమసో మా జ్యోతిర్గమయ, మృత్యోర్మా అమృతం గమయ"** అనగా మృత్యువే అసత్తు. సత్తే అమృతము. మృత్యువును దాటించి నాకు అమృతమును యిమ్ము(1 లేక 3 : 3 : 28).
- **"అహం బ్రహాస్మీతి"** అనగా ఈ సమస్త ప్రపంచము పరబ్రహ్మ జ్ఞానముకంటె (సృష్టికి) పూర్వము పరబ్రహ్మముగానే ఉండెను. ఈ పరబ్రహ్మము నేను, పరబ్రహ్మమైతినని, తన్నే తాను తెలిసికొనెను (1 లేక 3 : 4 : 10).
- జ్ఞాన సాధనములు (8 గ్రహములు), ఉపసాధనములు (8 అతిగ్రహములు) కలవు అవి: ఘ్రాణము (వాసనను గ్రహించునది) గ్రహము, గంధము అతిగ్రహము; వాక్కు గ్రహము, వ్యక్త్య విషయము అతిగ్రహము; జిహ్వ గ్రహము, రసము అతిగ్రహము; నేత్రము గ్రహము, రూపము అతిగ్రహము; శ్రోత్రము గ్రహము, శబ్దము అతిగ్రహము; మనస్సు గ్రహము, కామము అతిగ్రహము; హస్తములు గ్రహము, కర్మలు అతిగ్రహము; త్వగింద్రియము (చర్మము) గ్రహము, స్పర్శ అతిగ్రహము (3 లేక 5 : 2 : 1 నుండి 9 వరకు).

❖ నీ ఆత్మయే సర్వాంతరుడై యున్నాడు. సర్వాంతర్యామియే నీ ఆత్మ. సర్వమును చూచు దృగ్రూప మగు పరబ్రహ్మను ఈ నీ చూపుచే చూడజాలవు. విను శక్తినే వినువానిని నీవు శ్రవణముచేయజాలవు. విచారించు శక్తినే విచారించు వానిని విచారింప జాలవు. తెలిసికొను శక్తినే తెలియువానిని నీవు తెలిసికోలేవు. ఈ పరమసత్యమును విడిచి తక్కినదెల్ల శుక్తి రాజతమువలె మిథ్యః భ్రాంతి, లేక వినాశ శీలము (3 లేక 5 : 4 : 2).



# స్మృతులు

**"స్మృతి"** అనగా "స్మరణ, తెలివి, తలంపు, బుద్ధి, జ్ఞాపకము". స్మృతులలో హిందువుల ధర్మ సూత్రములు మరియు ప్రవర్తనా విధానములు ఉన్నవి. 18 స్మృతులు (మను, బృహస్పతి, దక్ష, గౌతమ, శంఖ, పరాశర, యాజ్ఞవల్క్య, విష్ణు, అత్రి, యము మొదలైనవి), 30 ఉప స్మృతులు (నారద, గర్గ, బౌధయాన, విశ్వామిత్ర, స్కాంద, వ్యాస, వసిష్ఠ, భరద్వాజ మొదలైనవి) (కొన్ని మాత్రమే ప్రస్తుతము అందుబాటులో ఉన్నవి). ప్రకృతిలో, కాలములో మార్పు సహజము. వాటిలోని మార్పుల కారణముల వలన ధర్మ సూత్రములు మరియు ప్రవర్తనా విధానములలో కూడా మార్పు అవసరము. సత్య లేదా కృతయుగమునకు మనుస్మృతి, త్రేతాయుగమునకు గౌతమ స్మృతి, ద్వాపరయుగమునకు శంఖస్మృతి మరియు కలియుగమునకు (ప్రస్తుతము) పరాశరస్మృతి వర్తిస్తాయి.

## ధర్మ సూత్రములు

ధర్మ సూత్రములలో ప్రజల వివిధ జీవిత దశలలో (ఆశ్రమములలో) మరియు స్త్రీల విధులు, ప్రవర్తనలు; రాజు యొక్క విధులు, వ్యవహరించే హక్కులు; న్యాయ విషయములు, వివిధ నేరములు, వాటికి శిక్షలు; ధార్మిక అంశములు జీవాత్మ పవిత్రీకరణము, ప్రాయశ్చిత్తముల గురించి విస్తృతమైన వివరము ఉన్నవి.

## మను స్మృతి

ఈ కల్పము యొక్క మొదటి మన్వంతరము ఆరంభములో పరమపిత బ్రహ్మ సృష్టి సహాయము కొఱకు మొదటి మను స్వయంభువను సృష్టించినారు. మను అనగా పితృస్వామ్య వ్యవస్థ. ఆయన వ్రాసిన మను స్మృతి (నైతిక నియమావళి) చాలా ముఖ్యమైనది. మను స్మృతి మనవ ధర్మ శాస్త్రము. దీనిలో మానవుల కర్మ బాధ్యతలు, జీవితము యొక్క సక్రమ మార్గము, ధర్మప్రవర్తన, ఆచారములు (జీవితములోని అన్ని అంశములు) ఉన్నవి. పుస్తకము 5 లో **"ఎక్కడైతే స్త్రీలు సత్కరింపబడతారో, దేవతలు సంతోషించి, అక్కడ శుభములు కలుగచేస్తారు. ఎక్కడ స్త్రీలను గౌరవించరో అక్కడ ఏ పవిత్ర కర్మలు (యాగములు, నిత్యకర్మలు) చేయకూడదు, చేసినా ఫలించవు"** (మను స్మృతి 3 : 56). **"స్త్రీల శారీరక మరియు మానసిక బలహీనతలను దృష్టిలో పెట్టుకుని స్త్రీలకు, బాల్యములో తండ్రి, యుక్త వయస్సులో భర్త, వృద్ధత్వములో కుమారుడు రక్షణ, భాద్యత వహించవలెను. స్త్రీలకు కొన్ని పరిధులు, పరిమితములు కూడా ఉన్నవి"**. (**గమనిక:** వీటికి ప్రసుత సమయములో విపరీత అర్థములు ఆరోపిస్తారు. స్త్రీ పదమునకు సరైన అర్థము **"స్త్రీ అనే అక్షరము నాలుగు అక్షరముల కలయిక (స + త + ర + ఈ). స - సత్త్వగుణము, త - తమోగుణము, ర - రజోగుణము, ఈ - ఈశ్వర (సంపూర్ణ నియంత్రణ, శక్తి)". ఇది పురుషులలో ఇండదు).** మానవులు చేతులు, కాళ్ళతో చేసిన పాపములకు తదుపరి జన్మలో కదలికలులేని మొక్కల, చెట్ల జన్మ పొందుతారు. నోటి మాటలతో చేసిన పాపములకు తదుపరి జన్మలో మాట్లాడలేని మృగముల, జంతువుల, పక్షుల

జన్మ పొందుతారు. మనస్సుతో చేసిన పాపములకు తదుపరి జన్మలో అత్యంత నీచమైన, అల్పమైన జన్మ పొందుతారు.

## పరాశర స్మృతి

బ్రహ్మరిషి వసిష్ఠ కుమారుడు శక్తి ముని. శక్తి ముని కుమారుడు మహర్షి పరాశర. మహర్షి పరాశర కుమారుడు భగవాన్ వేద వ్యాసుడు. ప్రస్తుతము జరుగుతున్న కలియుగమునకు పరాశరస్మృతి వర్తిస్తుంది. పరాశరస్మృతిలో కలియుగములో సామాన్య ప్రజల జీవితములో సామర్థ్యాన్ని పెంచి అభివృద్ధి పొందుటకు జీవితము యొక్క అన్ని సిద్ధాంతములను వివరించినారు. కలియుగములో ప్రాంతము, ధర్మము మరియు సమాజము భేదములేకుండా, వైరుధ్యాలు అత్యంత శక్తివంతము అవుతాయి. కలియుగములో సామాన్య ప్రజల జీవితములో ఆధ్యాత్మికత విలువలు తక్కువై అరాచకములు ఎక్కువ అవుతాయి. అందుచే ముందు యుగాములకంటె కలియుగములో ఆధ్యాత్మికతకు ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వవలసిన అవసరముఎంతో ఉన్నది. పరాశర స్మృతిలో 12 ఆధ్యాయములు ఉన్నవి.

- ❖ అధ్యాయము 1: వివిధ ఆశ్రమముల (జీవిత దశలు), వివిధ వర్ణముల (కులములు) ప్రజల విధులు, భాద్యతలు, అతిథి సత్కారములు మరియు దాలముల వివరములు ఉన్నవి.
- ❖ అధ్యాయము 2: వివాహముతో పురుషునకు, స్త్రీకి వారి ఇద్దరి జీవితములకు పరిపూర్ణత లభిస్తుంది. వైవాహిక జీవిత నియమములు జనాభా పెరుదలను దృష్టిలో

ఉంచుకొని వ్యవసాయ అభివృద్ధికి ఎక్కు ప్రాధాన్యత ఇవ్వబడినది.

- ❖ అధ్యాయము 4: భార్య, భర్త భాద్యతలు, విధులు, పాప కర్మల ఫలితములు వాటికి ప్రాయశ్చిత్తముల వివరములు ఉన్నవి.
- ❖ అధ్యాయము 10: ఇతర స్త్రీలతో లేక పురుషులతో అక్రమ సంబంధాల వలన కలిగే పాపములు వాటికి శిక్షలు వివరములు ఉన్నవి.
- ❖ అధ్యాయము 12: ఆహారము, ధనార్జన నియమములు, న్యాయ వ్యవస్థ వివరములు ఉన్నవి.

## పురాణములు

పురాణము అనగా ఎల్లప్పుడూ కొత్తగా అనిపించే పురాతన లేదా చరిత్ర. పురాణములు వేదాంతముల తరువాత వచ్చినవి. పురాణములు ఐదవ వేదముగా పరిగణింపబడుతాయి (భాగవతము 3 : 12 : 39). పురాణములు, వేదముల మరియు వేదాంతముల (ఉపనిషత్తులు) ఆధ్యాత్మికత అంతరార్ధములను, సామాన్య ప్రజలు అర్ధము చేసుకోలేరని, చరిత్రలోని కధలలో నిగూఢముగా అంతర్గతముచేసి ప్రజలకు ఆసక్తికరముగా వినుటకు ఎర్పాటుచేసినవి (ఛాందోగ్యోప నిషత్ 7 : 1 : 4). భగవాన్ వేద వ్యాసుడు 18 పురాణములు వెల్లడించారు. వాటిలో కొన్ని అగ్ని, భాగవతము, బ్రహ్మ, బ్రహ్మాండ, (లలితా రహస్య సహస్ర నామములు ఉన్నవి), గరుడ, లింగ, మార్కండేయ (దుర్గాదేవి గురించి, దేవి మహాత్యముతో సహా), నారద, పద్మ, స్కాంద, వాయు, విష్ణు మొదలైనవి. పురాణముల జ్ఞానము లేకుండా కేవలము వేదముల జ్ఞానము అసంపూర్ణము (వాయు పురాణము

1 : 1 : 180). పురాణముల జ్ఞానముతో మానవుడు సంపూర్ణ జ్ఞానిగా పరిగణింపబడుతాడు (నారద పురాణము 1 : 92 : 21). నారాయణుడు (విష్ణుమూర్తి) పురాణపురుషుడు. పురాణములు ఆయని శరీరము యొక్క అవయవములు (పద్మ పురాణము, ఆది స్కందము - 828).

**శ్రీమద్ భాగవత మహాపురాణము:** శ్రీమద్ భాగవత మహాపురాణము వేదములత సమానముగా భక్తి, జ్ఞానము మరియు వైరాగ్యము స్థిరీకరణ కోసము భగవాన్ వేద వ్యాసుడు ద్వారా వెల్లడింపబడినది. ఇది వేదముల, ఉపనిషత్తుల సారము నుండి ఉద్భవించినది. శ్రీమద్ భాగవతము మహాపురాణము చదువుట ఒక జ్ఞాన యజ్ఞము (భాగవత మహాత్మ్యము (పద్మ పురాణము నుండి సంగ్రహించిన) అంశముపై విస్తృత వివరణ 2 : 60, 67, 71). జ్ఞానము మరియు వైరాగ్యము యొక్క తల్లి భక్తి (భాగవత మహాత్మ్యము (పద్మ పురాణము నుండి సంగ్రహించిన) విస్తృత వివరణ 1 : 45). శ్రీకృష్ణ భగవానుడు ఆయన సర్వ శక్తి, కీర్తి, ప్రకాశము, ప్రాభవము భాగవతములో నింపి సముద్రములో అదృశ్యమైనారు (భాగవత మహాత్మ్యము (పద్మ పురాణము నుండి సంగ్రహించిన) విస్తృత వివరణ 3 : 61). భాగవతము 12 స్కందములుగా (పుస్తకములు) విభజించబడినది. దీనిలో 18,000 శ్లోకములు ఉన్నవి. భాగవతము, వేదము యొక్క కోరికలను ఇచ్చే చెట్టు యొక్క పండు (సారాంశము), పరమహంస సుఖదేవ (భగవాన్ వేద వ్యాసుని కుమారుడు) మహారాజు పరీక్షిత్తుడు (అర్జునుని మనుమడు, అభిమన్యుని కుమారుడు) నకు 7 రోజులలో బోధిస్తారు. "**నేను నా భక్తుల సేవకుడను. నా ప్రియభక్తులు ఆరాధనాభావతో నా హృదయమును సంపూర్ణముగా దోచుకొనబడ్డ వాడనయి, నేను**

**స్వతంత్రుడనుకాను, వారి భక్తి ఆధీనములో ఉంటాను"** (భాగవతము 9 : 4 : 63). **"నా భక్తులు, నాదేవేరి (సతీమణి) లక్ష్మిదేవి, నా కుమారుడు బ్రహ్మ, నా స్వంత అన్నగారు బలరాముడు, నా ఆత్మ (శివడు), నా స్వంత దైవవ్యక్తిత్వము కంటే ప్రియమైనవారు"** (భాగవతము 11 : 14 : 15). **"నా భక్తుల పాదముల ధూళితో పరిశుద్ధము అగుటకు, నేను నా భక్తులను అనుసరిస్తాను"** (భాగవతము 11 : 14 : 16).

**ఉప పురాణములు:** 18 ఉప పురాణములు ఉన్నవి. వాటిలో కొన్ని ఆది పురాణము, భాస్కర, దుర్వాస, కపిల, నారద, నరసింహ, పరాశర, శివధర్మము, వామన, వరుణ మొదలైనవి.

**ఔప పురాణములు:** 18 ఔప పురాణములు ఉన్నవి. వాటిలో కొన్ని ఆదిత్య, భార్గవ, దేవీభాగవతము, సనత్కుమార, వసిష్ట మొదలైనవి.

## మహాకావ్యములు

మహాకావ్యములను ఇతిహాసములు అని పిలుస్తారు. **ఇతిహాసము అనగా చరిత్ర సత్యములు, "ఈ విధముగా జరిగినది" అని అర్థము**. ఇవి ప్రధానముగా రామాయణము (రాముడు (జీవిత) ప్రయాణము), మహాభారతము (భరత రాజవంశము యొక్క గొప్ప కథ) అని అర్థము. మరియు మహాకావ్యములు (గొప్ప సాహిత్యము) ఉన్నవి. వాస్తవానికి సుమారు 1,81,00,000 సంవత్సరముల క్రితము మహర్షి వాల్మీకి రామాయణము వ్రాశారు. మహాభారతము, (శ్రీమద్ భగవద్గీతతో పాటు) భగవాన్ వేద వ్యాసుడు చెప్పుతుండగా విఘ్నేశ్వరుడు వ్రాశారు. వీటిలో హిందూ ధర్మము యొక్క

ఆధ్యాత్మిక బోధనలు, విశ్వవ్యాప్త సత్యములు, చారిత్రక సంఘటనలు మరియు అనేక మహా రాజులు, రాక్షసులు, ఋషులు, దేవతలు యొక్క వాస్తవ కథలు ఉపయోగించి వేదాంత సూత్రములు వివరిస్తాయి.

## రామాయణము

రామాయణము అనగా రాముడు యొక్క జీవిత ప్రయాణము. మహర్షి వాల్మీకి, ఆయని జీవితము యొక్క మొదటి భాగములో, ప్రాచేతసుడు అనే పేరుగల విద్యాభ్యాసము లేని అనాగరికమైన అటవీ బందిపోటు దొంగ. ఆయన తన భార్య, పిల్లలను పోషించుటకు అడవిలో ప్రయాణికులను దోచుకునేవారు. ఒక రోజున దేవఋషి నారదుడు ఆ అడవిలో ప్రయాణిస్తున్నప్పుడు ప్రాచేతసుడు దేవఋషి నారదుడను దాడి చేసినాడు. అప్పుడు నారదుడు, ప్రాచేతసుడను "నీవు ఎందుకు దొంగతనము చేస్తున్నావు?" అని అడిగారు. ప్రాచేతసుడు "నా కుటుంబమును పోషించుకునేందుకు" అని జవాబిచ్చాడు. దేవఋషి నారదుడు "నీవు ఒక వ్యక్తిని దోచుకుంటే, నీకు పాపము వస్తుంది. నీ కుటుంబ సభ్యులు నీవు దోచుకున్నవి పంచుకున్నట్లుగా, నీ పాపములనుకూడా పంచుకుంటారా?" అని అడిగారు. ప్రాచేతసుడు తప్పకుండా" అని జవాబిచ్చాడు. అప్పుడు దేవఋషి "నీవు, నన్ను ఒక చెట్టుకు కట్టి, ఇంటికి వెళ్లి నీ కుటుంబ సభ్యులను అడుగు" అన్నారు. దానికి ప్రాచేతసుడు అంగీకరించి, దేవఋషిని చెట్టుకు కట్టి, ఇంటికి వెళ్లి, తన కుటుంబ సభ్యులను, భార్యతో సహా, అందరినీ "నేను తెచ్చిన ధనమును మీరు పంచుకున్నట్లుగా, నా పాపములను కూడా పంచుకుంటారా?"

అని అడిగాడు. అందుకు అందరూ "నీకు మమ్ములను పోషించవలసిన బాధ్యత ఉంది. కానీ నీ పాపములతో మాకు ఎటువంటి సంబంధమూ లేదు" అని అన్నారు. ప్రాచేతసుడకు తన జీవితములో మొదటి సారి, దొంగ జీవితమునకు బాధపడ్డాడు. అతను దేవఋషి నారదుని దగ్గరకు పరుగెత్తుకు వెళ్లి క్షమించమని అర్థించారు. అతని పాపములు పవిత్రమగుటకు దేవ ఋషి నారదుడు, "రామ" అనే పవిత్ర మంత్రమును ప్రాచేతసుడతువంటి పాపునకు ఉపదేశించకూడదు కాబట్టి, “మ-రా” గా తారుమారు చేసి, ప్రాచేతసుడకు బోధించి ధ్యానము చేయమని చెప్పారు. మ-రా పదము స్వయంచాలకముగా "రామ" గా మారుతుంది. ప్రాచేతసుడు రామ ధ్యానములో లీనమై అనేక సంవత్సరములు తపస్సు చేశారు. చీమలు ఆయన చుట్టూ పుట్టలు పెట్టినవి. అనేక సంవత్సరముల తరువాత, ఆకాశవాణి అతనిని వాల్మీకి (పుట్ట నుండి జన్మించిన) పిలుస్తూ నీ తపస్సు పరిపూర్ణమైనది. నీకు జ్ఞానోదయము అయినది. ధ్యానము నుండి లెమ్ము అని పలికినది. మహర్షి వాల్మీకి ఒకనాడు అడవిలో వెళ్ళుచుండగా రెండు పావురముల (క్రౌంచ) ప్రేమజంటను చూస్తూ ఉండగా, ఒక బాణము అతని ప్రక్కనుండి పోయి ఆ పావురముల జంటలోని పురుష పావురమునకు తగిలింది. ఆ పావురము క్రిందపడి మరణించగా ఆడ పావురము, ఆ పురుష పావురము చుట్టూ కిచకిచ అంటూ తిరుగుతుండగా మహర్షి వాల్మీకి అది చూచి బాధతో, ఆ బాణము వేసిన వేటకారుని కోపముతో "దుష్టుడా" అని అన్నారు. దానికి మహర్షి వాల్మీకి, తను కోపము తెచ్చుకోకూడదు, అశబ్దములు పలుకకూడదు అని విచారించుచుండగా, పరమపిత బ్రహ్మ ప్రత్యక్షమై మహర్షి వాల్మీకితో "నీవు ఇప్పుడు పరిపూర్ణమైనావు. నీవు విష్ణు అవతారము అయిన శ్రీరామ చరిత్ర

రచనకు అర్హుడవు. నీవు శ్రీరామ చరిత్ర వ్రాయుము" అని చెప్పి మహర్షి వాల్మీకికి దివ్యశక్తులను ప్రసాదించినారు. పరమపిత బ్రహ్మ దీవెనలతో, మహర్షి వాల్మీకి, దివ్యదృష్టితో "రామాయణము" పవిత్ర గ్రంధమును రచించినారు. రామాయణము, రాముడు (విష్ణుమూర్తి అవతారము) మరియు ఆయని భార్య సీతాదేవి (లక్ష్మీదేవి అవతారము) యొక్క (ఇతిహాసము లేదా చరిత్ర). రామాయణములో 24,000 శ్లోకములు ఉన్నవి. రామాయణము అధర్మము మీద ధర్మము యొక్క పోరాటము. శ్రీరాముడు మానవుడిగా ధర్మమును పాటిస్తూ (రాముడే ధర్మము, ధర్మమే రాముడు) ధర్మమూర్తిగా, పురుషోత్తముడు (మానవులలో ఉత్తముడు), ఆదర్శవంతమైన కుమారుడిగా, సోదరుడిగా, ఏకపత్నివ్రతుడిగా, హిందూ ధర్మ ఆదర్శములను పాటిస్తూ, 11,000 సంవత్సరములు రాజ్యమును పాలించి రామరాజ్యము (ప్రజలందరూ సుఖసంతోషములతో, ప్రజలకు ఆదర్శమైన పాలకుడిగా) స్థాపించినారు. సీతాదేవి సంపూర్ణమైన, ఆదర్శవంతమైన, విశ్వాసపాత్రమైన పత్నిగా రాముని వెంట ప్రేరనాశక్తి అయి స్త్రీలకు ఆదర్శమైనది. భరతుడు, లక్ష్మణుడు, శత్రుఘ్నుడు ఆదర్శవంతమైన సోదరులుగా; హనుమంతుడు ఆదర్శవంతమైన భక్తునిగా వ్యవహరించారు. అందుచేతనే రామాయణము ఇన్ని సంవత్సరములైనా హిందువులందరకూ ఆదర్శవంతమైన చరిత్రగా స్థిరపడినది. అందుచేతనే భారతదేశములో సీతారాముల గుడి లేని ఊరుండదు. "శ్రీరామ రామ రామేతి రమే రామే మనోరమే, సహస్రనామ తత్తుల్యం రామనామ వరాననే" (అనగా శ్రీరామ శ్రీరామ శ్రీరామ అనే పవిత్ర మహామంత్రాన్ని మూడుసార్లు ధ్యానిస్తే మనస్సు రమిస్తుంది. శివ, విష్ణు సహస్రనామములు ధ్యానిన్చినంత ఫలములు రామనామము ఇస్తుంది).

## మహాభారతము

మహాభారతము భరత రాజవంశము యొక్క మహా ఇతిహాసము భగవాన్ వేద వ్యాసుడు వెల్లడించాడు. ఇది 18 పర్వములలో 1,07,000 శ్లోకములతో అతిపెద్ద ఇతిహాసము. పవిత్రమైన వేదములను దగజారిన బ్రాహ్మణులు, స్త్రీలు, క్షత్రియులు, వైశ్యులు మరియు శూద్రులు వినుటకు అర్హత లేనందున, వారుకూడా మహాభారతము ద్వారా బ్రహ్మానంద స్థితి పొందుటకు ఈ గ్రంధమును వ్రాశారు (భాగవతము 1 : 4 : 25) మహాభారతము అధర్మము మీద ధర్మము యొక్క పోరాటము. దీనిలో శ్రీమద్ భగవద్గీత (పరమాత్మని పాట), విష్ణు సహస్రనామములు కూడా ఉన్నవి. మహాభారతము ఐదవ వేదముగా భావించబడుతుంది. శాంతి పర్వములో, మహాభారతము యుద్ధము తర్వాత, శ్రీకృష్ణుడుతో సహా పాండవులు ఓఘవతి నది వద్ద అంపశయ్యపై (బాణముల యొక్క మంచము) మృత్యువు కోసము వేచిఉన్న భీష్ముడు (ధర్మమునకు ప్రతీక) దగ్గరకు వెళ్లినప్పుడు, భీష్ముడు శ్రీకృష్ణుని భక్తితో విష్ణు సహస్రనామములతో స్తుతిస్తారు. తరువాత శ్రీకృష్ణుడు యుధిష్టరునితో చెప్పగా, యుధిష్టరుడు భీష్ముని, ధర్మము, జ్ఞానము బోధించమని ప్రార్ధిస్తారు. భీష్ముడు, యుధిష్టరునకు వివిధ ధర్మములు (వర్ణ, ఆశ్రమమ ధర్మములు), రెండు విధముల ధర్మములు - (ఎ) ప్రవృత్తి మార్గము - ప్రపంచ అనుబంధముతో, ప్రాపంచిక కార్యకలాపాలలో ఉన్నవారి ధర్మములు, (బి) నివృత్తి మార్గము - ప్రపంచిక అనుబంధములను ఉపసంహరించుకొన్న వారి ధర్మములు, రాజ్యపాలకుల విధ్యుక్తమైన ధర్మములు, స్త్రీల ధర్మములు, పురుషార్ధములు మొదలైనవి బోధించారు. (భాగవతము 1 : 9 : 26, 27, 28) వీటిలో కొన్ని అంశములు క్రింద

వివరించబడినవి:

- ❖ కలి యుగములో ధర్మము, అధర్మముగానూ మరియు ధర్మము, ధర్మముగానూ వ్యవహరిస్తుంది.
- ❖ ధర్మముగా ఉన్నవారితో, ధర్మముగానే ఉండవలెను.
- ❖ వంచనను, వంచనతోనే ఎదుర్కొనవలెను.
- ❖ చెడును, మంచితనముతో జయించవలెను.
- ❖ చేడుమార్గములతో విజము కంటే, ధర్మము కోసము మరణమే ఉత్తమము.
- ❖ అదృష్టము మీద ఆధారపడకుండా, మానవ ప్రయత్నము చేయవలెను.
- ❖ సత్యము మరియు నిజాయతి విజయమునకు మార్గములు.
- ❖ ఇతరులకు త్రికరణ శుద్ధిగా (ఆలోచన, మాట మరియు చేతలు) ద్వారా మంచినే చేయవలెను.
- ❖ స్వంత ఆనందములను త్యాగము చేయవలెను.
- ❖ నేను, నాది ని అర్ధము చేసుకొనవలెను.
- ❖ కోరికలను, శారీరకవాంఛలను, కోపమును నియంత్రించవలెను.
- ❖ బాధ్యతలను స్వీకరించవలెను.
- ❖ నీపట్ల ఇతరులు ఎలా ప్రవర్తించాలని అనుకుంటావో, నీవుకూడా ఇతరులపట్ల అలా ప్రవర్తించవలెను.
- ❖ దురాశ పాపములకు మూల కారణము. స్వీయ నియంత్రణతో, దురాశను నాశనము చేయవలెను.
- ❖ మోహోద్రేకములు, ద్వేషము, విచారము, కోపము, హంకారము, మహామాయ, భ్రమ, సోమరితనము మరియు అసూయ అజ్ఞానమునకు కారణము.
- ❖ ఓర్పు, ధైర్యము, అహింస, నిజాయతి, ప్రశాంతత, ఆప్యాయత,

మనస్సు స్థిరత్వము, దయ స్వీయ నియంత్రణను స్థాపించును.

❖ సత్యము శాశ్వతమైన పరమాత్ముడు. యథార్థ్యము, నిజాయతి శాశ్వతమైన ధర్మము.

❖ కోరికలు తీర్చుకొని పొందిన ఆనందము కొంటె, ఇంద్రియ నిగ్రహణ లేదా కోరికలను త్యజించుట ద్వారా పొందిన ఆనందము 16 రెట్లు అధికము.

❖ వేదముల రహస్యము "**సత్యము యొక్క సత్యము, స్వీయ నియంత్రణ యొక్క స్వీయ నియంత్రణ మరియు అన్ని బానిసత్వము నుండి విముక్తి**". ఇది హిందూ ధర్మ పవిత్ర గ్రంధములు యొక్క సారంశము.

❖ పేదలకు దానధర్మములు చేయుట కీర్తికి మార్గము. యథార్థ్యము, నిజాయతి స్వర్గమునకు మార్గము. మంచి ప్రవర్తన ఆనందము మరియు తృప్తికి మార్గము.

❖ దయ మరియు కరుణ శ్రేష్టమైన సద్గుణములు.

❖ ఇతరులకు హాని చేయకుము.

❖ పరమాత్ముని భక్తి, శ్రద్ధలతో అరాధించవలెను.

## శ్రీమద్ భగవద్గీత

శ్రీమద్ భగవద్గీతలో వేదముల, ఉపనిషత్తుల సారంశము ఉన్నది. భగవద్గీతలో బ్రహ్మవిద్య ఉన్నందున ఉపనిషత్తుల స్థానములో పరిగణిస్తారు. భగవానుడు శ్రీకృష్ణుడు, విష్ణుమూర్తి యొక్క పరిపూర్ణ, సర్వశ్రేష్టమైన అవతారము. అపరిమిత సద్గుణములు, మానవ రూపములో అంతిమ పరమాత్ముడుగా (సగుణ బ్రహ్మ) భావించబడుతారు (భాగవతము 1 : 3 : 28). ఆయన యోగములకు రాజు, గురువు. నాశనములేని ఈ యోగ

శాస్త్రమైన భగవద్గీతను భగవంతుడు మొదట సూర్యదేవునకు ఉపదేసించినారు. సూర్యదేవుడు దానిని మనువునకు, మనువు ఇక్ష్వాకు రాజునకు విశదీకరించెననియు, ఆ విధముగా పరంపరముగా ఈ యోగశాస్త్రము ఒకవ్యక్తి నుండి మరొక వ్యక్తికి అందింపబడినది. కాని కాలక్రమున ఈ పరంపర భగ్నమైనది. నీవు నా భక్తుడవు, మిత్రుడవు. ఈ పురాతన శాస్త్రము యొక్క ఉత్తమ రహస్యమును ఇప్పుడు నీకు చెప్పుచున్నాను అని శ్రీకృష్ణ భగవానుడు అర్జునునకు చెప్పినారు (4 : 1, 2, 3). భగవద్గీత లక్ష్యము మోహమును, అజ్ఞానమును, భ్రాంతిని నశింపచేయుట (18 : 72, 73). దీనిలో 18 అధ్యాయములు 18 యోగములతో 700 శ్లోకములలో శ్రీకృష్ణ భగవానుడు అర్జునునకు, మహాభారతయుద్ధ ప్రారంభమునకు ముందు, ఉపదేశించినారు. భగవద్గీత మానవజాతి అందరకు వర్తిస్తుంది. దీనులో ప్రతి సమస్యకు పరిష్కారమార్గము ఉన్నది. ప్రతి విషయమునకు అనుకూల ప్రతికూల అంశములు వివరించి, చివరికి నిర్ణయము వ్యక్తికి వదలిపెడుతుంది (18 : 63). శ్రీకృష్ణుడు అనేక శ్లోకములలో మోక్షము (భగవంతునిలో లీనమవుట) పొందుటకు మార్గములు సూచిస్తూ, అభయమిస్తూ, వాగ్దానము కూడా చేస్తారు (11 : 54, 55; 12 : 3, 4, 8; 13 : 30, 34; 16 : 22; 18 : 53, 56, 65, 68). నేను ప్రతి వ్యక్తి హృదయమునందును ఉందును. నానుండియే స్మృతియు, జ్ఞానమును, మరపును కల్గును. అన్ని వేదములచేతను నేనే తెలియదగినవాడను. వేదములు తెలిసినవాడను, వేదాంతములు కూర్చినవాడను నేనే (15 : 15). నీవు సర్వదా నన్ను స్మరించుచూ నీ విధ్యుక్త ధర్మములు (యుద్ధము) నిర్వర్తించుము. నీ విషయములనింటిని నాకే అర్పించుము. నీ మనస్సును, బుద్ధిని నాయందే స్థిరముగా నుంచిన యడల నీవు నిస్సందేహముగా నన్ను పొందుదువు

(8 : 7, 8; 9 : 34). భగవద్గీత, మొదటి అధ్యాయములో (అర్జున విషాద యోగము) మొదటి శ్లోకములో ధృతరాష్ట్రుడు అజ్ఞానముతో "మామకాః" (నావాళ్ళు, కౌరవులు మాత్రమే) మోహము (1 : 1), తరువాత అర్జునుడు కూడా అజ్ఞానముతో "మమ" (నా యొక్క బంధువులు) మోహముతో (1 : 27, 28) క్షత్రియుడిగా తన స్వధర్మము (యుద్ధము చేయుట) నిరాకరణతో ప్రారంభముయి, చివరి 18 వ అధ్యాయములో (మోక్షసన్న్యాస యోగము) శ్రీకృష్ణ భగవానుడు బోధనతో ఈ అశాశ్వతమైన ప్రపంచపు సత్యమును గ్రహించి శాశ్వతమైన జ్ఞానము కలిగి (వైరాగ్యము కలిగి), మోహము పోయి, తన స్వధర్మము (యుద్ధము చేయుట) పాటించుటకు సంసిద్ధుడైనాడు (18 : 73). భగవద్గీతలో ప్రతి అక్షరము, పదము, శ్లోకము అత్యంత విలువైనవి. కాని ఈ పుస్తకము సంక్షిప్తముగా వ్రాయుటవలన భగవద్గీత పూర్తిగా వివరించలేనందుకు చింతిస్తూ, కొన్ని అద్యాయములలోని కొన్ని శ్లోకములను మాత్రమే వివరించబడినవి.

## ద్వితీయాధ్యాయము (సాంఖ్య లేదా జ్ఞాన యోగము):

- నీవు దుఃఖింపదగని విషయమును గూర్చి దుఃఖించుచున్నావు. వివేకము గలవారు జీవించిఉన్నవారి గూర్చిగాని, మరణించినవారి గూర్చిగాని శోకింపరు (11). నేను, నీవు, అందరూ ఉండని సమయము లేదు, ఇకముందు అంతమగుట కూడా లేదు (12). ఈ దేహము యొక్క బాల్యము, యౌవనము, ముసలితనము ఈ దేహములో నున్న జీవాత్మకు ఆరోపించినట్లు, అట్లే ఈ దేహాంతము (మరణము) తరువాత జీవాత్మ ఇంకొక దేహమును పొందును. అట్టి మార్పులకు

ధీరులు (వివేకులు) ఎప్పుడూ మోహము చెందరు (13).

- జీవాత్మకెప్పుడునూ జననములేదు, మరణములేదు, ఒకప్పుడుండి మరియొక్కప్పుడు లేకపోదు. అది అజనితము, నిత్యము, శాశ్వతము, పురాతనము. దేహము చంపబడిననూ అది చంపబడదు (20). మానవుడు వాడుకచేత చెడిపోయిన దుస్తులను విడిచి, క్రొత్తదుస్తులను ధరించునట్లు, జీవాత్మ, ముదిమిచే నిష్ప్రయోజనమైన దేహమును, విడిచి నూతన దేహమును పొందును (22). జీవాత్మను ఆయుధములు ఖండింపజాలవు, అగ్ని దహింపజాలదు, నీరు తడుపజాలదు, వాయువు ఎండింపజాలదు. జీవాత్మ నిత్యమైనది, శాశ్వతమైనది, సర్వవ్యాపకమైనది, కదిలించరానిది, స్థిరమైనది, శాశ్వతమైనది (23, 24).
- నీవు (క్షత్రియుడుగా) నీ స్వధర్మమును (ధర్మమైన యుద్ధము చేయుట) నిర్వహించనిచో, నీ స్వధర్మమును వీడినవాడిగా నీ కీర్తిని కోల్పోయి, పాపమును కూడా పొందుదువు (33). సుఖదుఃఖములను, లాభనష్టములను జయాపజయములను సమముగా భావించి, యుద్ధము కొరకే నీవు యుద్ధము చేయుము. అట్లు చేయుటచే నీకెప్పుడునూ పాపము కలుగదు (38). కర్మలు (వేదములచే నిర్ణయింపబడిన వర్ణ, ఆశ్రమమ సత్కర్మలు) చేయుటకే నీకు అధికారము కలదు. ఆ కర్మల ఫలితములపై నీకెట్టి అధికారము లేదు. నీవు కర్మఫలములకు కారణము అని ఎప్పుడునూ భావించకుము. కర్మలు చేయకుండుటకు ఆసక్తుడవు కాకుము (47).
- సమభావముతో ఈ జీవితములో మంచి, చెడు రెండింటి కర్మ ఫలములను వదలిపెట్టి, యోగాభ్యాసము (భగవంతునితో సంయోగము) చేయుము. యోగామనగా కర్మయందలి నేర్పు (50). వివేకులు సమత్వమనస్సుతో కర్మఫలములను

- ❖ త్యజించి, జన్మ బంధములనుండి విముక్తులయి, అత్యంత పరమానంద స్థితిని పొందుదురు (51). ఎప్పుడైతే మనస్సులో కల్పించబడిన కోరికలను విడుచునో, ఆత్మ, ఆత్మతోనే తృప్తి పొందునో అప్పుడు అతడు స్థితప్రజ్ఞుడని (ఉత్తమస్థితి) చెప్పబడును (55). ఎవడు మంచికు, చెడ్డకు ఆసక్తిరహితురడై; ఆనందము, ద్వేషము లేనివాడై ఉంటాడో అతను జ్ఞానమందు స్థిరమైయుండును (57).
- ❖ రాగద్వేషములు లేనివాడు, విషయములపై ఇంద్రియములను నిగ్రహించుకున్నవాడు, మనస్సును వశపరచుకున్నవాడు భగవంతుని అనుగ్రహము పొందును (64). అన్ని కోరికలను విడిచి, నిరపేక్షుకుడై, మోహము, అహంకారములేనివాడు శాంతిని పొందును (71).

## తృతీయాధ్యాయము (కర్మ యోగము):

- ❖ రెండు విధములైన ఆధ్యాత్మిక సాధనలు ఉన్నవి. (ఎ) సాంఖ్య లేదా జ్ఞాన యోగము, (బి) కర్మ యోగము (3). ప్రకృతి గుణముల కారణములవలన, ఎవ్వరునూ ఒక్కక్షణముకూడా ఏకర్మ చేయకుండా ఉండలేరు (5). ఎవరైతే కర్మ మరియు జ్ఞాన ఇంద్రియములను ధృడ నిశ్చయముతో మనస్సుచే నియంత్రించి, ఆసక్తిలేకుండా కర్మయోగము చేస్తారో వారు విశిష్టమైనవారు. నియమింపబడిన నీ కర్మలు చేయుట, అసలు కర్మలు చేయకపోవుటకంటె ఉత్తమము (7). కర్మలు చేయకుండా శరీరమును పోషించకోనజాలవు. మానవులు వారు చేసే కర్మలు ఆసక్తరహితమై, ఫలాపేక్ష లేకుండా భగవంతునికి అర్పితభావముతో (యజ్ఞము) చేయనిచో ఆ కర్మలు బంధకారణమగును. నీకు విధింపబడిన కర్మలు

ఆసక్తిలేనివాడవై, అర్పితభావముతో చక్కగా చేయుము (8, 9).

- మానవులు చేసే ఈ యజ్ఞములచే దేవతలు సంతృప్తిపడి, మానవులకు తృప్తి కలిగింతురు. ఈ విధముగా మానవ, దేవతలు పరస్పర సహకారమువలన అందరికి సౌఖ్య సంపదలు కలుగును (11). కాని దేవతలిచ్చు వస్తువులను వారికీయకుండా అనుభవించువారు నిజముగా దొంగలే అగును (12). భక్తులు యజ్ఞమున అర్పింపబడిన ఆహారశేషమును భుజింతురు. కావున సర్వ పాపములనుండి విముక్తి పొందుదురు. తమ స్వానుభవము కొరకే ఆహారము తయారు చేసుకొనువారు పాపమునే భుజింతురు. క్రమబద్ధములైన కర్మలన్నియూ వేదములచే విధింపబడినవి (13). వేదములు పరబ్రహ్మమునుండి వ్యక్తమైనవి. అందుచే సర్వవ్యాపకమైన బ్రహ్మము యజ్ఞకార్యములందు శాశ్వతముగా ప్రతిష్ఠింపబడినది (15). కాని మానవుడు అత్మయందే ఆనందము కలవాడై, అత్మయందే తృప్తిపొంది, అత్మయందే సంతుష్టుడైనవానికి కర్మయే లేదు (17).
- అహంకారము యొక్క ప్రభావముచే జీవాత్మ ప్రకృతి యొక్క గుణములచే చేయబడిన కర్మలకు తానే కర్తనని భావించును (27). పరమ సత్యమును తెలిసిన వ్యక్తి, గుణముల ప్రభావము, వాటి ప్రవృత్తిను ఎరిగినవాడై వాటిపై ఆసక్తుడు కాకుండును (28). తమ ధర్మములను నిర్వహించుచూ, అసూయారహితులై, ఈ ఉపదేశమును విశ్వాసముతో అనుసరించువారు కామ్యకర్మ బంధమునుండి విడువబడుదురు (31). ఇంద్రియములకు మరియు విషయములు, వస్తువులయందు మద్య రాగాద్వేషములు ఉన్నవి. అవి ముఖ్యమైన శత్రువులు. వాటి

వశము కాకూడదు (34). తమకు విధింపబడిన ధర్మములు అయోగ్యమైనను వానిని చేయుట, పరధర్మములను లెస్సగా చేయుటకంటె చాల మేలైనది (35).

❖ రజోగుణము వలన కామమే, కోపముగా పరిణమించును. ఇది సర్వమును మింగునట్టి, పాపముతో కూడిన గొప్ప శత్రువు (37). అగ్ని పొగచేతను, అద్దము దుమ్ముచేతను, గర్భముమావిచేతను ఆవరింపబడినట్లు, జీవుడుకూడా కామము యొక్క వివిధదశలచే ఆవరింపబడిఉండును (38). అది ఎప్పుడూ తృప్తిపొందకుండా అగ్నివలె మండుచుండును (39). ఇంద్రియములు, మనస్సు, బుద్ధి కామమునకు స్థావరములు. వీనిద్వారా కామము జీవుని యథార్థజ్ఞానమును కప్పిపుచ్చి అతనిని కలతపెట్టును (40). ఇంద్రియనిగ్రహముచే, ఈ కామమును నిగ్రహించి జ్ఞానమను ఆత్మానుభావమును నాశనముచేయు కామమును సంహరింపుము (41). ఇంద్రియములు ఉత్తమము, ఇంద్రియములకంటె మనస్సు ఉత్తమము, మనస్సుకంటె బుద్ధి ఉత్తమము, బుద్ధికంటె ఆత్మ ఉత్తమము (42).

## **చతుర్థాధ్యాయము (జ్ఞాన యోగము):**

❖ ఎప్పుడెప్పుడు ధర్మమునకు హానియు, అధర్మమునకు అభ్యుదయము కల్గునో అప్పుడప్పుడు నేనవతరించుదును (7). భక్తులను రక్షించుటకొఱకు, దుష్టులను శిక్షించుటకొఱకు, ధర్మమును స్థాపించుటకొఱకు ప్రతియుగము నేను స్వయముగా అవతరించుచుందును (8). మానవులు నన్ను యెట్లు శరణు ఆశ్రయించెదరో అట్లేవారికి ఫలములోసంగుదును (11).

- మానవుల గుణములు మరియు కర్మలు అనుసరించి నాలుగు విధముల వర్ణములు (బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు) నాచే సృష్టింపబడినవి (13).
- ఎవరైతే కర్మయందు ఆకర్మను, అకర్మయందు కర్మను చూచునో అట్టి మానవులు బుద్ధిమంతులు. అతడు అన్ని కర్మలు చేసే యోగి (18).
- ఎవరైతే కోరికలు లేకుండా, కర్మఫలితములపై ఆసక్తిలేకుండా, నిత్య సంతృప్తుడై యుండునో వారు అన్ని కర్మలు చేస్తున్నప్పటికీ కామ్యకర్మలు చేయనివారే (19, 20). మనస్సును, శరీరమును నిగ్రహించుకొని, ప్రాపంచిక విషయములను విడిచిపెట్టి, దేహమునకు ముఖ్యమైన కర్మలు చేయునతనుకు పాపఫలములు అంటవు (21). ఎవరైతే తనకు లభించినదానితో తృప్తిపొందునో, అసూయారహితుడు, ద్వందములకు (కష్టసుఖాలు, లాభనష్టములు, జయాపజయములు) అతీతుడో వారు కర్మలు చేయుచున్నప్పటికీ వాటిచే బద్ధుడుకారు (22). ఎవరైతే ఆసక్తిరహితుడై, దేహాత్మబంధములు లేనివాడై, కర్తృత్వభావరహితుడై, జ్ఞానావస్థలో ఉన్నవాడై, పరమాత్మునికి అర్పితభావముతో కర్మలను చేయువాని కర్మలు కరిగిపోవును (23).
- సృష్టి అంతా బ్రహ్మమయము. యజ్ఞములో అర్పణము (నెయ్యి పోసే గరిటె) బ్రహ్మ, హవిస్సు (నెయ్యి, అన్నము) బ్రహ్మ, అగ్ని బ్రహ్మ, హోమము చేయువాడు బ్రహ్మ, హోమము చేయు కార్యము బ్రహ్మ, హోమము అంతిమ లక్ష్యము బ్రహ్మ, చివరిగా హోమము బ్రహ్మములోనే లీనమగును (24). ఆత్మ సమర్పణ కూడా యజ్ఞము (25). బ్రహ్మ కొఱకు, తలచుకొని ఏ సత్కార్యము చేసినా అది

యజ్ఞము (28). ప్రాణాయామము యజ్ఞము (29, 30). యజ్ఞప్రసాదము అమృతములా అనుభవించే యోగులు బ్రహ్మమును చేరుదురు (31).

❖ వస్తువులను దానముచేసే యజ్ఞము కంటె, జ్ఞానయజ్ఞము గొప్పది (149).

❖ అన్ని యజ్ఞములు చివరకు జ్ఞానమునే చేరును (33). జ్ఞానము పొందిన పిదప, అజ్ఞానము నిన్ను మోసగించలేదు. ఆ జ్ఞానముతో సర్వసృష్టిని నీలోనూ, నాలోనూ చూడగలవు (35). అగ్ని అన్ని వస్తువులను బూడిద చేయునట్లు, జ్ఞానము అని కర్మలను నాశనముచేయును (37). అన్నిటినీ పరిశుద్ధము చేయునది జ్ఞానమే (38). కర్మఫలములను త్యజించినవాడు, దివ్యజ్ఞానముచే సందేహములను ఛేదించినవాడు, ఆత్మయందు స్థిరముగా నున్నవాడును (కర్మయోగిని) కర్మలు బంధించలేవు (41).

❖ యోగులు కర్మలు శరీరముతో, మనస్సుతో, బుద్ధితో, ఇంద్రియములతో, కర్మకర్తుత్వము విడిచి ఆత్మ సుద్ధికోసమే చేయుదురు (5 : 11). భగవంతుడు ఎవరియొక్క పుణ్యపాపములు గ్రహింపడు. జీవులకు, జ్ఞానమును అజ్ఞానముచే కప్పబడిఉండుటచే, మొహముచే కలతనొందుచుందురు (5 : 15). ఎవకైతే జ్ఞానముతో అజ్ఞానము నాశనము అయినదో, పగలు సర్వమునూ సూర్యుడు ప్రకాశింపచేయునట్లు, వారికి జ్ఞానము సర్వమును వ్యక్తము చేయును (5 : 16).

## షష్టాధ్యాయము (ధ్యాన యోగము)

❖ మనస్సును జయించిన వానికి మనస్సే ఉత్తమ మిత్రము. కాన

అట్లు చేయజాలనివానికి మనస్సు గొప్ప శత్రువు (6).

- మనస్సును జయించిన వాడు శాంతిని పొంది, పరమాత్ముని చేరినవాడే అగును. అట్టివానికి ద్వంద్వములు - శీతోష్ణములు, సుఖదుఃఖములు, మానావమానములు సమానములే (7). అధికముగా తినువానికి లేదా అస్సలు తినని వానికి, అధికముగా నిద్రించువానికి లేదా అస్సలు నిద్రించనివానికి యోగి అగుటకు అర్హత లేదు (16).
- మనస్సును పూర్తిగా నిగ్రహించుకున్న యోగి, పరిశుద్ధమైన (సూక్ష్మ) మనస్సుతో పరమాత్ముని అనుభవము కలిగి ఆత్మానందముతో ఉండును (20). ఎవరైతే నన్ను విశ్వమంతలోనూ, విశ్వమంతా నాలోనూ దర్శించునో, అతని దృష్టిలో నేను, నా దృష్టిలో అతను ఎల్లప్పుడూ దూరముకాము (30).
- అర్జునుడు "మనస్సు చెంచలమైనదినూ, కలతనొన్దించునదియూ, పట్టుదల కలదియూ, మిక్కిలి బలము కలదియూ అగుటచే, దానిని నిగ్రహించుట వాయువును నిగ్రహించుటకంటె కష్టతరము" (34). భగవానుడు శ్రీకృష్ణ "శాంతిరహితమయిన మనస్సును నిగ్రహించుట నిస్సందేహముగా మిక్కిలి కష్టము. కాని తగిన అభ్యాసము చేతను, వైరాగ్యముచేతను అది సాధ్యమగును" (35).
- యోగ భ్రష్టుడు పున్యలోకములలో భోగములు అనుభవించి, తరువాత దివ్యజ్ఞానుల లేక పవిత్రుల లేక సంపన్నుల కుటుంబములో జన్మించును (41). అట్టి జన్మ పొందిన తర్వాత అతడు పూర్వజన్మనకు సంబందించిన దివ్యచైతన్యమును పునరుద్ధరించుకొని సంపూర్ణ విజయము పొందుటకు అధికమైన అభివృద్ధికై మరల ప్రయతించును

(43). యోగి మునికంటెను, కామ్యకర్మలు చేయువానికంటెను మహాత్తరుడు. అందుచే అన్ని పరిస్థితుల యందును నీవు యోగివి కమ్ము (46).

## ద్వాదశాధ్యాయము (భక్తి యోగము)

- నా సగుణరూపముపై మనస్సును స్థిరీకరించి, నిరంతరమూ శ్రద్ధతో నన్ను పూజించుట యందు నిమగ్నులైనవారు అత్యంత పరిపూర్ణులని భావింపబడుదురు (2). అగోచరమైన నిరాకార బ్రహ్మయందు ఆసక్తితో కూడిన మనస్సు కలవారికి అభ్యుదయము చాలా క్లేశకరము (5).
- తమ కర్మల నన్నింటిని నాయందు విడిచి, అన్యచింతలేక నాయందలి భక్తియుక్త సేవలో నిమగ్నులగుచు, తమ మనస్సును నాయందే స్థిరీకరించి, నన్నే ఎల్లప్పుడూ ధ్యానించువారిని జనన మరణ సంసార సముద్రము నుండి త్వరలో రక్షింతును (6, 7).
- నీవు నీ మనస్సును నా మీద స్థిరముగా నిలుపలేకున్న, అప్పుడు నన్ను పొందుటకు యోగసాధన మరల, మరల చేయుము (9). అదికూడా నీవు చేయలేని యడల, నీ మనస్సును మెత్తబరుచుచూ కర్మఫలములను విడిచిపెట్టుము (11). అభ్యాసము కంటె జ్ఞానము, జ్ఞానము కంటె ధ్యానము, ధ్యానము కంటె కర్మఫల త్యాగము గొప్పవి. త్యాగాముచే మానవుడు మనస్సు శాంతి పొందును (12). ఏ భక్తులు పైన వివరించిన ధర్మామృతము ననుసరించుచు, శ్రద్ధతో నన్నే పరమ గమ్యముగా చేసికొని పూర్తిగా నాయందే నిమగ్నులై యుండెదరో వారు నాకత్యంత ప్రియులు (20).

## అష్టాదశాధ్యాయము (మోక్షసన్న్యాస యోగము)

- యజ్ఞ, దాన, తపః, కర్మలను విడువక తప్పక చేయవలెను (5) దేహవంతుడైనవాని కేవరికిని కర్మలనన్నింటిని విడచిపెట్టుట సాధ్యముకాదు. కాని కర్మఫలములను నెవడు విడుచునో అతడు నిజమైన త్యాగి (11).
- బ్రాహ్మణ (జ్ఞానము, శాంతి, సహనము, తపస్సు, ఆత్మనిగ్రహము, ధర్మ ప్రవర్తన), క్షత్రియ (శక్తి, శౌర్యము, ధైర్యము, నాయకత్వము, ధృడనిశ్చయము), వైశ్య (వ్యవసాయము, గోరక్షణ, వర్తకము), శూద్రుల (పరిశ్రమ, పరసేవ) విధులు ప్రకృతిపరమైన గుణములు, వారిచేసే కర్మలననుసరించి విభజింపబడుచున్నవి (41, 42, 43, 44).
- సర్వజీవుల మూలకారణమగు, సర్వవ్యాపకుడగు భగవంతుని స్వకర్మలను చేయుటద్వారా పూజించుటచే మానవుడు పరిపూర్ణత్వము పొందును (46). ఇతరుని వృత్తిని గ్రహించి దానిని సమగ్రముగా చేయుటకంటె, అసమగ్రముగా ప్రకృతి నిర్దిష్టమైన స్వీయవృత్తిని చేయుట మానవునికి మేలైనది (47).
- బుద్ధిచే పవిత్రీకృతుడై, ధృఢనిశ్చయముతో మనస్సును నిగ్రహించి, ఇంద్రియ తృప్తిని కలిగించు వస్తువులను విడిచి, రాగద్వేష విముక్తుడై, తక్కువ తినుచు, మనోవాక్కాయములను నిగ్రహించుచు, మిధ్య, బలము, అహంకారము, గర్వము, కోపము, మోహము, భౌధికవస్తువులపై ఆసక్తి విడిచి యుండువానికి బ్రహ్మైక్యతకు అర్హుడు (51, 52, 53). అన్ని కర్మలను చేయుచూ, నా శరణాగతి యందున్నవాడు, నా కృపతో శాశ్వతమైన, అనశ్వరమైన స్థితిని పొందును (56). ఎవరైతే కర్మలను మనస్పూర్తిగా

నాకువదిలి, సమానత్వభావముతో, నాయందే భక్తితో మనస్సును కేంద్రీకరించి ఉన్నవానికి కష్టములను అవలీలగా దాటగలడు (57).

- నేను నీకు మిక్కిలి రహస్యమైన జ్ఞానమును ఉపదేశించితిని. దీనిని పూర్తిగా పరిశీలించి నీ కిష్టమైనట్లు చేయుము (63).
- నీ మనస్సును నాకర్పించి, నాపై భక్తితో పూజించి, నాకు నమస్కరించిన, నీవు తప్పక నన్ను పొందుదువు. ఇది నీకు వాగ్దానము చేయుచున్నాను (65).
- నీ అన్ని ధర్మములు నాకు వదిలి, నన్ను శరణు కోరుము. నిన్ను అన్ని పాపములనుండి విడిపింతును. భయపడకుము (66).
- ఎవరైతే భక్తితో ఈ (భగవద్గీతలో నున్న) పరమ రహస్యమును నాభక్తులకు వివరిస్థారో, వారు నావద్దకు తప్పక వచ్చెదరు. దీనికి సందేహములేదు (68). మన ఈ పవిత్రమైన సంవాదమును అధ్యయనము చేయు వారు జ్ఞానయజ్ఞముతో నన్ను పూజించునని ప్రకటించుచున్నాను (70).



# దర్శన శాస్త్రములు

**"దర్శన"** అనగా చూచుట, తద్వారా అవగాహన చేసుకొనుట. ప్రధానముగా ఆరు దర్శన శాస్త్రములు ఉన్నవి. వీటి అన్నిటికీ వేదములు ఆధారములు. వేద సాహిత్యము అర్ధము చేసుకొనుట కష్టతరము. సామాన్య ప్రజలు హిందూ ధర్మమును సులభముగా అర్ధము చేసుకొనుటకు ఋషులు మరియు శాస్త్రవేత్తలు మూల గ్రంథములలోని సూత్రములను ఉపయోగించి దర్శన శాస్త్రములలో చాలా సంగ్రహముగా వివరించినారు.

## సాంఖ్య తత్వశాస్త్రము

హిందూ ధర్మము యొక్క అత్యంత పురాతనమైన సాంఖ్య తత్వశాస్త్రము భగవాన్ కపిల మహర్షి బోధించినారు. ఈ తత్వశాస్త్రము ద్వంద్వ స్వభావనమైనది. పురుష (పరమాత్ముడు), పురుష (ఆత్మ), ప్రకృతి (మహామాయ), సృష్టి యొక్క ప్రాథమిక సూత్రములను వివరిస్తుంది. ఈ తత్వశాస్త్రము ప్రకృతి (మహామాయ) నుండి పుట్టిన గుణముల ప్రభావముల నుండి విముక్తుడై అనంతమైన శాశ్వతమైన దైవ పరమానందము పొందుటకు అనేక మార్గములు వివరిస్తుంది. (భాగవతము పుస్తకము 3 ప్రవచనములు 24 నుండి 33 వరకు).

## యోగ శాస్త్రము

**"యోగ"** మూల పదము "యుజ్" అనగా పొందుట లేదా అనుసంధానము చేయుట లేదా కలుపుట. యోగ శాస్త్రము మహర్షి పతాంజలి వివరించినారు. ఇది సాంఖ్య విధానము

వంటిదే కాని ఆస్తికత ఉన్నది. ఈ విధానము ద్వైతము మీద ఆధారపడి ఉంటుంది (అనగా రెండు, విషయము మరియు వస్తువువంటి విశ్వము రెండుగా భావన). ఈ శాస్త్రము మనస్సును శుద్ధీకరణమునకు సాధన మరియు ఆచరణాత్మక ప్రక్రియ గురించి వివరిస్తుంది. 'రాజ యోగము' మరియు 'హత యోగము' ఈ యోగ శాస్త్రములో ముఖ్యమైన యోగములు.

## వైశేషిక శాస్త్రము

వైశేషిక అనగా విశేషముగా. వైశేషిక శాస్త్రము మహర్షి కనద వివరించినారు. ఈ శాస్త్రములోని సూత్రములు, సరిఅయినది లేదా తప్పును గుర్తించటమునకు తర్క విధానములను వివరిస్తుంది. ఈ విశ్వములో తొమ్మిది అంశములను (భూమి, నీరు, అగ్ని, వాయువు, శబ్దము, మనస్సు, జీవాత్మ, కాలము మరియు ఆకాశము) వివరిస్తుంది. పరమాత్ముడు ఈ అంశములలో చైతన్యము కలిగించే ప్రాథమిక శక్తిగా భావించబడుతుంది.

## న్యాయ శాస్త్రము

న్యాయ అనగా ధర్మ తర్కశాస్త్రము. న్యాయ శాస్త్రము, వైశేషిక శాస్త్రమును అనుసరించి ఉంటుంది. మహర్షి అక్షపద గౌతమ న్యాయశాస్త్రమును వివరించినారు. న్యాయసూత్రములు తార్కిక విశ్లేషణములు ప్రధానముగా ప్రపంచము మరియు నాస్తికవాద సంబంధమైన విషయములను వివరిస్తుంది. దీనిలో ప్రామాణికమైన జ్ఞానము పొందే విధానములు, తద్వారా బాధల నుండి విముక్తి పొందుటకు ఏకైక మార్గము అని వివరిస్తుంది. ఈ శాస్త్రము (ఎ జ్ఞానము, (బి) ఊహ్యాము,

(సి) పోలికలు మరియు (డి) జ్ఞానము యొక్క దృష్టాంతము, ప్రమాణము. సేకరించిన జ్ఞానము ప్రమాణముగా నిర్ణయించుటకు పలు విధానములు వివరించినది.

## పూర్వ మీమాంస శాస్త్రము

భగవాన్ వేద వ్యాసుని శిష్యుడు మహర్షి జైమిని, వేదముల కర్మ కంద (మూలము, కాండ) (జీవాత్మ ఆధ్యాత్మిక అభివృధి కొఱకు చేయవలసిన కర్మలు) యొక్క సరైన అవగాహనకు మరియు ఆచరణలకు, పూర్వమీమాంస శాస్త్రములో వివరించినారు. దీని లక్ష్యము జీవాత్మ అభ్యుదయము (ఉత్తమ పరిణామముతో) స్వర్గలోకము పొందుటకు వివిధ మార్గములు వివరించినారు. ఈ శాస్త్రము వేదముల జ్ఞాన కాండ (ఆత్మ, పరమాత్మ ఒక్కటే) తో వ్యతిరేకించదు.

## ఉత్తర మీమాంస (బ్రహ్మ సూత్రములు)

ఉత్తర మీమాంస (బ్రహ్మ సూత్రములు) అనగా వేదాంతము (వేదముల సాహిత్యము, ఉపనిషత్తులు యొక్క సారాంశము). భగవాన్ వేద వ్యాసుడు వ్రాసిన బ్రహ్మ సూత్రములు (4 అధ్యాయాలలో మొత్తము 555 సూత్రములు), వేదముల జ్ఞాన కంద (మూలము, కాండ), పరబ్రహ్మము (పరమాత్ముడు) సంపూర్ణ దివ్యత్వము, ఆత్మ (జీవాత్మ), ప్రకృతి (మహామాయ) తత్వములను వివరిస్తుంది. ఆత్మ నిజస్వరూపము యొక్క అజ్ఞానము కారణముతో అనంత జనన, మరణ, పునఃజన్మల చక్రములో జీవాత్మ బందింపబడి ఉన్నది. దీనిలో పరమాత్ముని అనంతమైన దివ్య సద్గుణములను వర్ణిస్తూ, జీవాత్మ పరమాత్మునికి ఆత్మ సమర్పణచేసి, ఆయన

కృపతో మహామాయ (దైవశక్తి) యొక్క బానిసత్వమునుండి విముక్తి పొంది, అనంత సంపూర్ణ దివ్య పరమానందము స్థితిని పొందుతుంది (1 : 1 : 7). అసంఖ్యాకములైన సూక్ష్మరూపములో, అణుమాత్రమైన జీవాత్మ, అపరిమితమైన పరమాత్మ యొక్క భాగము (అంశము) (భగవద్గీత 15 : 7). జీవాత్మ, పరమాత్ముని భాగము, అంశము అనగా (సంపూర్ణమైన పరమాత్ముడు భాగములు అవజాలడు) పరమాత్మునివలె, దివ్యమైన (పరమాత్ముడే) కాని పరమాత్మునికంటె భిన్నము కాదు. అనన్య, నిరంతర భక్తి యొక్క సంపూర్ణ ప్రాముఖ్యత వివరిస్తూ భక్తుడు, భక్తిద్వారా పరమాత్ముని సులభముగా తెలుసుకొని ఆయన కృప పొందవచ్చు (3 : 4 : 38). వేదాంతము నుండి క్రింది వివరించిన మూడు వేదాంత సిద్ధాంతములు (అర్థవివరణలు) ఏర్పడినవి:

- **అద్వైత వేదాంతము**

జగద్గురు ఆది శంకరాచార్యులు క్రీ. శ. 788 కేరళలో కలడిలో జన్మించారు. ఎనిమిది సంవత్సరముల వయసులో నాలుగు వేదములు అధ్యయనముచేసి, పన్నెండుము సంవత్సరముల వయసులో హిందూ ధర్మ పవిత్ర గ్రంధములలో పాండిత్యములో పొందినారు. ఆయన ఉత్తర భారతదేశము వెళ్లి (శ్రీ గౌడపాద గారి శిష్యుడు అయిన) శ్రీ గోవింద భగవత్పాద గారి శిష్యుడిగా ఉన్నారు. పదహారు సంవత్సరముల వయసులో ఆయన విస్తారముగా హిందూ ధర్మ పరమైన అనేక గ్రంధములు వ్రాసినారు. వాటిని క్రింద విధములుగా విభజించవచ్చు:

- **భాష్యములు:** పది ప్రధాన ఉపనిషత్తులు, బ్రహ్మ సూత్రములు మరియు భగవద్గీతపై విస్తారమైన వ్యాఖ్యానము మరియు వివరణలు.
- **ప్రకరణములు:** ఉపదేశ సహస్రి, వివేక చూడామణి, ఆత్మబోధ, తత్వబోధ, నిర్వాణషట్కము, పంచదశి మొదలైన సిద్ధాంత గ్రంథములు.
- **స్తోత్రములు:** శివానంద లహరి, సౌందర్య లహరి, ఆనంద లహరి, భజగోవిందం, కనక దుర్గ మొదలైన భక్తి స్తోత్రములు.

ఆయన నాలుగు శంకర మఠములు స్థాపించారు - జోషిమఠ్ (జ్యోతి పీఠము - అయ మాత్మా బ్రహ్మ - అథర్వాణ వేదము) (ఉత్తరాఖాండ్), ద్వారక (శక్తి - కాళిక పీఠము - తత్త్వమసి - సామవేదము) (గుజరాత్), జగన్నాథపురము (గోవర్ధన పీఠము - ప్రజ్ఞానం బ్రహ్మ - ఋగ్వేదము) (పూరి, ఒరిస్సా) మరియు శృంగేరీ (జ్ఞాన (శారద) పీఠము - అహం బ్రహ్మాస్మి - యజుర్వేదము) (కర్ణాటక). ఉపనిషత్తులు మరియు బ్రహ్మ సూత్రములు వ్యాఖ్యానముల ద్వారా ఆయన అద్వైత వేదాంతము స్థాపించారు.

- పరమాత్ముడు సత్యము, నిత్యము, వాస్తవము, సంపూర్ణము, ఒకేఒక్కడు, రెండుకానివాడు, రెండవది లేనివాడు (పరమార్ధిక సత్యము).
- ఎప్పటివరకూ జీవాత్మ (ఆత్మ), అవిద్య (అజ్ఞానము) కారణముగా ఆత్మ యొక్క ద్వైత్వాన్ని వంచించుకుంటూ, శరీరము, ఇంద్రియములు, మనస్సు మరియు ప్రపంచములతో తాదాత్మ్యము పొంది ఉంటుందో, అప్పటి వరకూ జీవాత్మ (ఆత్మ) మహామాయ బంధములో చిక్కుకొని,

ఆత్మ, పరమాత్మ వేరు వేరుగా భావిస్తూఉంటుంది.

- ❖ ఆత్మ, పరమాత్మే (మహా వాక్యములు - పేజీ సంఖ్యలు 104, 105, 106 చూడుము). పరమాత్మే, ఆత్మ అయినందున ఆయన విశ్వమంతటా వ్యాపించి, సకల జీవులలో ఉంటారు. మోక్ష మెల్లప్పుడూ ఆత్మ యందే ఉన్నది. జ్ఞానముచే, అజ్ఞానము తొలగిపోతే అదే మోక్షము. వేరే మోక్షము పొందేది ఏమీలేదు.
- ❖ పరబ్రహ్మము సత్ - చిత్ – ఆనంద స్వరూపుడు, మహామాయతో తయారైన ఇంద్రియములకు (కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియములు, మనస్సు, మేధస్సు) అతీతుడు, అగోచరుడు. యోగాభ్యాసము ద్వారా అంతఃకరణ (ఇంద్రియములు, అహంకారము మరియు చిత్తము) సుద్ధీకరణ అవుతుంది. అప్పుడు అవిద్య (అజ్ఞానము) తొలగి, జ్ఞానోదయము అయి, జీవాత్మ మహామాయ బానిసత్వము నుండి విముక్తి పొంది, తన నిజ స్వరూపమును గుర్తించగలడు. పరమాత్ముని కృపతో, ఆత్మ సత్ - చిత్ – ఆనంద స్వరూప స్థితి పొంది, పరమానంద సముద్రములో విలీనము అవుతాడు. దీనిని **జీవన్ముక్తి** అంటారు.
- ❖ **"బ్రహ్మం సత్యం జగత్ మిధ్య, జీవో బ్రహ్మైవ నపరః"** అనగా బ్రహ్మము ఒక్కడే సత్యము (నిత్యము, శాశ్వతము) ఈ ప్రపంచము మిధ్య (భ్రమ) జీవాత్మ బ్రహ్మమే.

32 సంవత్సరముల వయస్సులో (క్రీ. శ. 820 లో) జగద్గురు ఆది శంకరాచార్యలు విదేహ ముక్తి పొందినారు (దేహమును వదలిపెట్టారు). ఆయన ఆదిశంకరుని అవతారము. జగద్గురు ఆది శంకరాచార్యలు ఆధ్యాత్మిక శూన్యతను పూరించి భారతదేశము యొక్క గత ఆధ్యాత్మిక వైభవమును పునరుద్ధరణ చేసినారు.

❖ **విశిష్టాద్వైత వేదాంతము**

జగద్గురు రామానుజాచార్యులు (క్రీ. శ. 1040 - 1137) విష్ణుమూర్తి భక్తులు మరియు విశిష్టాద్వైత వేదాంత స్థాపకులు. ఈ వేదాంతము పరమార్థిక సత్యము (దైవ సత్యము) మరియు వ్యవహారిక సత్యము (ప్రాపంచిక సత్యము) కలిపిన (విశేషణములతో కూడిన అద్వైతము) వేదాంతము. ఆయన పరమాత్మనకు ఖచ్చితమైన నామము, రూపము మరియు లక్షణములు (సత్వ, రజో మరియు తమో గుణములు లేకుండా) భావన యొక్క మొట్టమొదటి ప్రతిపాదకులు. పరమాత్మ నామ రూపములు అయిన విష్ణుమూర్తి (నారాయణ) వాస్తవికతను మూడు అంశములుగా (ఎ) విష్ణుమూర్తి, (బి) జీవాత్మ (ఆత్మ) మరియు (సి) మహామాయ (ప్రకృతి) ప్రకటించారు. విష్ణుమూర్తి మాత్రమే స్వతంత్ర వాస్తవము. జీవాత్మ (ఆత్మ) మరియు మహామాయ (ప్రకృతి) ఉనికి కోసము విష్ణుమూర్తిపై ఆధారపడి ఉండును. మహామాయ యొక్క అన్ని లక్షణములు, పరిణామములు, వ్యక్తీకరణ సత్యము, శాశ్వతము మరియు పరమాత్మని నియంత్రణలో ఉండును. విశ్వము (మహామాయ) మరియు జీవాత్మ (ఆత్మ) విష్ణుమూర్తి (నారాయణ) యొక్క రెండు విడదీయరాని ప్రాకారములు. విష్ణుమూర్తి లేకుండా వీటికి ఉనికి లేదు. జీవాత్మ మరియు మహామాయ (ప్రకృతి) విష్ణుమూర్తి యొక్క శరీరము, విష్ణుమూర్తి ఆ శరీరములో నివసిస్తూ, వాటిని నియంత్రణ చేయును. జీవాత్మ, మహామాయ (ప్రకృతి) విష్ణుమూర్తి అధీనములో ఉన్నవి. జీవాత్మ (ఆత్మ) సంపూర్ణ భక్తి భావనతో (మనస్సుతో, హృదయముతో) విష్ణుమూర్తి పద్మపాదములకు సమర్పణ, శరణాగతి చేసిన విష్ణుమూర్తి భక్తులకు వసమైపోతారు.

## ❖ ద్వైత వేదాంతము

జగద్గురు మాధవాచార్యులు (క్రీ. శ. 1218 - 1317) వ్యవహారిక సత్యము (ద్వందములతో కూడిన ప్రపంచము) మరియు పరమాత్మునిపై భక్తి మాత్రమే పరమాత్ముని పొందుటకు మార్గము సిద్ధాంతముతో ద్వైత వేదాంతము స్థాపించారు. పరబ్రహ్మమము, విష్ణుమూర్తే అని నిరూపించారు. ద్వైత వేదాంతము ప్రకారము మూడు తత్త్వములు అంతిమ సత్యములు (ఏ) విష్ణుమూర్తి, (బి) ఆత్మ (జీవాత్మ), (సి) మహామాయ (స్థూలద్రవ్యము, పదార్థము). వీటిలో ఐదు వ్యత్యాసములు కలవు. (ఏ) విష్ణుమూర్తికి, ఆత్మకు (జీవాత్మ) వ్యత్యాసము కలదు. (బి) విష్ణుమూర్తికి, మహామాయకు వ్యత్యాసము కలదు. (సి) ఆత్మకు (జీవాత్మ) మహామాయకు వ్యత్యాసము కలదు. (డి) ఆత్మకు (జీవాత్మ) మరొక ఆత్మకు (జీవాత్మ) వ్యత్యాసము కలదు. (ఇ) మహామాయకు మరొక మహామాయకు వ్యత్యాసము కలదు. ఆత్మ (జీవాత్మ) శాశ్వతమైనది మరియు విష్ణుమూర్తి సంకల్పము మీద ఆధారపడి ఉన్నవి.

### ద్వైత వేదాంతములోని సిద్ధాంతములు:

- విష్ణుమూర్తి యొక్క సర్వాధికారము మరియు ఆధిపత్యము.
- జీవాత్మలు (జీవులు) మీద వాయువు యొక్క ఆధిపత్యము.
- ప్రపంచము సత్యము మరియు మిథ్యా, భ్రాంతి, భ్రమ కాదు.

- పైన వివరించిన ఐదు విధముల వ్యత్యాసములు.
- పరమాత్ముని పట్ల భక్తి పరమాత్ముని పొందుటకు యదార్థమైన మార్గము.



# యోగము

**"యోగ"** లేక యోగము యొక్క బీజాక్షరము 'యుజ్' (అనగా ఏకము చేయు సాధనము, పొందుట). ఇదివరకు లేనిదానిని కొత్తగా పొందుట. యోగము ద్వారా జీవాత్మను, పరమాత్మునితో ఏకము చేయుటకు, కలుపుటకు సాధనము. యోగము అంతిమ లక్ష్యము జీవాత్మ పరమాత్మునితో ఐక్యత పొందుట. యోగము మహాశివుడు నుండి ఆవిర్భవించినది. ఆయనను ఆదియోగి లేదా మొదటియోగి అంటారు. యోగములలో అనేక విధానములు ఉన్నవి. వాటిని మూడు ప్రధాన విభాగములుగా విభజించవచ్చు (ఎ) కర్మ యోగము, (బి) జ్ఞాన యోగము, (సి) ఉపాసన లేదా భక్తి యోగము (భాగవతము 11 : 20 : 6 నుండి 9 వరకు).

## కర్మ సిద్ధాంతము

కర్మ బీజాక్షరము 'క్రి' అనగా చేయుట. ఇక్కడ కర్మ అనగా పని లేదా చర్య. హిందూ ధర్మము ముఖ్యముగా కర్మ సిద్ధాంతము మీద ఆధారమై ఉన్నది. హిందువులు జన్మము, మరణము తరువాత పునర్జన్మ నమ్ముతారు. విజ్ఞానశాస్త్రములో కూడా ప్రతి శక్తికి (క్రియ, కర్మ) సమానమైన అభిముఖ శక్తి ఉంటుంది. హిందూ ధర్మములో కూడా ఎవరు ఏ విత్తనమును నాటుతారో అదే ఫలములను పొందుతారు. ఇది శాశ్వతమైన, విశ్వమంతటా వర్తించే, దైవ నిర్ణయమైన, అలిఖిత కార్మిక ధర్మ చట్టము. దీనినుండి ఎవ్వరూ తప్పించుకోలేరు (భాగవతము 10 : 24 : 13). ప్రతి ఆలోచన, మాట మరియు చర్య (కర్మ) కార్మిక చట్టమునకు వర్తిస్తుంది. ఆత్మ (జీవాత్మ) పరమాత్ముని నుండి పొందిన చేతన శక్తితో చర్యలను చేస్తుంది (కేనోప నిషత్ 1 : 1 నుండి 9 వరకు). ఈ శక్తితో, జీవాత్మ ఎల్లప్పుడూ, ప్రతి సమయములో చర్యలు

చేస్తుంది. జీవాత్మ చర్యలు చేయకుండా ఉండలేదు. అందరూ ప్రకృతి యొక్క రీతి వలన పని చేయుటకు వివశులు (భగవద్గీత 3 : 5, 33; 18 : 59, 60). ఆ కర్మలు చేయుటకు జీవాత్మకు సంపూర్ణ స్వేచ్ఛ ఉంది. పరమాత్ముడు జీవాత్మ చేసే కర్మలలో జోక్యము కల్పించుకోరు (శ్వేతాశ్వతరోప నిషత్ 4 : 6, 7). కర్మ అనగా హిందూ ధర్మ పవిత్ర గ్రంధాలలో (వేదములలోని కర్మకాండ) పేర్కొన్న చర్యలు చేయుట. వికర్మ అనగా చెడు, అసమ్మతి పని లేదా చర్య (భగవద్గీత 16 : 19). ఏవిధమైన పని చేయకుండాఉన్నా మనస్సు, జ్ఞానేంద్రియములు ఎల్లప్పుడూ పనిచేస్తాయి. కాబట్టి కర్మ చేస్తున్నట్లే పరిగణింపబడుతుంది. కాబట్టి జీవాత్మ చేసే నిర్ణయాలకు, కర్మలకు ఫలితములను జీవాత్మే అనుభవించవలెను (బృహదారణ్యకోప నిషత్ 4 లేదా 6 : 4 : 5; ప్రశ్నోప నిషత్ 3 : 7; భగవద్గీత 3 : 9; భాగవతము 11 : 3 : 20).

జీవులు కోరికలను సంతృప్తి పరుచుటకు కర్మలు చేస్తారు. కోరికలు రెండు విధములు (ఎ) ప్రపంచములో ఉన్నవి ఇంద్రియములతో గ్రహించి, సూక్ష్మ ప్రవృత్తులు ద్వారా వాటిని పొందుటకు మనస్సులో కోరిక పుడుతుంది. (బి) గత జన్మలలోని కోరికలు **సంస్కారములు లేక వాసనలు** (పరిణామముచెందని కోరికలు) రూపములో మనస్సులో అపస్మారక విభాగంలో, సూక్ష్మ రూపములో ముద్రలుగా నిల్వ చేయబడతాయి. మరు జన్మలో మనస్సులో కోరిక రూపములో ఉద్భవించి చేతన రూపము పొందుతాయి. దైవానుభవము పొందేవరకూ కోరికలును వర్జించుట అసాధ్యము (భాగవతము 7 : 10 : 7 నుండి 10 వరకు). ఈ కోరికలు కర్మలు చేయుటకు జీవాత్మను ఒత్తిడి చేస్తాయి. ఆ కర్మలవలన పుణ్య ఫలములు (మంచి కర్మలు) మరియు పాప ఫలములు (చెడు కర్మలు) ఉత్పత్తి అవుతాయి. ఇటువంటి పుణ్య

మరియు పాప కర్మ ఫలములు వాటి కాలపరిమితిని బట్టి జీవాత్మ తదుపరి జన్మలలో వాటి ఫలితములు అనుభవించవలెను. కర్మఫలములు మూడు విధములుగా విభజించబడ్డాయి.

- **ఆగామి కర్మ ఫలములు:** ఆగామి అనగా ఆర్జించిన. ప్రస్తుత జన్మలో ప్రారబ్ధ (ప్రారంభింపబడిన) కర్మఫలములు అనుభవిస్తూ, జీవాత్మ కొత్తగా కొన్ని కర్మలు చేయును. ఆ కర్మల ద్వారా కొత్తగా కర్మఫలములు ఆర్జించును. వీటిని ఆగామి కర్మఫలములు అంటారు. అటువంటి ఆగామి కర్మఫలములలో కొన్ని (వాటి కాలపరిమితిని బట్టి) ప్రస్తుత జన్మలోనే అనుభవించినప్పుడు ఆ కర్మఫలములు అంతము అవుతాయి. మిగిలిన ఫలించని ఆగామి కర్మఫలములు, మరణము తర్వాత, సంచిత కర్మఫలములుగా మార్చబడి మరియు అప్పటికే ఆ జీవాత్మకు నిల్వఉన్న సంచిత కర్మఫలముల ఖాతాకు చేర్చబడుతాయి.
- **సంచిత కర్మ ఫలములు:** సంచిత అనగా ఫలించని, కూడబెట్టిన, నిల్వచేసిన. జీవాత్మ జన్మ, జన్మల నుండి కూడబెట్టిన ఫలించని సంచిత కర్మఫలములు సూక్ష్మరూపములో జీవాత్మతోనూ, దైవ మేధస్సులోనూ నమోదయి ఉన్నవి.
- **ప్రారబ్ధ కర్మ ఫలములు:** ప్రారబ్ధ అనగా ప్రారంభింపబడిన. జీవాత్మ కూడబెట్టిన, నిల్వచేసిన, ఫలించని సంచిత కర్మ ఫలములు కొన్ని పరిపక్వత సమయము రాగానే వాటిని ప్రారబ్ధ కర్మ ఫలములుగా మార్చబడి, వాటిని అనుభవించుటకు ఆ జీవాత్మ ఈ ప్రపంచములో ఒక శరీరము పొంది జన్మ ప్రారంభిస్తుంది. ప్రారబ్ధ కర్మఫలములను

అనుభవించే విధముగా, శరీరము, తల్లిదండ్రులు, భార్య, సంతానము, బంధువులు, సంపద, జీవితకాలము మొదలైనవి పొందుతారు. ఎవ్వరికీ ప్రారబ్ధ కర్మఫలముల ప్రక్రియనుండి (మహాత్ములు, సన్యాసులకు కూడా) మినహాయింపు లేదు. ప్రారబ్ధ కర్మ ఫలములు అంతము అయిన వెంటనే జీవాత్మ ఆ శరీరమును వదిలి వెళ్ళిపోవును. ఆశరీరములో చేతన శక్తి లేక శరీరము మరణిస్తుంది.

కాబట్టి ఆగామి, సంచిత మరియు ప్రారబ్ధ కర్మఫలములు యొక్క ఫలోత్పాదన చక్రము తిరుగుతూనే ఉంటుంది. ఏవ్యక్తి కర్మఫలములు ఆశించకుండా, కర్మఫలములను (మంచి కర్మలు మాత్రమే) పరమాత్మునికి అంకితము చేస్తారో వారు కొత్త ఆగామి కర్మఫలములు ఆర్జించరు (భగవద్గీత 4 : 22, 23; 9 : 27, 28; 18 : 11 నుంచి 18 వరకు). **<u>గమనిక:</u>** చెడు కర్మలకు ఇది వర్తించదు. విశ్వమంతటా ఈశ్వరుడేయను నిశ్చయ బుద్ధి కలిగిఉండి, దేనినీ ఆశించకుండా ఏ మంచి కార్యము చేసినా, ఆ కర్మ ఫలములు మనస్పూర్తిగా పరమాత్మునికి అర్పించుము. **"ఏ తత్ ఫల సర్వం శ్రీపరమేశ్వరార్పణమస్తు"** (ఈశావాస్యోప నిషత్ - 1).

హిందూ ధర్మము ప్రకారము, హిందూ ధర్మ పవిత్ర గ్రంధములలో సూచించబడిన ప్రతి వ్యకి చేయవలసిని మంచి విధులు ప్రముఖంగా '**స్వధర్మములు**'. '**నిష్కామ కర్మలు**' (నిస్వార్థ చర్యలు) ఒక వ్యక్తి అంతఃకరణను (మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము) పవిత్రము చేయును. స్వార్థ పూరిత చర్యలు పురుషార్థములకు (జీవుని అంతిమ లక్ష్యము-మోక్షము) దూరము చేయును. నిష్కామ కర్మలు పురుషార్థముల దిశగా లక్ష్యమును చేర్చును. కర్మ శక్తి సంరక్షణము సిద్ధాంతము.

కర్మవాడ, కర్మ మార్గము మరియు కర్మ ప్రభావము. కర్మఫలములు చేసిన కర్మలకు ఫలితములు. కర్మఫలదాత, కర్మలకు ఫలితములు ఇచ్చువాడు మరియు అంతిమ న్యాయాధిపతి (పరమాత్ముడు). మంచి కర్మలకు పుణ్యము (స్వర్గలోకము), చెడు కర్మలకు పాపములు (నరక లోకము) ఫలితములు (బృహదారణ్యకోప నిషత్ 4 లేదా 6 : 4 : 5). పరమాత్మ ఎల్లప్పుడూ ఆత్మలో నివసించును (ముండకోప నిషత్ 2 : 2 : 7, 8; శ్వేతాశ్వతరోప నిషత్ 6 : 7; భగవద్గీత 15 : 15). జీవుడు అహంకారముతో (గుణముల ప్రభావములకు లోనై తానే చేయుచున్న భావముతో) చేసే కర్మలన్నీ పరమాత్ముడు గమనించుచూ, కర్మ సిద్ధాంతము (దైవ చట్టము) ప్రకారము ఫలములు ఇచ్చును (భగవద్గీత 18 : 61).

## కర్మ విధానము

హిందూ ధర్మము ప్రకారము, జీవాత్మ బౌధిక శరీరమును విడిచిపెట్టిన వెంటనే బౌధిక శరీరమునకు చైతన్యము ఉండదు. దీనినే మరణము అంటారు. చైతన్యములేని బౌధిక శరీరమునకు మాత్రమే మరణము వరిస్తుంది. జీవాత్మకు జననము, మరణము లేని శాశ్వతమైన పరమాత్ముని అంశము. పంచ మహాభూతముల (భూమి, నీరు, అగ్ని, వాయువు మరియు ఆకాశము) ఐదు అంశములతో తయారుచేయబడ్డ ఈ బౌధిక శరీరము మహామాయ లేదా ప్రకృతి యొక్క సత్వ గుణము, రజో గుణము, తమో గుణము, కాలము మరియు కర్మ - ఫలముల నియంత్రణలో ఉండును (భాగవతము 1 : 13 : 45). ఒకరి కర్మలచే వారి భూత, వర్తమాన మరియు భవిష్య జన్మలను నిర్ణయింపబడుతుంది. న్యాయ వేదాంతములో, ఒక వ్యక్తి తక్కువ ప్రయత్నముతో గొప్ప ఫలితాలు పొందుతాడు, మరొక వ్యక్తి

ఎక్కువ ప్రయత్నముతో తక్కువ ఫలితాలు పొందుతాడు. అనగా, వారి వారి పూర్వజన్మ కర్మల కారణముతో వారి వారి ఫలితములు ఆధారపడి ఉన్నవి. ప్రారబ్ధ కర్మఫలములను (కర్మల ప్రక్రియ) అనుభవించుటకు జీవాత్మ పొందే శరీరము, పరిస్థితులు (కుటుంబము), స్థలము, సమయము మరియు జీవితకాలము నిర్ణయించబడుతుంది. జీవాత్మ జన్మ, జన్మలలో చేసిన కర్మలు - సంచిత కర్మలతో (కూడబెట్టబడిన కర్మలు) జన్మలు ఎత్తి ఆ కర్మఫలములను శరీరము మరియు మనస్సులో నొప్పి లేదా ఆనందము అనుభూతి పొంది ఆ కర్మలను సమాప్తి చేసుకోవలసిన బాధ్యత జీవాత్మదే. ఏవ్యక్తి అయితే వారి ప్ర్రపంచముపై కోరికలు, అనుబంధమును వదలి పరమాత్మునిపై దృఢమైన విశ్వాసముతో, భక్తితో, నిత్యమూ యోగమును సాధన చేస్తూ, పరమాత్మునికి తననుతాను (ఆత్మను) సమర్పించుకుంటారో వారి సంచిత కర్మఫలములు, పరమాత్ముని కృపతో, నాశనము అవుతాయి. కాని అందరూ వారి, వారి ప్రారబ్ధ కర్మఫలములను ప్రస్తుత జన్మలో అనుభవించవలసినదే. ఎవరైతే పైన వివరించిన విధముగా జీవితమును గడుపుతారో, వారు ఆ జన్మలో ఆగామి కర్మఫలములు ఆర్జించరు, సంచిత కర్మఫలములు నాశనము చేసుకుంటారు మరియు వారి ప్రారబ్ధ కర్మ ఫలములు అనుభవించి అవి అంతము అయ్యేసమయమున (మొత్తము ఏ కర్మ ఫలములు లేనందున) శరీరమును వదలి, మహామాయ యొక్క బానిసత్వము నుండి విముక్తి పొంది, పరమాత్మునిలో ఇక్యమవుతారు (బృహదారణ్యకోప నిషత్ 4 లేదా 6 : 4 : 6). జీవాత్మ ఎప్పుడైతే తానుచేసిన కర్మలన్నింటినీ సంపూర్ణముగా సమాప్తి చేసుకుంటుందో అప్పుడు పరమాత్ముని కృపతో జీవాత్మ పరమాత్మునిలో విలీనము అవుతుంది (కఠోప నిషత్ 2 : 3 : 14). ఇదే మోక్షము.

## కర్మ యోగము

కర్మ యోగము అనగా సరియైన చర్యాలు (కర్మలు) చేయు మార్గము. 84 లక్షల జీవరాసులలోనూ మానవజన్మ ఉత్తమమైన జన్మ. కర్మ యోగము మానవులకు పురుషార్ధములలో మొదటి మూడు పురుషార్ధములు (ధర్మ, అర్ధము, కామము మాత్రమే) సాధించుటకు వర్తిస్తుంది. కర్మ యోగము ద్వారా మానవులు ఉత్తమ గతులు, జన్మలు (స్వర్గలోకము వరకు మాత్రమే) పొందవచ్చు (భాగవతము 11 : 3 : 20). ఇది మోక్షము పొందుటకు వర్తించదు. కర్మ యోగము, జ్ఞానయోగము లేదా భక్తియోగము మార్గమునకు నడిపించును. ఇది నియమములు, నిబంధనలు, ప్రతిబంధకములతో జోడించబడి సరియైన చర్యాలు (కర్మలు) చేయుటకు చాల కష్టతరమైన మార్గము (భాగవతము 11 : 27 : 06). ఏ కర్మ అయినా దాని ఫలములు ఆశించి చేసిన, మానసిక బానిసత్వము యేర్పడును. ఏ ఫలితములు ఆశించకుండా కర్మలు (నిష్కామ కర్మలు) చేసే విధానమే కర్మ యోగము. **"నీ మనస్సును భక్తితో పూర్తిగా నాయందుంచి, నీ శరీరముతో కర్మలు చేయుట కర్మ యోగము"** (భగవద్గీత 3 : 7, 9 ; 8 : 7). అప్పుడు వారి కర్మఫలములు వారికి అంటవు. భక్తిలేని ఏ ధర్మకర్మము, ధర్మమే కాదు (భాగవతము 1 : 2 : 6; భగవద్గీత 11 : 55). ఏ ధర్మకర్మము అయినా భక్తితో కూడినదయితే అదియే ధర్మము (భాగవతము 11 : 19 : 27). సాంఖ్య తత్వశాస్త్రము ప్రకారము ప్రకృతి యొక్క గుణములచే (సత్త్వ, రజస్, తమో) కర్మలు చేయబడును. ఈ మూడు గుణముల సమత్వముతో కర్మలు చేయుటయే కర్మ యోగము. **"ఎవరు, నా ఆశ్రయము చేరి, వారి కర్మలు చేయుదురో వారు, నా కృపతో, శాశ్వతమైన అమరత్వము**

**పొందుదురు"** (భగవద్గీత 18 : 56). ఎవరైతే సత్వ గుణము ప్రాధాన్యతతో ధర్మ కర్మలు చేస్తారో, వారికి వారి కర్మఫలములు అంతమయ్యేవరకూ (పరిమిత కాలము) స్వర్గలోకము ప్రాప్తించును. ఎవరైతే రజో గుణము ప్రాధాన్యతతో ధర్మ కర్మలు చేస్తారో, వారికి మృత్యులోకము (భూలోకము) ప్రాప్తించును. ఎవరైతే తమో గుణము ప్రాధాన్యతతో ధర్మ కర్మలు చేస్తారో, వారికి నరకలోకము ప్రాప్తించును (భాగవతము 2 : 10 : 41; భగవద్గీత 14 : 18; ప్రశ్నోప నిషత్ 3 : 7). గుణములతో ఏర్పరచుకున్న సంబంధమే మంచి లేక చెడు జన్మలకు కారణము. ఎవరైతే ఏ ఫలములూ ఆశించకుండా స్వధర్మముతో (వర్ణ, ఆశ్రమ ధర్మము - పేజి సంఖ్యలు 69 నుండి 82 వరకు చూడుము) కర్మలు చేయుదురో అదే కర్మ యోగము. "నీవు ఏమితినినా, ఏమిదానమిచ్చినా, ఏధర్మముచేసినా, ఏమిచేసినా, నాకొఱకు మాత్రమే చేయుము. నీవు నా శరణాగతి చేరి, నీ మనస్సును నాపైలగ్నము చేసి ఏకర్మ చేసినా, నీకు నీ కర్మఫలములు రావు, నీ కర్మలు (మంచి, చెడు) నిన్ను బంధించవు (భగవద్గీత 4 : 22, 23; 9 : 28). ఎవరైతే "నేను చేయుచున్నాను అనే భావనలేకుండా", నిస్వార్థ కర్మలతో, చేసే కర్మలకు వాటి ఫలములు వారికి రావు. దానితో మనస్సు పరిశుభ్రమై, కొత్త బంధములు ఏర్పడవు. దానితో జనన, మరణ, పునర్జన్మ చక్రమునుండి విడిపడి, విముక్తి పొంది, పరమాత్మునిలో విలీనము అవుదురు. <u>**గమనిక:**</u> జనన, మరణ, పునర్జన్మ చక్రము - అనుబంధము 'జె' (పేజి సంఖ్యలు 234 నుండి 240 చూడుము).

**జ్ఞాన యోగము**

**"ప్రజ్ఞానం బ్రహ్మ"** బ్రహ్మము జ్ఞాన రూపములో ఉన్నది

(ఐతరేయోప నిషత్ 3 : 1 : 3). "**సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ**" బ్రహ్మము సత్యమును, జ్ఞానమును అనంతమునై యున్నది (తైత్తిరీయోప నిషత్ 2 : 1 : 1). ఆ జ్ఞానమే వేదములు (ఋగ్వేదము). ఈ ప్రపంచములో పరిశుద్ధముచేయు దివ్యజ్ఞానముకంటె మహోన్నతమైనది మరొకటి లేదు (భగవద్గీత 4 : 38). జ్ఞానము రెండు విధములు (ఎ) '**అపర విద్య**' అనగా వేదములు మరియు వేదాంగములు (బి) '**పర విద్య**' అనగా అక్షరుడగు పరమాత్మ యొక్క స్వరూపము ప్రాప్తించునో, అది (పర విద్య) బ్రహ్మ విద్య (ముండకోప నిషత్ 1 : 1 : 5). జీవాత్మను మహామాయ యొక్క అజ్ఞానమనే అంధకారము ఆవరించిఉన్న కారణముచేతనే అనంత జన్మలు యెత్తుతున్నది. జ్ఞానమనే దీపము రాగానే అజ్ఞానమనే అంధకారము చెదరకొట్టబడుతుంది. అప్పుడు ఆత్మ, పరమాత్మే అని తెలుసుకుంటాడు. ప్రస్తుతపు విద్యా విధానము (విజ్ఞాన శాస్త్రము, సాంకేతిక విజ్ఞానము మొదలైనవి) ద్వారా ఈ ప్రపంచములోని వస్తువులు పొందుటకు మాత్రమే ఉపయోగపడును. ప్రస్తుతము పురోగమించిన అనబడే విజ్ఞాన శాస్త్రము, సాంకేతిక విజ్ఞానము ప్రారంభమవుతుంది. జ్ఞాన యోగము, భక్తి యోగము పరస్పర అనుబంధము కలిగి ఉన్నవి. జ్ఞానముతో భక్తి, భక్తితో జ్ఞానము కలుగును. అప్పుడే జ్ఞానము, భక్తి పరిపక్వము పొందును. భక్తి లేని జ్ఞానము, జ్ఞానములేని భక్తి గమ్యమును చేర్చలేవు.

ఈ విశ్వమంతటా దైవత్వము వ్యాపించి ఉన్నది. ఎవరైతే తనను తాను తెలుసుకుంటారో, వారు అంతా తెలుసుకున్నవారే. ఎవ్వరూ వారి భౌతిక శరీరము (మహామాయతో తయారుచేయబడ్డ) కాదు. '**నేను**' ఎవరు? అనే ప్రశ్నకు సమాధానము '**నాది**' **కానిదే** '**నేను**'. నా, నాది అన్నవి ప్రతిదానినీ

(నా శరీరము, నా గృహము, నా బంధువులు, నా ధనము, నా అధికారము, నా హెూదా, నా పదవి, నా స్థాయి, నా ప్రతిష్ఠ మొదలైనవి) తీసివేసి మిగిలినది ఏదో అదే నేను. "ఈ శరీరములో ఉన్న జీవాత్మ నా అంశము. జీవాత్మే ప్రకృతి యొక్క మనస్సును, పంచ జ్ఞానేంద్రియములను తనచుట్టూ ఆకర్షించి ఉన్నది" (భగవద్గీత 15 : 7). **"ఎవరైతే తన శరీరము, దానికి సంబంధించినవి అవే తాను అనుకుంటారో వారు అవివేకులు"** (భాగవతము 11 : 19 : 42). కామము, క్రోధము, మోహము, గర్వము, అహంకారము, దురాశ, దుఃఖము, మోసము, భయము మొదలగు అనేక దుష్ట లక్షణములకు మనస్సు మూలము. జ్ఞాన మార్గము అనుసరించుటకు మనస్సులో ప్రశాంతత, నిర్మలము, నిష్కామము, నిష్క్రోధము, నిష్కపటము, నిరహంకారము, నిర్మోహముతో సంపూర్ణ నియంత్రణ కలిగి ఉండవలెను. కాని ఇది మిక్కిలి కష్టము (భాగవతము 5 : 6 : 3; భగవద్గీత 6 : 34, 35; మహెూప నిషత్ 4 : 5). మనస్సు మంచి సేవకుడు, కానీ చెడు యజమాని. మనస్సు మూడు లోపములతో కల్మషయుక్త మవుతుంది. (ఎ) పాపములు, (బి) చంచలము, (సి) అజ్ఞానము. ఎవరైతే నిష్కామముతో, నిస్వార్థముతో కర్మలు చేయుదురో వారి పాపములు, చంచలము అంత మొందును. మూడవ లోపముగు అజ్ఞానమును పోగొట్టుకొనుటకు గురువును ఆశ్రయించి శిష్యత్వము అర్థించవలెను. ఆయన కృపతో జ్ఞానమును బోధించెదరు. ఈ దశలో ప్రాపంచిక వస్తువుల కోసము ప్రయతించరు. వారి లక్ష్యము జ్ఞానముతో బ్రహ్మానుభూతి పొందుట.

వేదములలో, పవిత్రమైన జ్ఞానము పొందుటకు 'సాధన చతుష్టయ సంపత్తిని' (నాలుగు ఆధ్యాత్మిక మార్గములు) వివరించినారు. **సాధన చతుష్టయ సంపత్తి** లేని వారికి బ్రహ్మ

జిజ్ఞాస కాని, బ్రహ్మ సాక్షాత్కారము గాని సంభవింపదు (వరాహోప నిషత్ 2 : 1; బృహదారణ్యకోప నిషత్ 4 లేదా 6 : 4 : 23; బ్రహ్మ సూత్రములు 1 : 1 : 1):

- **నిత్యానిత్య వస్తు వివేకము:** ఆత్మ (నేను) ఒక్కటే నిత్యమైనది, దృశ్యములు (విశ్వము) (నాది, నావి) అంతయూ అనిత్యము అనే సామాన్యమైన వివేకము.
- **ఐహికా ముష్మిక ఫలభోగ విరాగము (వైరాగ్యము):** శరీరము, భూలోకములోని భోగ వస్తువులు, స్వర్గములోని సుఖములు అన్నియూ నశించును. అప్పుడు దుఃఖము తప్పదు. దుఃఖాంతమగు ఇహికాముష్మిక ఫలభోగములు నా కక్కరలేదనెడి తీవ్రవైరాగ్యము.
- **శమాది షట్క సంపత్తి:**
  - **శమ:** శమ అనగా మనస్సులో విషయ భోగాలోచనలు చేయకుండుట.
  - **దమ:** దమ అనగా బహిరింద్రియములతో (జ్ఞానేంద్రియములు, కర్మేద్రియములు) బాహ్యవిషయ భోగాలోచనలు చేయకుండుట.
  - **ఉపరమ:** ఉపరమ అనగా ప్రసక్తముక్తులై సుఖ సాధన విషయముల నుండి తన దేహేంద్రియ మనోబుద్ధులను వెనుకకు మరలించుట లేక సన్న్యసించుట .
  - **తితీక్ష:** తితీక్ష అనగా ఇతరులవలన తనకు కష్టము సంభవించినపుడు అది తన ప్రారబ్ధ కర్మఫలమని గుర్తించి, వారికి తిరిగి ప్రత్యపకారము చేయవలెనని భావన లేకుండుట.
  - **శ్రద్ధ:** శ్రద్ధ అనగా గురు, వేదాంత వాక్యముయందలి దృఢ

విశ్వాసము కలిగియుండుట.

- **సమాధి:** సమాధి అనగా చిత్తముతో (మనస్సు) ఏకాగ్రత.

❖ **ముముక్షుత్వము:** ముముక్షుత్వము అనగా తీవ్రమైన మోక్షేచ్ఛ. శ్రుతి (వేదములు), స్మృతి (ధర్మ సూత్రములు, పురాణములు, ఇతిహాసములు) అమృత తత్త్వ ప్రభోధనకు తహతహలాడుచుండుట. అప్పుడు అతడు గురువును ఆశ్రయించి, హిందూ ధర్మ పవిత్ర గ్రంథములను అధ్యయనము చేసి, గురు కృపతో జ్ఞానము పొంది ఆత్మానుభవము పొందును.

## ఆత్మ (నేను) అవగాహనము

అహంకారము ("నేను", “నాది” అనే ఆలోచన లేదా భావన) అన్ని సమస్యలకు దారితీస్తుంది. అజ్ఞానము (అవిద్య) కారణమవుతుంది. ప్రపంచము (వస్తువులు) ఇంద్రియములను, మనస్సును ఆకర్షిస్తాయి. ఆ ఆకర్షిణలకు అనుబంధము ఏర్పరచుకొని, భ్రమపడి, స్మారకము తప్పి, ఆత్మ భావన కోల్పోతాడు. ఎవరి అహంకారము జ్ఞానాగ్నిలో దగ్ధమైనదో, వారికి ఈ ప్రపంచము ఒక కల్పనగా కనిపించి, వారి మనస్సు తీవ్రమైన ఆవేశము, కోరికలు, కోపము, దురాశ, గర్వము, అసూయ మరియు మహామాయ దాటి, సత్ – చిత్ - ఆనంద స్వరూపముగా ఉంటాడు.

## భక్తి యోగము

భక్తి బీజాక్షరము 'భజ్' అనగా చేరుట. భక్తి అనగా మనస్సులో పరమాత్మునితో ఐక్యమగుట (భాగవతము 10:29:15).

భక్తి యోగము అనగా జీవాత్మ, సగుణ బ్రహ్మతో (పరమాత్మని సాకార రూపముతో) చేర్చుటకు మార్గము. "భక్తి యోగము మార్గములో ఆధ్యాత్మిక జ్ఞానము మరియు వైరాగ్యము కాలక్రమేనా అణిగిపోయినవి" (భాగవత మహాత్మ్యము (పద్మ పురాణము నుండి సంగ్రహించిన) విస్తృత వివరణ 1 : 45). భక్తి యోగము యొక్క అత్యంత ప్రతినిధి దేవ ఋషి నారదుడు యొక్క "నారద భక్తి సూత్రములలో" భక్తి వేదాంతము విస్తృతముగా వివరించబడినది. నిష్కామ (కోరికలు లేకుండా), నిరంతర (ఎల్లప్పుడూ), నిర్మలమైన మనస్సుతో జీవాత్మ, పరమాత్మనితో ప్రత్యక్ష సంబంధమే భక్తి (భాగవతము 1 : 2 : 6). భక్తి దేశము, ప్రదేశము, జాతి, మతము, కులము, తెగ, ప్రాంతము, శాఖ, విభాగములకు అతీతమైనది. ఇది జీవులందరికీ వర్తిస్తుంది. భక్తిని ఎవరైనా, ఏప్రదేశములోనైనా, ఏసమయములోనైనా మరియు ఏదుస్తులలోనైనా పాటించవచ్చును. భక్తికి ఏ అవసరములు, పరిస్థితులు, నియంత్రణలు, ఆచారములు, పద్ధతులు లేవు. మానవులలో ప్రపంచము వైపు నున్న స్వార్థపూరిత ప్రేమను ధృడమైన నమ్మకముతో, నిర్మలమైన మనస్సుతో (కేవలము భౌతిక చర్యలే కాకుండా) పరమాత్మనివైపు మరలించి అదే ప్రేమను పరమాతునుపై చేయుటయే భక్తి (భగవద్గీత 12 : 2). **నవదా భక్తి** (తొమ్మిది విధములుగా) పేర్కొనవచ్చు (ఎ) శ్రవణ, (బి) సంకీర్తన, (సి) స్మరణ, (డి) పాదసేవ, (ఇ) అర్చన, (ఎఫ్) వందన, (జి) దాస్య, (ఎహ్) సఖ్య, (ఐ) ఆత్మనివేదన. భక్తి సాధన ప్రారంభ దశలో ప్రాపంచిక విషయములను తగ్గించుకొని మనస్సును పరమాత్మనిపై లగ్నము చేయవలెను. భక్తి సాధన చేయువారు మూడు వర్గములుగా విభజించవచ్చు (ఏ) సాత్త్విక భక్తి, (బి) రాజసిక భక్తి, (సి) తామసిక భక్తి. భక్తి ఉద్రేకము (రజోగుణము),

అజ్ఞానము (తమోగుణము) లను నాశనముచేయును (భాగవతము 1 : 5 : 28). ఎవరైతే ఎల్లప్పుడూ నిశ్చలమైన సంపూర్ణ భక్తితో నిమగ్నుడై ఉంటారో, వారు ప్రకృతి యొక్క మూడు గుణములను అతిక్రమించి బ్రహ్మస్థితికి వచ్చును (భగవద్గీత 14 : 26). **"నా దివ్యశక్తి, ప్రకృతి యొక్క మూడు గుణములను దాటుట శక్యము కానిది, కాని నన్ను శరణుపొందినవారు దానిని సులభముగా దాటగలరు"** (భగవద్గీత 7 : 14). కేవలము భక్తిశ్రద్ధలతో పరమాత్మను సేవించిన పరమాత్ముని సులభముగా పొందవచ్చును భాగవతము 11 : 14 : 21). అత్యంత భక్తి స్థితిలో భక్తుడు తాదాత్మ్యముతో తన సర్వస్వమునూ పరమాత్మకు సమర్పించుకుంటాడు. **"నేను నా భక్తుల సేవకుడను. నా ప్రియభక్తులు ఆరాధనాభావతో నా హృదయమును సంపూర్ణముగా దోచుకొనబడ్డ వాడనయి, నేను స్వతంత్రుడనుకాను, వారి భక్తి ఆధీనములో ఉంటాను"** (భాగవతము 9 : 4 : 63). (మహాభారత యుద్ధములో శ్రీకృష్ణుడు, అర్జనుడి రథమునకు రథసారధి అయినారు) **"నా స్వంత కుమారుడు, పరమపిత బ్రహ్మ; నా స్వంత దైవ వ్యక్తిత్వము) పరమశివుడు(, నా సోదరుడు) బలరాముడు(, నా పత్ని మహాలక్ష్మీదేవి, నా అంతట నేను) శ్రీకృష్ణ (కంటె నా భక్తుడే నాకు అత్యంత ప్రియమైనవాడు**) భాగవతము 11 : 14 : 15). **"నా భక్తుల పాదముల ధూళితో పరిశుద్ధము అగుటకు, నేను నా భక్తులను అనుసరిస్తాను"** (భాగవతము 11 : 14 : 16). పరమాత్ముడు కురిపించిన కృపతో, భక్తుడు కర్మలను విసర్జిస్తాడు (భాగవతము 4 : 29 : 46). **ఎవరైతే ప్రేమతో, శుద్ధమైన బుద్ధితో (ఆత్మ సమర్పణ, శరణాగతి భావనతో) ఒక ఆకు, ఒక పువ్వు, ఒక పండు లేదా నీరైనా నాకు సమర్పిస్తారో, దానిని నేను స్వీకరించి, హృదయపూర్వకముగా ఆనందిస్తాను**

(భాగవతము 10 : 81 : 4). భక్తి, అన్ని సమస్యలకు కారణమైన అహంకారమును, కోరికలను నాశనము చేయును. (**<u>గమనిక:</u>** భగవద్గీత, ద్వాదశాధ్యాయము పేజి సంఖ్యలు 149 చూడుము).

## యోగ సూత్రములు

మహర్షి పతంజలి ప్రకారము, యోగము యొక్క ఎనిమిది అవయవములు (యోగ సూత్రములు 2 : 29) వివరములు:

- **యము (స్వీయ నియంత్రణ):** అహింస, సత్యత, నిగ్రహము, ధన, వస్తువుల సమీకరణ చేయకుండుట, దొంగిలించకుండుట (భాగవతము 2 : 9 : 39; యోగ సూత్రములు 2 : 30).
- **నియమ (ధర్మ పరమైన ఆచారములు):** మంచి అలవాట్లు (శరీరము మరియు మనస్సు యొక్క పవిత్రత), సంతృప్తి, నిష్ఠ, వేదములు అధ్యయనము, దైవ స్తుతి, ధ్యానము (యోగ సూత్రములు 2 : 32).
- **ఆసనములు:** సరైన భంగిమలో (84 ఆసనములు) ధ్యానము (యోగా సూత్రములు 2 : 46).
- **ప్రాణాయామము:** సరైన పద్ధతిలో ఊపిరి నియంత్రణ (యోగ సూత్రములు 2 : 49) (**<u>గమనిక:</u>** వివరములకు పేజి సంఖ్యలు 177 నుండి 179 వరకు చూడుము).
- **ప్రత్యాహారము:** ప్రాపంచిక విషయముల నుండి ఇంద్రియములను మరలించుట (యోగ సూత్రములు 2 : 54).
- **ధారణ:** మనస్సును ఒక్కదానిపై కేంద్రీకరించుట (యోగ సూత్రములు 3 : 1).
- **ధ్యానము:** ధ్యానము సాధన (యోగ సూత్రములు 3 : 2).

- **సమాధి:** మానసిక ఏకాగ్రత సాధన. అహంకారము నిర్మూలమయి, మనస్సు శారీరక భావన కోల్పోయి, ఆత్మానుభూతి కలిగి అంతిమ సత్యమును గ్రహించును (యోగ సూత్రములు 3 : 3).

## ఇతర యోగములు

హిందూ ధర్మములో ఇతర ప్రముఖ యోగములు (ఏ) రాజ యోగము, (బి) ప్రాణాయామము, (సి) కుండలిని యోగము. (హెచ్చరిక: ఈ శీర్షికలో వివరించిన యోగములు సమర్థమైన గురువుల నుండి శాస్త్రీయ పద్ధతులలో అభ్యసించి, వారి పర్యవేక్షణలో సాధన చేయవలెను. లేనిచో ప్రమాదకరమైన పరిణామములు కలుగవచ్చును).

## రాజ యోగము

ఎవరైతే సరైన అవగాహనతో రాజ యోగము అభ్యసించి, సరైన పద్ధతులను అనుసరించి, మానసిక ఏకాగ్రతతో రాజయోగమును సాధన చేయుదురో వారికి జ్ఞానోదయము కలిగి పరమాత్మునితో వ్యక్తిగత సంబంధము ఏర్పడి పరమానంద అనుభూతి పొందుదురు. ఇది మానసిక కంపనములను, ఆందోళనలను, అస్థిరతను, కలతలను నియంత్రించి, మానసిక స్థితిని దాటి పరమాత్మునితో అనుసంధానము యేర్పడును. ఈ యోగము అంతఃకరణలోని సంస్కారములు లేదా వాసనలు (గత జన్మలలోని ఆలోచనలు ఉప చేతన మనస్సులోని ముద్రలు) పరిశుద్ధి చేయును. ఈ యోగసాధనలో మానవాతీతమైన శక్తులను (సిద్ధిలు) పొందుదురు. (అనుబంధము "కె" పేజి సంఖ్యలు 241, 242 చూడుము). ఈ శక్తులను విస్మరించి ఆధ్యాత్మిక సాధన మార్గములో

కొనసాగవలెను. లేదా పతనమునకు దారితీయును. అప్పుడు అహంకారము కరిగిపోయి, యోగి నిర్వికల్ప సమాధి ప్రవేశించును.

## ప్రాణాయామము

ప్రాణము అనగా శరీరము జీవించుటకు కీలకమైన జీవశక్తి. జీవాత్మనుండి చైతన్యము బుద్ధి, మనస్సు, శరీరమునకు అనుసంధానము చేయుటకు జీవశక్తి అత్యంత అవసరము. యామము అనగా యోగాంగము. మహర్షి పతంజలి యోగ సూత్రములలో శాస్త్రీయ పద్ధతిగా ప్రాణాయామము, సమాధిలో ఉన్నత స్థితిని పొందుటకు, వివరించినారు (2 : 49). యోగము, ప్రాణాయామము గురించి యోగాతత్త్వోప నిషత్, యోగచూడామణ్యుప నిషత్, యోగాశిఖోప నిషత్, యోగకుండల్యుప నిషత్ లలో వివరములు కలవు. శరీరములో ఊపిరి ద్వారా లభించే ప్రాణశక్తి విస్తరణ కీలకము. ఉచ్ఛ్వాసము మరియు నిశ్వాసము నెమ్మదిగా, ఎక్కువ సమయము (అనగా ఒక చక్రము కోసము ఎక్కువ సమయము) తీసుకున్న జీవులలో ఆయుర్దాయము ఎక్కువగానూ, శక్తివంతముగానూ, శాంతముగానూ, సంతోషముగానూ, విశ్వనీయముగానూ ఉంటారు. తక్కువ సమయము తీసుకున్న జీవులలో ఆయుర్దాయము తక్కువగానూ, నమ్మతగనివారుగానూ ఆవేశవంతులుగానూ, ఉంటారు. ప్రాణ వాయువులు పది రకములు. (ఎ) **పంచ ప్రాణములు** (ఐదు ముఖ్య వాయువులు) - (i) ప్రాణ (ఉచ్ఛ్వాస మరియు నిశ్వాసములలో నాసికద్వారములు లేదా నోరు ద్వారా తీసుకొని, వదిలే వాయువు). దీని స్థానము ఊపిరితిత్తులు, (ii) అపాన (గుదము ద్వారా బయటకుపోయే వాయువు). దీని

స్థానము గుదము. (iii) సమాన (జీర్ణక్రియకు అవసరము అయ్యే వాయువు). దీని స్థానము నాభి. (iv) ఉదాన (వాంతి అయ్యే సమయములో నోటిద్వారా బయటకుపోయే వాయువు). దీని స్థానము గొంతు. (v) వ్యాన (శరీరములో ప్రతి దిశకు వ్యాపించి బయటకుపోయే వాయువు). దీని స్థానము శరీరము. (బి) **పంచ ఉప ప్రాణములు** (ఐదు అనుబంధ వాయువులు) - (i) నాగ (తేణుపు సమయములో వచ్చే వాయువు). (ii) కూర్మ (కనురెప్పలు తెరుచుటకు, మూయుటకు సహాయపడే వాయువు). (iii) కర్కల (ఆకలి కలిగించే వాయువు). (iv) దేవదత్త (ఆవలింత సమయములో కలిగే వాయువు). (v) ధనంజయ (శరీర పోషణకు అవసరమయ్యే వాయువు) (భాగవతము 3 : 6 : 7). ఈ పది వాయువులు మరలా మూడు రకములుగా పరిణామము చెందును - (ఎ) ఓజస్సు, (బి) చిత్తము, బుద్ధి, మనస్సు, అభీష్టము, ఆలోచన శక్తి, (సి) శరీర బలము. ప్రాణాయామము చేయుటకు కడుపు ఖాళీగా ఉండవలెను. ముందు అడ్డంకులను (పిత్తము, కఫము, శ్లేష్మము) తొలగించుటకు, ఊపిరితిత్తులు పూర్తిగా నిండునట్లు గాలిని పీల్చి, కొద్దిసేపు ఆపి, ఊపిరితిత్తులు పూర్తిగా ఖాళీ చేయుటకు గాలిని వదులవలెను. ఈ పద్ధతికి విరుద్ధముగా కూడా చేయవలెను. ప్రాణాయామము ముఖ్యముగా మూడు స్థాయిలు ఉన్నవి. (ఎ) పూరకము (వాయువును ఊపిరితిత్తుల లోపలికి పీల్చుట), (బి) కుంభకము (వాయువును ఊపిరితిత్తుల లోపల బిగపట్టి ఉంచుట), (సి) రేచకము (వాయువును ఊపిరితిత్తులనుండి బయటకు వదులుట) (యోగ సూత్రములు 2 : 49). సాధారణముగా క్రింది వివరించిన ప్రాణాయామములు (ప్రణవము - 'ఓం' జపిస్తూ) సాధన చేయుదురు:

❖ **భస్త్రిక:** ఊపిరితిత్తులు పూర్తిగా నిండునట్లు శ్వాసను తీసుకుని, తర్వాత ఊపిరితిత్తులు పూర్తిగా ఖాళీ చేస్తూ

(కడుపును లోపలకు నొక్కుతూ) శ్వాసను పూర్తిగా వదులుట (2 నుంచి 5 నిముషములు).

- ❖ **కపాల భాతి:** కడుపును లోపలకు నొక్కుతూ, శ్వాసను బలవంతముగా బయటకు వదులుట (30 సార్లు లేదా 10 నిమిషములు).
- ❖ **బహర్య:** శ్వాసను బయటకు వదలి, గడ్డమును ఛాతీకి తాకించి, కడుపును లోపలకు నొక్కుతూ, కాసేపు ఆగి, తరువాత గడ్డమును సాధారణ స్థానమునకు తెచ్చి, నెమ్మదిగా శ్వాసను లోపలకు తీసుకొనుట (10 నిముషములు).
- ❖ **అనులోమ మరియు విలోమ:** కుడి ముక్కును, కుడిచేతి బొటన వేలితో మూసి, శ్వాసను ఎడమ ముక్కు నుండి తీసుకొనవలెను. తరువాత కుడి ముక్కును వదలి, కుడిచేతి మధ్యవేలితో ఎడమ ముక్కును మూసి, కుడి ముక్కు ద్వారా శ్వాసను వదులుట (అనులోమ). విరుద్ధ విధానము విలోమ. ఎడమ ముక్కును, ఎడమచేతి బొటన వేలితో మూసి, శ్వాసను కుడి ముక్కునుండి తీసుకొనవలెను. తరువాత ఎడమ ముక్కును వదలి, ఎడమచేతి మధ్యవేలితో కుడి ముక్కును మూసి, ఎడమ ముక్కు ద్వారా శ్వాసను వదులుట (10 నిమిషములు).
- ❖ **భ్రామరి:** రెండు చెవులను రెండు బొటనవేళ్లతో మూసి, నుదుటిపై రెండు చూపుడువేళ్లను ఆనించి, మిగిలిన మూడువేళ్ళను ముక్కు క్రింద పెట్టి, శ్వాసను తీసుకొనవలెను. తరువాత తుమ్మెదవాలె ఝుంకారము చేయుచూ శ్వాసను వదులుట (10 నిమిషములు).
- ❖ **ఉద్గీత:** ఊపిరితిత్తుల నిండుగా శ్వాసను తీసుకొని, శ్వాసను వదిలే సమయములో ఓంకారము జపించుట (10 నిమిషములు).

## కుండలిని యోగము

కుండలి అనగా పాము, చేవిపోగులు, శక్తి దేవతగా పరిగణించబడుతుంది. వెన్నెముక, పాము యొక్క ఆకారములో ఉండును. వెన్నెముక స్థావరమున సూక్ష్మమైన మూడు నాడులు (ఇడ, పింగళ, సుషుమ్న), పాముని ద్రించునప్పుడు చ్చుట్టుకున్న విధముగా మూడున్నర చుట్లు చుట్టుకుని తలను పైచుట్టు కిందనుంచి బయటకు తెచ్చి నిద్రిస్తున్నట్లు, ఏర్పాటు ఉన్నది. ఈ ప్రదేశములో దైవశక్తి నిద్రాణస్థితిలో ఉంటుంది. వెన్నెముక రెండు వైపులా రెండు నాడులు (ఎడమ నాడి 'ఇడ', కుడి నాడి 'పింగళ'), వెన్నెముక మధ్యలో 'సుషుమ్న' నాడి ఉన్నవి. సుషుమ్న నాడి సాధారణముగా మూసివేయబడి ఉంటుంది. యోగాతత్త్వోప నిషత్, యోగాచూడామణ్యుప నిషత్, యోగాశిఖోప నిషత్, యోగకుండల్యుప నిషత్ లలో వెన్నెముక వివరములు కలవు. కుండలిని శక్తి జాగృతము అయినప్పుడు, కుండలిని శక్తి వెన్నెముక యొక్క స్థావరము నుండి బుసలు కొట్టుతూ లేచి, సుషుమ్న నాడిలో పైకి ప్రయాణిస్తూ, ఆరు దైవ చక్రములు లేక కేంద్రములు (ప్రతి రెండు చక్రముల తరువాత మూడు గ్రంధులు - బ్రహ్మగ్రంధి, విష్ణుగ్రంధి, రుద్రగ్రంధి) దాటి తల చివరిభాగమున (కపాలము లేక పుఱ్ఱ క్రింద) ఉన్న అంతిమస్థానము 'సహస్రారము' చేరును. అప్పుడు ఆధ్యాత్మిక ప్రకాశము కలుగును (అనుబంధము "ఎల్" - పేజి సంఖ్య 243 చూడుము).

❖ **ఇడ నాడి:** ఇడ నాడి వెన్నెముక ఎడమ వైపున, క్రింద నుండి 'ఆజ్ఞా చక్రము' (కనుబొమ్మలు మధ్య కేంద్ర స్థానము) వరకూ ఉంటుంది. ఇది ఆజ్ఞా చక్రము వద్ద సుషుమ్న నాడితో కలుస్తుంది. కుడి ముక్కు రంధ్రము ద్వారా ఊపిరి లోపలకు తీసుకుని, ఊపిరి

వదులుతున్నప్పుడు ఎడమ ముక్కు రంధ్రము ద్వారా ఊపిరి బలముగా బయటకు వచ్చినట్లయితే కుండలిని శక్తి ఇడ నాడి ద్వారా ప్రవహిస్తున్నట్లు. విశ్రాంతి సమయములో, కుండలిని శక్తి ఈ నాడి ద్వారా ప్రవహిస్తుంది.

- **పింగళ నాడి:** పింగళ నాడి వెన్నెముక కుడి వైపున, క్రింద నుండి 'ఆజ్ఞా చక్రము' వరకూ ఉంటుంది. ఇది ఆజ్ఞా చక్రము వద్ద సుషుమ్న నాడితో కలుస్తుంది. ఎడమ ముక్కు రంధ్రము ద్వారా ఊపిరి లోపలకు తీసుకుని, ఊపిరి వదులుతున్నప్పుడు కుడి ముక్కు రంధ్రము ద్వారా ఊపిరి బలముగా బయటకు వచ్చినట్లయితే కుండలిని శక్తి పింగళ నాడి ద్వారా ప్రవహిస్తున్నట్లు. అధికమైన ఉత్సాహకార్యములు చేయునప్పుడు కుండలిని శక్తి ఈ నాడి ద్వారా ప్రవహిస్తుంది.
- **సుషుమ్న నాడి:** సుషుమ్న నాడి వెన్నెముక మధ్యలో క్రింద నుండి కపాలము లేక పుఱ్ఱె క్రింద (మెదడు) 'సహస్రార చక్రము' వరకూ ఉంటుంది. ఇడ మరియు పింగళ నాడులు ఆజ్ఞా చక్రము వద్ద ఈ సుషుమ్న నాడితో కలుస్తాయి. సాధారణముగా ఈ నాడి మూసివేయబడి ఉంటుంది. కుండలిని శక్తి జాగృతము అయినప్పుడు కుండలిని శక్తి ఈ నాడి ద్వారా పైకి సహస్రార చక్రము వరకూ ప్రవహిస్తుంది.

**దైవ చక్రములు:** ఆరు దైవ చక్రములు ఉన్నవి. ఈ చక్రముల ద్వారా కుండలిని శక్తి పైకువెళ్ళుతున్న కొలదీ ఆధ్యాత్మిక స్థాయి పెరుగుతుంది:

❖ **మూలాధార చక్రము:** వెన్నెముక క్రింద (మొదటి భాగములో) ఉంటుంది. పృధివీ స్థానము. 4 దళములు, బీజాక్షరము 'క్లీం'.

❖ **స్వాధిష్ఠాన చక్రము:** జననేంద్రియ మూలము వద్ద ఉంటుంది. జల స్థానము. 6 దళములు, బీజాక్షరము 'వం'.

❖ **మణిపూరక చక్రము:** నాభి స్థానము వద్ద ఉంటుంది. అగ్ని స్థానము. 10 దళములు, బీజాక్షరము 'రం'.

❖ **అనాహత చక్రము:** హృదయ స్థానము వద్ద ఉంటుంది. వాయు స్థానము. 12 దళములు, బీజాక్షరము 'యం'.

❖ **విశుద్ధ చక్రము:** గొంతు స్థానము వద్ద ఉంటుంది. ఆకాశ స్థానము. 16 దళములు, బీజాక్షరము 'హం'.

❖ **ఆజ్ఞా చక్రము:** రెండు కనుబొమ్మలు మధ్య స్థానము వద్ద ఉంటుంది. మహాప్రకృతి స్థానము. 2 దళములు, బీజాక్షరము 'హ్రీం'.

❖ **సహస్రారము:** కపాలము లేక పుఱ్ఱె క్రింద (మెదడు) స్థానము వద్ద ఉంటుంది. పరమాత్మ స్థానము. 1000 దళములు, బీజాక్షరము 'ఓం'.

**ఆకాశము:** ఆకాశము మూడు స్థాయిలలో ఉన్నది:

❖ **మహాఆకాశము లేదా పంచభూత ఆకాశము:** మహాఆకాశము పంచభూతములతో తయారుచేయబడ్డ ఆకాశము. భూమి, గ్రహములు మరియు నక్షత్రములను మొదలైనవి ఆవరించి ఉన్నది. వైశ్వానర (జాగ్రదవస్థ) మహాఆకాశము స్థాయిలో ఉంటుంది.

❖ **చిత్తాకాశము లేదా దహరాకాశము:** చిత్తాకాశము తైజస (మానసిక, స్వప్న, కల్పనలలో) స్థాయిలో ఉంటుంది.

- **చిదాకాశము లేదా పరాకాశము:** చిదాకాశము ప్రజ్ఞ లేక జ్ఞాన (కుండలిని శక్తి మేల్కొని సుషుమ్న నాడిలో ప్రయాణించే సమయములో) స్థాయిలో ఉంటుంది.

పైన వివరించిన మూడు స్థాయిలకు అతీతము: కుండలిని శక్తి సహస్రారమునకు చేరిన, వర్ణనా తీతమైన, వ్యవహారమునకు, గ్రహించుటకు వీలుకాని ఆత్మజ్ఞానముతో తురీయ స్థాయిలో ఉంటుంది.



# మంత్రములు

మంత్రము, '**మన్**' అనగా మనస్సులో (రహస్యముగా) ధ్యానము చేసిన, '**త్ర**' అనగా మాయా ప్రపంచములోని ప్రమాదముల నుండి రక్షణ కల్పించును. మంత్రములలో ప్రత్యేకమైన కంపనలతో, పౌనఃపున్యాలతో కూడిన శక్తివంతమైన అక్షరములు, పదములు లేదా శ్లోకములు ఏర్పాటు చేయబడినవి. విజ్ఞాన శాస్త్రములో కూడా విస్తరణ మరియు సంకోచము సిద్ధాంతము ప్రకారము, గుండె యొక్క స్థిర ప్రవాహమువలె, విశ్వమంతా లయబద్ధమైన కంపనలతో, పౌనఃపున్యాలతో ఉంటుంది. హిందూ ధర్మములో దీనిని 'స్పందన' అంటారు. మంత్రముల ద్వారా మనలోని స్పందనలను, విశ్వములోని నిర్దిష్టమైన దైవ శక్తి స్పందనలతో అనుసంధానము చేసిన వారి రక్షణ కలుగును. భగవంతుని అనుగ్రహము కలిగిన మహర్షులు, బీజాక్షరములలో వారి తపశక్తిని నిక్షిప్తపరచి (అప్పుడే అవి శక్తివంతమైన మంత్రములు అగును), మంత్రముల ద్వారా ప్రజలకు అందచేసినారు. మంత్రములను గురువు ద్వారా బోధింపబడి, వాటిని మనస్సులో (రహస్యముగా) ధ్యానము చేసినప్పుడే అవి శక్తివంతమైన మంత్రములు అవును. అవే పదములు పుస్తకముల ద్వారా నేర్చుకొని, సాధన చేసిన అవి కేవలము అక్షరములే తప్ప శక్తిగల మంత్రములు కాజాలవు. మంత్రముల యొక్క ఉచ్చరణ, ధ్వని, కంపనలలో ఏదైనా స్వల్పముగానైనా లోపము ఉన్నట్లయితే, అది ప్రయోజనము కంటే ప్రతికూల ప్రభావములు కలిగి ఉంటుంది.

## బీజాక్షరములు

**బీజ** అనగా విత్తనము లేదా మూలము, **అక్షరము** అనగా నాశనము లేనిది. బీజాక్షరములు, ఒక అక్షరము లేదా కొన్ని అక్షరముల సమ్మేళనము లేదా కొన్ని పదముల సమ్మేళనము కలిగి ఉండవచ్చును. సంస్కృత భాషలో 50 అక్షరములు (अ (అ) నుండి अः (అః) వరకు 16; क (క) నుండి म (మ) వరకు 25; य (య) నుండి ह (హ) వరకు 9 (మొత్తము 50) ఉన్నవి. అక్షమాలలో, 50 చిన్న పూసలు (అన్ని పూసలు రుద్రాక్ష గాని స్పటిక గాని తులసి గాని ఉండవలెను. వీటి మిశ్రమము ఉండకూడదు). తరువాత ఒక పెద్దపూస क्ष (క్ష) అక్షరమును సూచిస్తుంది. ప్రతి పూస ఒక అక్షరమును, దానికి సంబంధించిన దైవమును సూచిస్తుంది, మరియు ఆ అక్షరమునకు సంబంధించిన మంత్రమును మనస్సులో పునరావృతము చేయవలెను. వాటి అర్థము ఆధ్యాత్మికము, సూక్ష్మము మరియు దైవశక్తివంతమైనవి. అన్ని బీజ మంత్రములలో '**ఓం**' అత్యుత్తమమైనది. కొన్ని బీజ మంత్రములు '**ఓం ఐం హ్రీం శ్రీం**' శ్రీవిద్య; '**హ్రీం**' భువనేశ్వరి, త్రిపురసుందరి, మహామాయ; '**డం**' దుర్గాదేవి; '**క్రీం**' మహాకాళి; '**శ్రీం**' మహాలక్ష్మిదేవి; '**ఐం**' మహాసరస్వతిదేవి; '**హౌం**' లేదా '**హుం**' మహేశ్వరుడు; '**క్లీం**' శ్రీకృష్ణ; '**గం**' గణపతి; '**హం**' ఆకాశము; '**యం**' వాయువు; '**రం**' అగ్ని; '**వం**' జలము; '**లం**' భూమి సూచిస్తాయి.

## ఓం

'**ఓం**' కారము, (అనగా రక్షణ, సంస్కరణ, పోషణ) పరబ్రహ్మము హృదయ కుహరము నుండి ప్రవహిస్తుంది.

**'ఓం'** కారము, **'ప్రణవము'** (పరమాత్ముని పేరు), **'ఉద్గీత'** (సామవేదము ప్రకారము గానము చేయుట). **"ఓమి త్యేత దక్షర మిదగ్ం సర్వం"** ('ఓమ్' అనే అక్షరమే (జడచేతనాత్మకమగు) యిది సర్వస్వము (మాండూక్యోప నిషత్ - 1). మాండూక్యోప నిషత్, తైత్తిరీయోప నిషత్, ఛాందోగ్యోప నిషత్ (పేజి సంఖ్యలు 115 నుండి 119, 122, 123 వరకు చూడుము) **"ఓం:** గురించి విస్తృతముగ వర్ణిస్తాయి. **<u>అర్థము:</u>** 'ఓం' అనగా భూత, వర్తమాన, భావిష్యత్కాలముల మొత్తమంతయునూ, ఇదే కాక త్రికాలాతీత మైనదేదయితే ఉన్నదో అదికూడా ఓంకారమే. ఇది సృష్టి సమయమున వచ్చిన మొదటి శబ్దము. ఇది పరబ్రహ్మము, ఈశ్వరుడు, పరమాత్ముడు, హిందూ ధర్మము యొక్క చిహ్నము. ఇది వేదముల బీజము (భాగవత మహాత్మ్యము (పద్మ పురాణము నుండి సంగ్రహించిన) విస్తృత వివరణ 3 : 34; భగవద్గీత 9 : 17). ఇది వేదముల అంతిమ సత్యము, సారము. ఓం యొక్క ప్రాతినిధ్యములు:

- **మూడు దశలు:** కారణము (మహామాయ, అజ్ఞానము), కారకము (పరమాత్మ, సూక్ష్మమైన జ్ఞానము), కార్యము (జీవాత్మ, సృష్టి).
- **మూడు వేదములు:** ఋగ్వేదము, సామవేదము, యజుర్వేదము.
- **మూడు అంశలు:** పరబ్రహ్మము యొక్క మూడు అంశలు, త్రిమూర్తులు అనగా, పరమపిత బ్రహ్మ (మన బ్రహ్మాండ వ్యవస్థ సృష్టికర్త), విష్ణుమూర్తి (సృష్టి సంరక్షకుడు), మరియు పరమేశ్వరుడు (శివుడు) (సృష్టి లయకారకుడు).
- **మూడు గుణములు:** సత్వగుణము (ప్రశాంతత), రజోగుణము (చర్య) మరియు తమోగుణము (నాశనము).

* **మూడు అవస్థలు (స్థితులు):** జాగృతి (స్పృహ), స్వప్న (ఉప స్పృహ) మరియు సుషుప్తి (ఘాఢ నిద్ర,, అవ్యక్తచేతనము).
* **మూడు లోకములు:** పాతాళలోకము (భూమి క్రింద), భూలోకము, స్వర్గలోకము (భూమి పైన).
* **మూడు ప్రక్రియలు:** వచ్చుట (పుట్టుట), ఉండుట (జీవించుట), పోవుట (మరణము).

## గాయత్రి మహామంత్రము

గాయత్రి మహామంత్రము మహర్షి విశ్వామిత్ర (మంత్ర ద్రష్ట) ద్వారా మానవులకు వెల్లడింపబడినది. గాయత్రిదేవి వేదములకు తల్లి (పద్మ పురాణము నుండి సంగ్రహించిన) విస్తృత వివరణ 3 : 34). ఇది ఋగ్వేదములోని ప్రార్థన. గాయత్రిదేవికి మూడు నామములు, గాయత్రి (ఇంద్రియముల అధిదేవత), సరస్వతి (వాక్దేవత) మరియు సావిత్రి (ప్రాణశక్తి అధిదేవత మరియు సత్యము) ఉన్నవి. ఈ మూడు త్రికరణములను (మనస్సు, మాట, క్రియ) సూచిస్తాయి. ఈ సృష్టి యొక్క ప్రధాన మూలము పరమాత్మని సర్వశ్రేష్ఠ దివ్యశక్తి. ఆ శక్తియే గాయత్రి. ఈ విశ్వమంతా ఆ సర్వశ్రేష్ఠ దివ్యశక్తి నుండే సృష్టింపబదినది, మరలా ఆ శక్తిలోనే విలీనము అవుతుంది. ఆ సర్వశ్రేష్ఠ దివ్యశక్తిని సూర్యనారాయణుడు రూపములో చూడవలెను. సూర్యనారాయణుడు తన సర్వశ్రేష్ఠ దివ్యశక్తితో సర్వ జీవులకు జీవశక్తి ప్రసాదిస్తున్నారు. గాయత్రి మహామంత్రము సూర్యనారాయణుడను ఉద్దేశించి చేసే ప్రార్థన. ఈ మంత్రమును నిర్దిష్టమైన ఉచ్చారణ, ధ్వని కంపనములు, లయ మరియు పౌనఃపున్యములతో జపించిన, యిది

అనంతమైన శక్తివంతమైన సూత్రము. ఈ మంత్రము సూక్ష్మ కర్మలను పవిత్రముచేసి, ఆధ్యాత్మిక జ్ఞానోదయము కలిగి, ఆత్మానుభూతి పొందవచ్చును. ఈ మంత్రము ఆరు దైవ చక్రములు వద్ద కుండలిని శక్తిని సక్రియము చేసి, ఆరు ఉన్నత ఆధ్యాత్మిక లోకములతో అనుసంధానము చేయును (ఋగ్వేదము 3 : 57 : 10; బృహదారణ్యకోప నిషత్ 5 లేదా 7 : 14 : 1, 2, 3, 4). పవిత్రమైన గాయత్రి మహామంత్రము:

**'ఓం భు భువః సువః'** - పరమాత్మా - భూలోకము, భువర్లోకము (అంతఃరిక్షము = భూమి నుండి సూర్యుని వరకు), స్వర్గలోకము

గాయత్రి మంత్రము (చందస్సులో) మూడు పాదములు, ఒకొక్క పాదమునకు 8 అక్షరములు ఉండును. మొత్తము 24 అక్షరములు.

**"తత్ సవితుర్ వరేణ్యం,**

**భర్గో దేవస్య ధీమహి,**

**ధియో యో నః ప్రచోదయాత్"**

- **గాయత్రి మంత్రము అర్థము:** మేము పూజ్యమైన, కీర్తిగల, ప్రకాశవంతమైన సూర్యభగవానుని ధ్యానము చేయుచున్నాము. ఆయన మా మేధస్సును స్ఫూర్తి గావించుగాక.
- **గాయత్రి మంత్రము యొక్క అంతఃరార్థము:** మొదటి పాదము మూడులోకముల (భూమి, ఆకాశము, స్వర్గము) స్థూల ప్రపంచముల సారము. రెండవ పాదము మూడు

వేదముల (ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము) జ్ఞాన సారము. మూడవ పాదము ప్రాణత్రయము (ప్రాణము, అపానము, వ్యానము) ప్రాణి సమూహము సారము. ఆ పిమ్మట నాల్గోవ పాదము (అక్షరము లేనిది) దర్శిత పాదము ప్రత్యక్షమగు సూర్యమండలము 'శ్రుతి' తురీయమనునట్టి సత్యమునందు ప్రతిష్టితయై యున్నది.

## పంచదశీ మహామంత్రము (అనగా పదిహేను అక్షరముల శ్రీ లలితామాత) (త్రిపురోప నిషత్ - 3):

పంచదశీ మహామంత్రము చాలా రహస్యమైనది మరియు చాలా శక్తివంతమైన మంత్రము. ఈ మంత్రమును అనువదించుట అసాధ్యము. ఈ మంత్రమును మూడు భాగములుగా విభజించవచ్చును:

- (1) **క** (2) **ఏ** (3) **ఈ** (4) **ల** (5) **హ్రీం** (6) **హ** (7) **స** (8) **క** (9) **హ** (10) **ల** (11) **హ్రీం** (12) **స** (13) **క** (14) **ల** (15) **హ్రీం**.
- **వాక్భవ కూటము (వాక్కుభావము యొక్క మూలము):** (1) **'క'** = కామః (మహాశివుడు సృష్టికర్త పరబ్రహ్మమువలె), (2) **'ఏ'** = యోని (సుద్ధ చైతన్యము, జ్ఞానశక్తిదేవత మహాసరస్వతిదేవి), (3) **'ఈ'** = కామకళా (విశ్వమును సృష్టించవలెనని కోరిక), (4) **'ల'** = వజ్రపాణిః (దేవేంద్రుడు - విజయమునకు సంకేతము), (5) **'హ్రీం'** = గుహా (సృష్టి - శివ, శక్తి సంయోగము).
- **కామరాజ కూటము (రక్షిణ మరియు అన్ని కోరికలు, అవసరమైన పదార్థము మరియు ఆధ్యాత్మిక శక్తి,**

**ప్రసాదించే మూలము):** (6) **'హ'** (హానిచేయుట, మోహోద్రేకము) జీవితము భరించుట మరియు శత్రువులను ఓడించుట లేదా జయించుట. (7) **'స'** (సంపద అనుభవించుట, సంతానోత్పత్తిచేయుట). (8) **'క'** (కామము) ప్రపంచము గురించి ఆలోచిస్తూ మనస్సులో ఆందోళన చెందుట. (9) **'హ'** (హంస) ప్రేమ, శక్తి, తీవ్రమైన లైంగిక వాంఛ, భయము, ప్రాణము మధ్య విచక్షణ చూపుట మరియు శౌర్యము, సంపద, కోరికలు మొదలైనవి పొందుటకు సాధన. (10) **'ల'** (ఇంద్రుడు) ఆనందము, అనుభవించుట మరియు అన్ని ఇతర దేవతలు (శక్తులను) నియంత్రించుట.

- **శక్తి కూటము (అంతిమ శక్తి):** (11) **'హ్రీం'** (గుహ) శివ మరియు శక్తి కలిసి విశ్వమునకు రక్షణ మరియు పోషణ చేయుట. (12) **'స'** (పర) సర్వోత్కృష్టమైన, మూలమైన దేవత అనంతకోటి విశ్వములుగా పరిణామము చెందుట. (13) **'క'** (కోరిక) పరా శక్తి సహాయముతో శివుని నుండి ఈ విశ్వములన్నీ ఉద్భవించుట. (14) **'ల'** (హర) శక్తి లేని శివుడు, జీవములేని శరీరము (శవము) వంటిది. (15) **'హ్రీం'** (మహామాయ) శివ, శక్తి - కోరికలకు కోరికలు నెఱవేర్చుట, దైవ సంయోగము మరియు కోరికలకు విముక్తి.

  **<u>గమనిక:</u>** పైన వివరించి 15 బీజాక్షర మహామంత్రము తరువాత 16 వ బీజాక్షర మంత్రము **'శ్రీం'** (మహాలక్ష్మిదేవి) ను జోడించిన అప్పుడు షోడశీ (16 బీజాక్షరముల) మహామంత్రము అవుతుంది.

**పంచాక్షరి (ఐదు అక్షరములు) మహామంత్రము:**

'**నమః శివాయ**'. పంచాక్షరి మహామంత్రమునకు ముందు '**ఓం**' చేర్చిన అప్పుడు ఆరు అక్షరముల మహామంత్రము అవును. అర్థము: ఈ మంత్రమునకు అనేక ఆధ్యాత్మిక అర్థములు ఉన్నవి. అవి పంచ మహాభూతములు, పంచ కోశములు సూచిస్తాయి. 'శివ' అనగా శుభము కలుగచేయునది. ఈ మంత్రము యొక్క సాధారణ **అర్థము**: "అశుభములను తొలగించే, అన్ని శుభములకు కారకుడైన, శుభప్రదమైన శివునకు, నేను అనేక నమస్కారములు చేయుచున్నాను".

**అష్టాక్షరి (ఎనిమిది అక్షరముల) మహామంత్రము:**

'**ఓం నమో నారాయణాయ**'. అష్టాక్షరి మహామంత్రమునకు అనేక ఆధ్యాత్మిక అర్థములు ఉన్నవి. **అర్థము:** 'నార' అనగా నీరు, జీవులు. 'అయన' అనగా మార్గము, వ్యాపించుట, ప్రవహించుట, విశ్రాంతి ప్రదేశము. ఈ మంత్రము యొక్క సాధారణ అర్థము "విశ్వమంతటా వ్యాపించిన, జీవులందరిలోనూ ప్రవహిస్తున్న, జీవులందరికీ ఆశ్రమమైన, అత్యంత శుభప్రదమైన నారాయణనకు, నేను నమస్కారములు చేయుచున్నాను".

**మహామృత్యుంజయ/రుద్ర/త్రయంబక మంత్రము:**

**"ఓం, త్రయంబకం యజమహే**
**సుగంధిం పుష్టివర్ధనం**
**ఉర్వారుకం ఇవ బంధనాన్**
**మృత్యోర్ ముక్షీయ మామృతాత్"**

ఈ మంత్రము ఋక్వేదము మరియు శివపురాణములో ఉన్నది. **అర్ధము:** ఓం, మూడు కళ్ళు కలిగి ఉన్న (ఈశ్వరుడు), సర్వజ్ఞుడైన, సువాసనలనే జ్ఞానమును వేదచల్లే, అందరినీ పోషించే, ఈశ్వరా; రోగములు, అనుబంధము మరియు మృత్యువులతో ఉన్న మమ్ము వాటినుండి విముక్తి చేసి, అమరత్వము ప్రసాదించి నీలో ఐక్యత అనుగ్రహించుముగాక.

## శాంతి మంత్రములు, ప్రార్ధనలు

- **"ఆసతో మా సద్గమయ,
తమసో మా జ్యోతిర్గమయ,
మృత్యోర్మా అమృతం గమయ !!
ఓం శాంతిః శాంతిః శాంతిః !!"**
(బృహదారణ్యకోప నిషత్ 1 లేదా 3 : 3 : 28).

**అర్ధము:** 1. నన్ను అసత్యము నుండి సత్యమునకు, చీకటి నుండి వెలుగునకు, మరణము నుండి అమృతత్వమునకు నడిపించుము. త్రివిధ తాపములు (ఆదిఅధ్యాత్మిక (భౌతిక బాధలు), ఆదిభూత (ఇతర జీవుల నుండి బాధలు), ఆదిదైవిక (దైవిక బాధలు-వరదలు, భూకంపములు) శాంతింపబడును గాక. 2. మృత్యువే అసత్తు. సత్తే అమృతము. మృత్యువును దాటించి నాకు అమృతమును యిమ్ము. త్రివిధ తాపములు శాంతింపబడును గాక.

- **"ఓం పూర్ణ మదః పూర్ణ మిదం,
పూర్ణా త్పూర్ణ ముదచ్యతే,
పూర్ణస్య పూర్ణ మాదాయ,
పూర్ణమే వావష్యతే !!**

**ఓం శాంతిః శాంతిః శాంతిః !!"**
(శుక్లయజుర్వేదాంతర్గత శాంతి మంత్రము).

**అర్ధము:** అయ్యేది (పరబ్రహ్మము) సంపూర్ణమైనది, ఇయ్యేదికూడా (ఆత్మాకూడా) సంపూర్ణమే, పూర్ణము నుండియే పూర్ణము పుట్టుచున్నది. పూర్ణమునుండి పూర్ణము తీసుకొనిననూ తిరిగి పూర్ణమే మిగులుచున్నది. త్రివిధ తాపములు శాంతింపబడును గాక.

**"ఓం సహనావవతు, సహనౌ భునక్తు,**
**సహ వీర్యం కరవావహై**
**తేజస్వి నావధీత మస్తు, మావిద్విషావహై!!**
**ఓం శాంతిః శాంతిః శాంతిః !!"**
(కృష్ణయజుర్వేదాంతర్గత శాంతి మంత్రము).

**అర్ధము:** మమ్ము (గురు శిష్యులమగు) ఆ పరమాత్మ రక్షించుగాక. మాకు పోషనమును కలుగుచేయుగాక. మేము కలిసి విద్యకు సామర్ధ్యమును కలుగ జేయుదముగాక. మా చదివిన విద్య తేజస్వంతమగుగాక. మేము పరస్పరము ద్వేషింపక యుందుముగాక. త్రివిధ తాపములు శాంతింపబడును గాక.

## స్తోత్రములు

స్తోత్రము అనగా పరబ్రహ్మము యొక్క వివిధ రూపములలో ఉన్న దేవత లేక దేముడు యొక్క నామ, రూప, గుణములు, లీలలను శక్తివంతమైన మంత్రములతో వర్ణిస్తూ భక్తుడు చేసే ప్రార్ధన. ఆ ప్రార్ధనలకు వారు సంతోషించి, భక్తుడను

దీవిస్తూ వారి కృపను ఆ భక్తుడిపై చూపిస్తారు. ముఖ్యమైన స్తోత్రములు:

- **శ్రీ లలితా రహస్య సహస్రనామ స్తోత్రము:** లలితాదేవి, పరబ్రహ్మము యొక్క స్త్రీ శక్తి. పరబ్రహ్మము సృష్టి సంకల్పము సమయమున ఆయని చిత్ - శక్తి (వ్యక్తిగత అత్యంత మహాశక్తి, మహామాయ) లలితాదేవితో ఈ విశ్వములన్నియూ సృష్టింపబడినవి. ఆ మాహాపరిషత్తుకు కోట్లకొలదీ లక్ష్మినారాయణులూ, శివపార్వతులూ, సరస్వతీబ్రహ్మలూ, సనకాదులతో కూడిన సిద్ధులూ, దేవ సమూహములూ, నానారూపములలో బహుశక్తుల సమూహములూ (ఆ శక్తుల సంఖ్య చెప్పటము కష్టము), వ్యాసుడు మొదలుగా గల మానవసంఘాలూ తద్దర్శనార్థం వచ్చారు. జ్ఞానశక్తి అయిన మహాసరస్వతిదేవి వాసినిలు, 8 వశిన్యాది గీర్వాణీ దేవతలు, రచించిన లలితాంబికా పేరుగా సహస్రనామావళులను (శ్రీ లలితాదేవి యొక్క 1000 అనగా "**అనంతము**" రూపములు, పేర్లు, లక్షణములు, లీలలు అత్యంత శక్తివంతమైన మంత్రములతో ప్రార్థన) కీర్తించారు. ఆ కీర్తనకు శ్రీ లలితాంబ విశేష సంతోషదాయకమై రహస్యార్థములతో కూడిన ఈ దివ్యనామావళిని సర్వదా పఠిస్తూండండి. ఇది నా ఆజ్ఞ. మీరు శిరసావహించండి. ఈ దివ్యనామావళిని,విష్ణుమూర్తి అవతారమైన శ్రీహయగ్రీవుడు, మహర్షి అగస్త్యునికి ఉపదేశము చేసినారు. ఇది బ్రహ్మాండ పురాణములో, ఉత్తర ఖండములో ఉన్నది.

- **శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రము:** శ్రీ విష్ణు సహస్రనామ

స్తోత్రము మొదట సనక (పరమపిత బ్రహ్మ యొక్క మానస పుత్రుడు) స్వరపరిచారు. మహాభారతము యొక్క అనుశాసనిక పర్వములో ఉన్నది. మహాభారతము యుద్ధము అనంతరము, శ్రీకృష్ణుడుతో సహా పాండవులు ఓఘవతి నది వద్ద అంపశయ్యపై (బాణములు యొక్క మంచము) మృత్యువు కోసము వేచిఉన్న భీష్ముడు (ధర్మమునకు ప్రతీక) దగ్గరకు వెళ్లినప్పుడు, భీష్ముడు శ్రీకృష్ణుని భక్తితో విష్ణు సహస్రనామములతో స్తుతిస్తారు.

❖ **శ్రీ శివ సహస్రనామ స్తోత్రము:** శ్రీ శివ సహస్రనామ స్తోత్రము రెండు హిందూ ధర్మ పవిత్ర గ్రంధములలో ఉన్నవి. లింగ పురాణములో మహర్షి మార్కండేయుడు శ్రీకృష్ణునకు బోధించారు. మహాభారతము యొక్క అనుశాసనిక పర్వములో కూడా ఉన్నది. భీష్ముడు శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రము స్తుతించిన తరువాత, ధర్మరాజు భీష్ముని శ్రీశివ సహస్రనామ స్తోత్రము కూడా చెప్పమని అభ్యర్థించారు. కాని భీష్ముడు తన అశక్తతను వ్యక్తము చేయగా, శ్రీ కృష్ణుడు శ్రీశివ సహస్రనామ స్తోత్రమును ధర్మరాజునకు బోధిస్తారు.

**"శివాయ విష్ణురూపాయ,**
**విష్ణువే శివ రూపిణే,**
**శివస్య హృదయం విష్ణు,**
**విష్ణోస్చ హృదయం శివః"**
(పద్మ పురాణము, రుద్రహృదయోప నిషత్ - 2).

# తంత్రములు

"**తంత్రము**" అనగా కలుపుట. తంత్రముల ద్వారా కలిగే శక్తులను స్వార్ధము కొఱకు దుర్వినియోగము చేసుకునేందుకు కొందరు మధ్యకాలములో (క్రీ.శ. 500 నుండి 1,800 మధ్యలో) ప్రజలలోనికి ప్రాచారము చేశారు. ప్రస్తుత కాలములో వేద క్రమశిక్షణ, మంత్రములు, సూత్రములను అనుసరించుట కష్టమని, సులభ మార్గముగా తాంత్రిక పూజాపద్ధతి, ఉపాసన ప్రారంభిచారు. 92 తంత్రములు (64 భైరవ తంత్రములు, 18 రుద్ర తంత్రములు, 10 శివ తంత్రములు) ఉన్నవి. తాంత్రిక విధానము శైవ ఆగమలు, వైష్ణవ పంచరత్ర సంహితలు, శక్తి (దైవ మాత) త్రంత్రములుగా విభజించబడినవి. మహామాయ సత్యమును మరుగపరచి, అసత్యమును సత్యముగా, ద్వందములను (మంచి, చెడు; సంతోషము, దుఃఖము) ప్రదర్శిస్తుంది. సృష్టి, పరిణామము (బయటకు వచ్చుట) మహామాయ పనితీరులో సగభాగము మాత్రమే. ప్రళయము, వేలీనము, లోనికి మెలిపడుట, లోనికి వచ్చుట, మిగిలిన సగభాగము ద్వారా జీవాత్మ, తన మూలమైన పరమాత్మలో ఐక్యత పొందుట మిగిలిన సగభాగము. క్రింది వివరించిన తంత్ర పూజలు (మధ్యరాత్రిలో శ్మశానములలో చేయుట) ద్వారా క్షుద్ర శక్తునలు (రజో, తమో గుణముల ప్రవృత్తులు) పొంది ఇతరులకు హానిచేయుటకు ఉపయోగించేవారు.

- **ఆకర్షణ తంత్ర పూజ:** ఇతర వ్యక్తులను ఆకర్షించుట కొఱకు.
- **వికర్షణ తంత్ర పూజ:** ఇతర వ్యక్తులను తిరస్కరించుట కొఱకు.

- **భూత, ప్రేత, పిశాచ తంత్ర పూజ:** ప్రతికూల శక్తులు తొలగించుట కొఱకు.
- **మరణ తంత్ర పూజ:** ఇతర వ్యక్తులను చంపుట కొఱకు.
- **వశీకరణ తంత్ర పూజ:** ఇతర వ్యక్తులను లోబరుచుకొనుటకు.

పరమాత్ముడను పురుషుడు మరియు స్త్రీ గా భావించి, పురుషుడైతే పరమేశ్వరుడు (శివుడుగానూ), స్త్రీ అయితే శక్తి (పార్వతిదేవిగానూ) చూపబడ్డాడు. శివుడు సంభావ్యశక్తిగానూ, పార్వతీదేవి సృజనాత్మక శక్తిగానూ భావిస్తారు. శివుడు క్రియాశీలుడు అయితే, ఆయనను శక్తిగానూ, పార్వతిదేవి అక్రియాశీలమైతే, ఆమెను శివుడుగానూ అంటారు. తంత్రముల ప్రకారము విశ్వము యొక్క సృజనాత్మక సూత్రము శివ, పార్వతుల సంయోగము. పార్వతిదేవి, శివుని నుండి వేరుకాదు, శివునియొక్క శక్తియే పార్వతిదేవి. తంత్రములలో శివుడు, పార్వతీదేవి మధ్య సంభాషణలు రూపములో ఉన్నవి. శివుడు ఆధ్యాత్మిక బోధనలను చెప్పుచుండగా పార్వతీదేవి వినేపాత్రలో ఉన్నప్పుడు 'ఆగమలు' అంటారు. పార్వతీదేవి ఆధ్యాత్మిక బోధనలను చెప్పుచుండగా శివుడు వినేపాత్రలో ఉన్నప్పుడు 'నిగమలు' అంటారు. కొన్ని ప్రసిద్ధ తంత్ర గ్రంథములు: (ఎ) మహానిర్వాణ, (బి) కులార్ణవ, (సి) కులాస్రర, (డి) ప్రపంచసార, (ఇ) రుద్ర యామల, (ఎఫ్) విష్ణు యామల, (జి) బ్రహ్మ యామల, (ఎహ్) తంత్ర రాజ. అన్ని తంత్రముల సారాంశము స్వతంత్ర తంత్రములో ఉన్నది. దేవాలయముల నిర్మాణములు, దేవతల విగ్రహ ప్రతిష్ట, దేవాలయముల నిర్వహణ, రేఖాగణిత

మండలములు ఏర్పాటు ఆగమ శాస్త్రములను పాటిస్తారు. పరమాత్ముడు (సత్ – చిత్ -ఆనంద) అనగా, సత్యము, జ్ఞానము మరియు పరమానందస్వరూపుడు అనుసంధానము చేసిన కోరికలనుండి విముక్తి పొంది, ప్రాపంచిక విషయములను త్యజించి, కర్మ బంధములను నుండి విముక్తుడై, చివరకు జనన, మరణ, పునర్జన్మల చక్రమునుండి విముక్తి పొంది, పరమాతుముని కృపతో పరమాత్ముని అనుభవము కలిగి నిత్యపరమానంద స్థితిలో ఉంటారు.

## మహానిర్వాణ తంత్రము

ఎవరైతే పవిత్రమైన **'ఓం తత్ సత్'** మనస్ఫూర్తిగా తలచుకుని ఏచర్య తలపెట్టినా అది నిర్విఘ్నముగా సఫలము అవుతుంది (14 : 154, 155). గృహస్తులకు 'ప్రవృత్తి మార్గము', సన్యాసులకు 'నివృత్తి మార్గము' సూచించారు.

## ప్రవృత్తి మార్గము

- ఎప్పుడూ సత్యమునే మాట్లాడటవలెను.
- స్వకర్మలు చేస్తూ, కర్మఫలములు ఆశించకుండా పరమాత్మునకు సమర్పించవలెను.
- జీవనోపాదిని ధర్మబద్ధముగా ఆర్జించవలెను.
- జీవితము పేదలకు, నిస్సహాయకులకు, పరమాత్మ సేవ కొఱకు ఉద్దేశించబడినది.
- తల్లిదండ్రులు, గురువు, అతిధిలను పరమాత్ముని ప్రత్యక్ష ప్రతినిధులుగా భావించవలెను.
- ధర్మము కోసము ఉత్సాహముగా, ధైర్యముగా పోరాడవలెను.

- ❖ జాగ్రత్తగా మంచి స్నేహితులను ఎంచుకొనవలెను.
- ❖ భార్యతో విశ్వసనీయతతో ఉండి, ప్రేమ, అపాయతతో చూసుకొనవలెను. ఆమెమీద కోపము చూపరాదు.
- ❖ పిల్లలను ప్రేమతో పెంచి, విద్యాబుద్ధులు నేర్పి, వారికి వివాహము చేయవలెను.
- ❖ సోదరులు, సోదరీమణులు, బంధువులు (పేదవారయితే) వారికి సహాయము చేయవలెను.
- ❖ తమ కీర్తి, సంపద, అధికారము, స్థానము, పేదరికము గురించి ఎవ్వతోనూ చెప్పకూడదు.
- ❖ శరీరము, మనస్సును పరిశుభ్రముగా ఉంచుకొనవలెను. రూపము, ఆహారము, దుస్తులు మీద అధిక శ్రద్ధ చూపరాదు.
- ❖ సామాజిక సేవ మరియు పర్యావరణ రక్షణ చేయవలెను.

## కులార్ణవ తంత్రము

- ❖ మానవ జన్మ, పొందుట చాలా కష్టము, మోక్షము పొందుటకు ఉన్నతమైన జన్మ. దీనిని వృధా చేయకుము. మానవ జన్మ పొంది దానిని సార్ధకము చేసుకోలేనివారిపై విచారించవలెను.
- ❖ ప్రతిజీవి కర్మలు చేయకుండా ఉండలేవు. ఎవరైతే కర్మఫలమును ఆశించకుండా కర్మలు చేస్తారో వారే అసలైన సన్యాసులు.
- ❖ పరబ్రహ్మము ఆనందస్వరూపుడు. ఆ పరబ్రహ్మము ప్రతి జీవిలోనూ స్థాపించబడిఉన్నాడు.
- ❖ మంత్రములు కంటే ధ్యానము గొప్పది. దేముడు కంటే ఆత్మ గొప్పది.

- ఆత్మానుభూతి కొఱకు సాధన అన్ని పూజలు కంటే గొప్పది.
- శరీరము ఒక ఆలయము. జీవాత్మ పరమాత్ముడు. సదాశివడు పరబ్రహ్మము.



# మోక్షము

సంసారము (మహామాయ నుండి పుట్టినది, ప్రపంచము) అనగా, జీవాత్మ (కారణ, సూక్ష్మ, స్థూల శరీరములతో) జనన, మరణ, పునర్జన్మ చక్రములో తిరుగుట. మరోక విధములో జీవాత్మ, పరమాత్మని నుండి విముఖుడై, మిగిలివన్నిటితోనూ బంధము పెట్టుకొనుట. జీవాత్మ, అజ్ఞానము కారణముగా (ఇదే కారణ శరీరము), మహామాయకు ఆకర్షితుడై, తనంతటతానుగా మహామాయ యొక్క బానిసత్వమును అంగీకరించినాడు. పరమాత్మకు, జీవాత్మకు మధ్య మహామాయయే అవరోధము, అడ్డంకి. ఎవ్వరూ తమంతటతాము ఈ అవరోధము దాటలేరు. ఎవరైతే జ్ఞానమును పొంది, భక్తితో పరమాత్మనికి శరణాగతి అవుతారో, పరమాత్మనకు వారిపై కృప కలిగి, మహామాయ యొక్క అవరోధమును తొలగించగలడు. పరమాత్ముడు తన భక్తులపై కృపతో మహామాయ యొక్క బానిసత్వము నుండి విముక్తి చేయును (భాగవతము 2 : 7 : 42). పరమాత్ముడు ప్రతి జీవుల యొక్క హృదయమునందు సర్వదా నివసిస్తున్నారు (శ్వేతాశ్వతరోప నిషత్ 4 : 17). ఆయన పరమదయామయుడు, కృపానిధి, ఎల్లప్పుడూ జీవత్మతో ఉండి, తన కృపను, దైవ పరమానందమును ప్రసాదించుటకు, ఏ సమయములో జీవాత్మ తనను తెలుసుకుంటాడా అని ఎదురు చూస్తూఉంటాడు. జీవాత్మ మహామాయచే తయారుచేయబడ్డ బుద్ధి, మనస్సు, ఇంద్రియములతో తెలిసికోనలేదు. ఎవరైతే స్వాత్మభూయుడగు ఆత్మను పొందవలెనని సాధన చేయునో అట్టి జ్ఞానినే ఆత్మ స్వయముగా వరించును (కఠోప నిషత్ 1 : 2 : 23, ముండకోప నిషత్ 3 : 2 : 3, భాగవతము 10 : 14 : 38). ఎవరైతే అపారమైన

ప్రేమ, భక్తితో పరమాత్మునికి సంపూర్ణముగా శరణాగతి అవుతారో, వారు పరమాత్ముని కృపతో మహామాయ యొక్క బానిసత్వము నుండి విముక్తుడై, దైవ ఇంద్రియములు పొంది పరమాత్ముని అనుభూతి పొందగలరు (శ్వేతాశ్వతరోప నిషత్ 1 : 10, 6 : 23, భగవద్గీత 7 : 14). భక్తి, పరమాత్ముని కృప లేకుండా బ్రహ్మజ్ఞానము, పరమాత్ముని అనుభూతి ఎవ్వరూ పొందలేరు (బ్రహ్మ సూత్రములు 23 : 41). ఎవనికి విజ్ఞానమను సారధి, స్వాధీనములోనున్న మనస్సు అనుకళ్ళెమును ఉండునో, అట్టివాడు జీవితమార్గము యొక్క అంతిమగమ్యమగు సర్వవ్యాపక బ్రహ్మపదమును చేరుచున్నాడు (కఠోప నిషత్ 1 : 3 : 9). అత్మజ్ఞానవంతుడు నామరూపముల నుండి విముక్తుడై, పరాత్పరుడగు పరమాత్మలో లీనమైపోవును (ముండకోప నిషత్ 3 : 2 : 8). మను స్వయంభువ, తన మనుమడైన భక్త ధృవతో "ఎవరైతే పెద్దలయందు ఓర్పు, సహనము; తక్కువయైన, క్రిందివారిపై కనికరము, జాలి, పరితాపము, దయ; సమానమైనవారిపై స్నేహభావము; అన్ని జీవులపై సమత్వభావము ఉన్నవారిపై పరమాత్ముడు సంతోషించి, ప్రకృతి యొక్క మూడు గుణములు, వాటి పరిణామములనుండి (సూక్ష్మ శరీరము) విముక్తుడై, పరమానంద భరితుడైన పరమాత్మునిలో కలిసి ఏకమైపోతాడు" అని చెప్పినారు (భాగవతము 4 : 11 : 13, 14).

## మోక్షమునకు అర్హత

ఎవరైతే కోరికలు విసర్జించి, ఈశ్వరుని, అతని మహిమను తెలిసికోనుచున్నాడో వారు దుఃఖము నుండి విముక్తుడగుచున్నాడు (ముండకోప నిషత్ 3 : 1 : 2, శ్వేతాశ్వతరోప

నిషత్  4 : 7). జ్ఞానముకల యోగి యొక్క ఆత్మ పరబ్రహ్మమే యగుచున్నది (కఠోప నిషత్ 2 : 3 : 14). ఎవనికి అత్మ దేవునియందు పరాభక్తి కలదో, అదేరీతిగా గురువునందు భక్తి కలదో, అట్టి మహాత్మునకు ఉపదేశించిన బోధలన్నియు బాగుగా అనుభవమునకు వచ్చును, ప్రకాశించును (శ్వేతాశ్వతరోప నిషత్ 6 : 23, సుబాలోప నిషత్ 16 : 1). మానవజన్మ లభించుట చాల అరుదైన వరము. ఈ ప్రపంచములో మానవులకు దైవభక్తిగల, ధర్మనిష్ఠాపరు(డైన, గురుత్వముగల, సత్సంగము గుప్తనిధి. వారిద్వారా పవిత్రమైన ధర్మపరమైన బాధ్యలగురించి, సత్ప్రవర్తన బోధింపబడిన, పరమాత్ముడు సంతుష్టుడై మోక్షమును ప్రసాదించును (భాగవతము 11 : 2 : 29, 30).

<u>**గమనిక:**</u> సాధన చతుష్టయము (పేజి సంఖ్యలు 170, 171, 172 చూడుము).

## మోక్ష మార్గములు

- **జీవన్ ముక్తి:** అద్వైత వేదాంతము ప్రకారము జీవించుచున్నప్పుడే సంసారమునుండి మోక్షమును పొందవచ్చును. మోక్షము జ్ఞాన స్వరూపములో ఉన్నది. ఎవరైతే (ఏ) ప్రజ్ఞ (జ్ఞానము) పొందుదురో, (బి) ఎవరికైతే దేహము మరియు ప్రపంచముతో బంధన, ప్రభావితము, చింతన ఉండదో, (సి) ఎవరైతే అన్ని బంధనలను విడిచిపెట్టుదురో, (డి) ఎవరైతే తన ఆత్మతో తానూ ఎల్లప్పుడూ రమించుచుంటారో వారు బ్రహ్మవిద్య ద్వారా జీవన్ముక్తి పొందుదురు. వివిధ ధార్మిక, నైతిక విధానములు మరియు ఆరాధన (ఉపాసన) ద్వారా మనస్సు

పవిత్రమవుతుంది. దీనితో అతను ఆగామి కర్మఫలములు ఆర్జించడు. అప్పుడు గురువు బోధనలను శ్రవణ, మనన, నిధిధ్యాసనములతో, సత్యమును కప్పిఉంచిన అజ్ఞానము తొలగి అతనిలో జ్ఞానము ప్రకాశించును. అంతట అతని సంచిత కర్మఫలములు నాశనము అవును. అప్పుడు తన ఆత్మను తాను ఎరిగి, తానే పరబ్రహ్మమనే అత్మజ్ఞానముతో తనలో తాను రమించుచు ఉండును. అతనికి తన శరీరము, ప్రపంచము ఒక భ్రమగా అనిపించును. ఇంకనూ అతను, మిగిలిఉన్న అతని ప్రారబ్ధకర్మఫలములను అనుభవించవలసి ఉంటుంది. ఆతను జీవన్ముక్తుడై, అతని ప్రారబ్ధ కర్మఫలములు అతని శరీరము అనుభవిస్తున్నా ఆతను వాటి అనుభవములకు ప్రభావితుడు కాడు. అతని ప్రారబ్ధ కర్మఫలములు అంతము అయిన వెంటనే అతను ఆ శరీరమును వదలి పరమాత్మునిలో లీనమవుతాడు.

- **మోక్షము (సాంఖ్య తత్వశాస్త్రము ప్రకారము):** పురుష (ఆత్మ) స్వచ్ఛమైన చైతన్యస్వరూపము. మనస్సు, శరీరము చైతన్యరహితమైన ఆదిమ పదార్థము అనగా, ప్రకృతి (మహామాయ) యొక్క పరిణామరూపము. మనస్సు, శరీరము, పురుషుని చైతన్యము ద్వారా చైతన్వవంతమై ప్రపంచములో వ్యవహరిస్తుంది. అజ్ఞానమే పురుషుని, మహామాయ యొక్క బానిసత్వమునకు కారణము. అజ్ఞానముచేత శరీరమే పురుషుడు అనే అసత్యభావనతో మానసిక, శారీరక సుఖదుఃఖములు అనుభవించును. పురుషుడు ఎప్పుడైతే వివేక జ్ఞానము పొందునో, అప్పుడు అజ్ఞానము తొలగి ఈ మనస్సు, శరీరము తాను కాదని ధృడమై, మానసిక, శారీరక సుఖదుఃఖములకు అతీతమై, పురుషుడే పరమాత్మ అనే భావన ఏర్పడి కైవల్యము (మోక్షము) పొందును.

❖ **మోక్షము (ద్వైత వేదాంతము ప్రకారము):** ద్వైత వేదాంతము మరణానంతర మోక్షమును బోధిస్తుంది. ధార్మిక, నైతిక విధానములు, జ్ఞానము, కర్మ, భక్తి, ధ్యానము ద్వారా, వ్యక్తి మోక్షమునకు అర్హత కలుగును. ఐదు విధముల మోక్షము యొక్క స్థాయిలు (పరిమితమైనవి) ఉన్నవి. భక్తిలో అంతిమ స్థాయిలో ఉన్నవారు ఈ విధముల మోక్షములను తిరస్కరించి, పరమాత్ముని సేవయే అంతిమ లక్ష్యముగా కోరుకుంటారు (భాగవతము 3 : 29 : 13, 14):

- **సాలోక్యము:** ఆత్మ, పరమాత్మునితో సమాన లోకమందుండుట. ఆత్మ, ఇష్టలోకమునకు వెళ్లి పరమాత్ముని సమక్షమమున పరమానందము అనుభవించును. ఈ మోక్షములో అత్యంత తక్కువ స్థాయిలోనిది.
- **సార్ష్టి:** విశ్వము యొక్క సృష్టి, సంరక్షణ, ప్రళయము తప్ప పరమాత్ముని శక్తులన్నీ ఆత్మ పొందును. ఇది మోక్షములో తదుపరి ఉన్నత స్థాయి.
- **సామీప్యము లేదా సాన్నిధ్యము:** ఆత్మ, పరమాత్ముని సమక్షమున నివసించుచూ, పరమానందము ఆనందించును. ఇది మోక్షములో తదుపరి ఉన్నత స్థాయి.
- **సారూప్యము:** ఆత్మ, పరమాత్ముని వ్యక్తిగత రూపము పొంది, పరమానందము ఆనందించును. ఇది మోక్షములో తదుపరి స్థాయి.
- **సాయుజ్యము లేదా కైవల్యము:** ఆత్మ, పరమాత్మునిలో ఐక్యమయి పరమానందమే అవును. ఇది మోక్షములో తదుపరి ఉన్నత స్థాయి (ముండకోప నిషత్ 3 : 1 : 3).

భక్తులు మహామాయ లేదా ప్రకృతి యొక్క మూడు గుణములను అధిగమించుటకు, పరమాత్ముని ప్రేమానందము పొందుటకు భక్తి అత్యంత ఉన్నత మార్గము. నా భక్తులు, పైన వివరించిన మోక్షములను తిరస్కరించి, భక్తినే కోరుకుంటారు.

- **మోక్షము (విశిష్టాద్వైత వేదాంతము ప్రకారము):** విశిష్టాద్వైత వేదాంతములో జీవన్ ముక్తిపై నమ్మకము లేదు. ఈ వేదాంతము ప్రకారము, ఒకవ్యక్తి మరణము తరువాత మాత్రమే మోక్షము పొందవచ్చును. కర్మ యోగము మరియు జ్ఞాన యోగము, భక్తి యోగమునకు తోడ్పడును. భక్తి యోగము ద్వారానే, పరమాత్ముని కృపతో, మోక్షము పొందవచ్చును (బ్రహ్మ సూత్రములు 2 : 3 : 41). ఎవరైతే మోక్షము పొందుతారో, వారు దివ్య శరీరముతో, వైకుంఠములో, పరమాత్ముని సమక్షమున నివసించుచూ, పరమానందము ఆనందించును.
- **క్రమ ముక్తి:** ఎవరైతే పవిత్రమైన ఓంకార మంత్రముతో పరమాత్ముని (సగుణ, వ్యక్తిగత రూపము) గురించి కఠినమైన, తీవ్ర తపస్సును చేస్తారో, వారు మరణము తరువాత బ్రహ్మ లోకమునకు వెళ్లి అక్కడ పరమపిత బ్రహ్మ (హిరణ్యగర్భుడు) ద్వారా పరబ్రహ్మము గురించి జ్ఞానము పొందును. ఆ కల్పానంతరము, ప్రాకృతిక ప్రళయము సమయమున ఆత్మ, పరబ్రహ్మములో ఐక్యమగును.
- **పవిత్ర స్థలములు మరియు నదుల ద్వారా మోక్షము:** పురాణములు మరియు ఇతిహాసములలో అనేక పవిత్ర స్థలములు మరియు నదుల పవిత్రతను, వాటి దైవశక్తిని ప్రశంసించినారు. ఎవరైతే ఆ ప్రదేశములలో నివసించినా,

దర్శించినా, ఆ నదులలో స్నానము చేసినా వారి పాప కర్మలు నశించి, మోక్షము పొందుటకు సహకరించును.

- **పలు విధముల మోక్షము**: ఎవరి మనస్సు ఎల్లప్పుడూ పరమాత్మనిపై ఏవిధముగానైనా భక్తి, ప్రేమ, అభిమానము, ఉద్రేకము, కోపము, భయము, శత్రుత్వము లేదా ద్వేషములతో ఉన్నట్లయితే పరమాత్మ వారికి మోక్షము ప్రసాదించును (భాగవతము 7 : 1 : 25, 29, 39 నుండి 46 వరకు; 10 : 29 : 13 నుండి 16 వరకు).



# ముగింపు

## విగ్రహారాధన

పరమాత్ముని చిహ్నముగా హిందువులు అగ్నిని (చీకటిని చెదరగొట్టి, వెలుగుని, వేడిని ప్రసాదించునది. దీపమును పవిత్రతకు, జ్ఞానమునకు చిహ్నము) ఆరాధనకు ఉపయోగించుదురు. హిందువులు పరమాత్ముని విగ్రహ రూపములో ఆరాధించుదురు. ఆగమ శాస్త్రముల ప్రకారము ఆరాధనకు ప్రారంభములో విగ్రహమునకు ప్రాణప్రతిష్ఠ (పరమాత్ముని ఆహ్వానించి, విగ్రహములో స్థాపించుట). అప్పుడు ఆ విగ్రహము పరమాత్మునిగానే భావన. భక్తుడు ఉద్వాసన (పరమాత్ముని స్వస్థానమునకు పంపుట) చేసేవరకూ పరమాత్ముడు ఆ విగ్రహములో ఉండునని విశ్వాసము. దేవాలయములలో అనేక విగ్రహములు ఉన్నప్పటికీ, ఒక ముఖ్య విగ్రహములోనున్న పరమాత్ముని దేవాలయముగా భావిస్తారు. హిందువులు, దేముడులందరూనూ ఒకేఒక్క పరమాత్ముని అంశములుగా, భావిస్తారు (భగవద్గీత 7 : 6 నుండి 12; 9 : 15 నుండి 19 వరకు). హిందువులలో విశాల హృదయము, సహనము, ఓర్పులతో ఋగ్వేదము ప్రకారము ("**ఏకం సద్ విప్ర బహుద్ వదంతి**" అనగా అతను ఒక్కడే, కాని జ్ఞానులు అనేక రూప, నామములతో పిలుస్తారు), పరమాతుముడు ఒక్కడే, అయినా ఆయనకు అనేక రూప, నామములు ఉన్నవని, ఎవరు (ఏ మత, వర్ణమైనా) ఏరూప, నామములతో ఆరాధించినా ఆ ఒకేఒక్క పరమాత్ముని ఆరాధించినట్లే అని భావిస్తారు. **గమనిక:** సాలగ్రామమును (నున్నటి రాయి) విష్ణుమూర్తిగా భావిస్తారు.

## మతము (విజ్ఞానము - నమ్మకము, విశ్వాసము)

కాలక్రమేనా, సంస్కృత భాష యొక్క వాడుక తగ్గి, వివిధ ప్రాంతీయ భాషల వాడుక ఎక్కువై, సంస్కృత భాషలో ఉన్న వేదములు, ఉపనిషత్తులు, పురాణములు, ఇతిహాసముల పఠనము తగ్గి, ఆధునిక రచయితలు వివిధ స్థానిక ప్రాంతీయ భాషలలో వ్రాసిన రచనల పఠనము ఎక్కువైనది. ఆ రచనలలో ఆ ఆ రచయితల గ్రాహ్యము, స్వంత భావములు, ఆ ఆ సమయములలో ఉన్న అచారవ్యవహారములను జోడించి వ్రాయుటచే, మూల గ్రంథముల అంతరార్థము, సందేశములలో కొంత భిన్నత ఉంటుంది. అందుచే ప్రజలలో అనేక సందేహములు, అనుమానములు ఏర్పడి, పరమాత్మునిపై భక్తి కన్న భయము ఎక్కువైనది. పాపకర్మలు చేయకపోతే ఏ భగవంతుడు కోపగించుకోడు, శిక్షించడు. పాపకర్మలు చేస్తే ఏ భగవంతుడు రక్షించడు. అర్హత, యోగ్యత లేకపోతే ఆశించిన ఫలితములు ఏ భగవంతుడు తీర్చడు. ఆధునిక రచయితలు వివిధ స్థానిక ప్రాంతీయ భాషలలో వ్రాసిన రచనలు అందరికీ అర్థము అగుటచే వాటిచే ఆకర్షితులై వారి భక్తులుగా వారినే పూజించుచున్నారు. హిందువులలో కులము (హిందూ ధర్మ పవిత్ర గ్రంథములలో వర్ణము ఉంది కానీ కులము మాత్రము లేదు), ప్రాంతము, మరియు ప్రాంతీయ భాషల ప్రాముఖ్యత ఎక్కువై అంతర్గత విభాగములను సృష్టించింది. హిందూ ధర్మము యొక్క ఆధ్యాత్మిక అంశముల కంటె, స్థానిక సంప్రదాయములు, ఆచారములు, సంస్కృతి, భాష ముఖ్యమైన పాత్ర వహిస్తోంది. హిందూ ధర్మము (సాధారణముగా హిందూ మతము అనే వ్యవహరింపబడుతోంది) ప్రచారము పేరుతో చాలా సంస్థలు ఏర్పడి వీటిలో చాలాసంస్థలు ధనార్జన లక్ష్యముతో

వ్యాపార సంస్థలుగా నడుపబడుతున్నాయి. చాలామంది అమాయక ప్రజలు మోసపోతున్న సమాచారములు ప్రసార మాధ్యములలో వస్తున్న విషయము పాఠకులకు విశదమే. సామాన్య ప్రజలలో ఆధ్యాత్మికత మరియు భక్తి పెంపొందించుటకు గత 1500 సంవత్సరములలో అనేక మహాత్ములు, పండితులు, సత్పురుషులు, భక్తులు అనేక ఆధ్యాత్మికత గ్రంధములు, పద్యములు, పాటలు, కీర్తనలు, భజనలు వ్రాసి, ఉపన్యాసములు, ప్రసంగముల ద్వారా ప్రజలలో ఆధ్యాత్మికత అభివృద్ధికి ఎంతో కృషి చేసినారు. అందులో కొందరి వివరములు:

- జగద్గురు ఆది శంకరాచార్య (క్రీ. శ. 788-820): అద్వైత వేదాంతము.
- జగద్గురు రామానుజాచార్య (క్రీ. శ. 1040 - 1137): విసిష్టాద్వైత వేదాంతము.
- జగద్గురు మాధవాచార్య (క్రీ. శ. 1218 - 1317): ద్వైత వేదాంతము.
- శ్రీ కబీర్ దాస్ (క్రీ. శ. 1440 - 1518): హిందూ ధర్మము మరియు ఇస్లాం ధర్మము యొక్క మిశ్రమము.
- శ్రీ సూరదాస్ (క్రీ. శ. 1483 - 1563): శ్రీకృష్ణ భక్తుడు.
- శ్రీ చైతన్య మహాప్రభు (క్రీ. శ. 1485 - 1533): శ్రీకృష్ణ భక్తుడు.
- శ్రీ తులసీ దాస్ (క్రీ. శ. 1543 - 1623): శ్రీరామ భక్తుడు.
- శ్రీమతి మీరా బాయి (క్రీ. శ. 1547 - 1614): శ్రీకృష్ణ భక్తుడు.
- శ్రీ భక్త తుకారాం (క్రీ. శ. 1598 - 1650): శ్రీకృష్ణ భక్తుడు.
- శ్రీ నారాయణ తీర్థులు (క్రీ. శ. 1650 – 1745): శ్రీకృష్ణ భక్తుడు.
- శ్రీ త్యాగరాజ (క్రీ. శ. 1757 - 1847): శ్రీరామ భక్తుడు.

- స్వామి దయానంద సరస్వతి (క్రీ. శ. 1824 - 1883): సంస్కర్త మరియు ఆర్య సమాజం స్థాపకులు.
- శ్రీ రామకృష్ణ పరమహంస (క్రీ. శ. 1836 - 1886):  దుర్గామాతను దర్శించినారు.
- హెలెనా పెట్రోవ్నా బ్లావట్స్కీ, కల్నల్  హెన్రీ స్టీల్ ఒల్కోట్, విలియం క్వ్యూ జెడ్జ్  (క్రీ. శ. 1875):  థియోసాఫికల్ సొసైటీ స్థాపకులు.
- స్వామి వివేకానంద (క్రీ. శ. 1863 - 1902):  రామకృష్ణ మఠము మరియు మిషన్ స్థాపకులు.
- శ్రీ  షిర్డీ సాయిబాబా (క్రీ. శ.   –  1918):  హిందూ ధర్మము మరియు ఇస్లాం ధర్మము  యొక్క మిశ్రమము.
- భగవాన్ రమణ మహర్షి (క్రీ. శ. 1879 - 1950): అద్వైత వేదాంత మౌనగురువు.
- శ్రీ A. C. భక్తివేదాంత స్వామి ప్రభుపాద (క్రీ. శ. 1896 - 1977): 1966లో, న్యూయార్క్ లో, ఇంటర్నేషనల్  సొసైటీ  శ్రీకృష్ణ కాన్షియస్నెస్ (ISKCON) స్థాపకులు.
- మహర్షి మహేష్ యోగి (క్రీ. శ. 1911 - 2008):  భావాతీత ధ్యానము ఉద్యమము స్థాపకులు.
- జగద్గురు శ్రీ కృపాలు మహరాజ్ జీ (క్రీ. శ. 1922 -  ):  రాధాకృష్ణ భక్తుడు. భక్తియోగారసావతారులు. కృపాలు పరిషద్ స్థాపకులు.
- శ్రీ సత్య సాయి బాబా (క్రీ. శ. 1926 - 2011):  ఆకర్షణ ధర్మ నాయకులు.
- బ్రహ్మ కుమారిస్ (క్రీ. శ. 1950 -   ):  ధ్యానము, రాజ యోగము మరియు నిశ్చయమైన ఆలోచన ద్వారా స్వీయ రూపాంతరమునకు కట్టుబడిన ఆధ్యాత్మిక సంస్థ.

**"ఏ తత్ ఫలం సర్వం శ్రీ పరమేశ్వరార్పణ మస్తు"**

(నేను పరబ్రహ్మమునకు  (పరమాత్మునకు) సర్వఫలములు అర్పిస్తున్నాను)



అనుబంధము "ఏ"
(పేజి సంఖ్య 9 సూచిస్తున్నది)

# భారతదేశ చరిత్ర

1. 197,12,21,115 మానవ సంవత్సరముల క్రితము (క్రీ. శ. 2013): శ్వేత వరాహ కల్పము ప్రారంభమైది (పరమపిత బ్రహ్మకు 50 దైవ సంవత్సరములు పోర్తి అయి, 51 వ సంవత్సరము మొదటి రోజు పగలు ప్రారంభమైది. సృష్టి ప్రారంభించినారు).
2. మొదటి మన్వంతరము, **స్వాయంభువ మన్వంతరము** (30,672 కోట్ల మానవ సంవత్సరములు): మను స్వాయంభువ మరియు అతని భార్య శతరూప మన్వంతరము. ఈ మన్వంతరములో పరమపిత బ్రహ్మకు సృష్టి ప్రక్రియలో మను స్వాయంభువ తోడ్పడినారు. ఆయనకు ఇద్దరు కుమారులు (ప్రియవ్రత మరియు ఉత్తనపాద) మరియు ముగ్గురు కుమార్తెలు ఉన్నారు. ప్రియవ్రత కుటుంబ వారసత్వములో భక్త ప్రహ్లాద (హిరణ్యకశిపుడు కుమారుడు). ఉత్తనపాద మరియు అతని మొదటి భార్య సునితి లేదా సునిత కుమారుడు భక్త ధృవుడు. మను స్వాయంభువ మన్వంతరము సమయములో మొత్తము భూమిని పరిపాలించినారు స్వాయంభువ కుమారుడు ప్రియవ్రతకు పదిమంది కుమారులు మరియు ఇద్దరు కుమార్తెలు. చివరి ముగ్గురు కుమారులు మేధ, అగ్నిబాహు, మిత్రులు యోగులు అయి రాజ్యము పాలించలేదు. ప్రియవ్రత తన రాజ్యమును (అప్పుడు మొత్తము భూమి) ఏడు ద్వీపములుగా విభజించి అతని మిగిలిన ఏడుగురు కుమారులకు ఒక్కొక్క

ద్వీపము ఇచ్చినారు. పెద్ద కుమారుడు **అగ్నిద్రకు 'జంబు ద్వీపము'** నకు రాజును చేసినారు. (మేధాతిదికు 'ప్లక్ష ద్వీపము', వాపుష్మాన్ కు 'సల్మిలి ద్వీపము', జ్యోతిష్మాన్ కు 'కుస ద్వీపము', ద్యుతిమాన్ కు 'క్రౌంచ ద్వీపము', భవ్య కు 'సాక ద్వీపము', సవన కు 'పుష్కర ద్వీపము' ఇచ్చి రాజులను చేసినారు). అగ్నిద్ర పెద్ద కుమారుడు నాభి. నాభి కుమారుడు ఋషభ. ఋషభ కుమారుడు భరత. **ఋషభ తన కుమారుడు భరత కు 'హిమ' ('జంబు ద్వీపము' యొక్క దక్షిణ వర్ష అనగా, ద్వీపకల్పము యొక్క దక్షిణ భాగము**) ఇచ్చి రాజును చేసినారు. భరత, దక్షిణ ద్వీపకల్పమును పరిపాలన చేసినారు కాబట్టి, ఇది **భరత వర్ష** (పురాతన భారతదేశము) అని పేర్కొనబడినది (భాగవతము 11 : 2 : 15, 16).

3. రెండవ మన్వంతరము స్వరోచిస మన్వంతరము: మను స్వరోచిస మన్వంతరము 166,27,73,115 మానవ సంవత్సరముల క్రితము ప్రారంభమైనది.
4. మూడవ మన్వంతరము ఉత్తమ మన్వంతరము: మను ఉత్తమ మన్వంతరము 135,43,25,115 మానవ సంవత్సరముల క్రితము ప్రారంభమైనది.
5. నాల్గువ మన్వంతరము తమస మన్వంతరము: మను తమస మన్వంతరము 104,58,77,115 మానవ సంవత్సరముల క్రితము ప్రారంభమైనది.
6. ఐదవ మన్వంతరము రైవత మన్వంతరము: మను రైవత మన్వంతరము 73,74,29,115 మానవ సంవత్సరముల క్రితము ప్రారంభమైనది.
7. ఆరవ మన్వంతరము చక్షుస మన్వంతరము: మను చక్షుస మన్వంతరము 42,89,81,115 మానవ

సంవత్సరముల క్రితము ప్రారంభమైనది.

8. **ఏడవ (ప్రస్తుతము) మన్వంతరము వైవస్వత మన్వంతరము:** మను వైవస్వత (వివస్వాన్ (సూర్యుడు) కుమారుడు) మన్వంతరము 12,05,33,115 మానవ సంవత్సరముల క్రితము ప్రారంభమైనది. మను వైవస్వతకు పదిమంది కుమారులు మరియు ఒక కుమార్తె. సూర్యవంశము అతని పెద్ద కుమారుడు ఇక్ష్వాకు నుండి ప్రారంభమైనది. చంద్రవంశము మను వైవస్వత కుమార్తె ఎల నుండి ప్రారంభమైనది.
9. **పరశురాముడు (విష్ణుమూర్తి అవతారము):** వైవస్వత మన్వంతరములో, 19 వ మహాయుగము యొక్క కలియుగములో (3,84,53,115 కు 3,88,85,115 మధ్య, మానవ సంవత్సరముల క్రితము) రాజ్యములను పరిపాలించే రాజులు, ఋషుల ఆధ్యాత్మిక పురోగతికి (ధర్మమునకు) అవరోధము కలిగించుచుండగా ఆ రాజులను చంపుటకు, ధర్మమును పునరుద్ధరణకు విష్ణుమూర్తి, పరశురాముని అవతారము ఎత్తినారు.
10. **శ్రీరాముడు (విష్ణుమూర్తి అవతారము):** వైవస్వత మన్వంతరములో, 24 వ మహాయుగము యొక్క త్రేతాయుగములో (1,94,45,115 కు 1,81,49,115 మధ్య, మానవ సంవత్సరముల క్రితము) రావణాసురుడను చంపుటకు, ధర్మమును పునరుద్ధరణకు విష్ణుమూర్తి, శ్రీరాముని అవతారము ఎత్తినారు. శ్రీరాముడు 11,000 సంవత్సరములు భూగ్రహముపై మానవ రూపములో ఉన్నారు.
11. వైవస్వత మన్వంతరము యొక్క 27 మహాయుగములు: వైవస్వత మన్వంతరము యొక్క 27 మహాయుగములు

యొక్క 11,66,40,000 మానవ సంవత్సరములు గడిచిపోయినవి.

12. వైవస్వత మన్వంతరము యొక్క 28వ మహా యుగము (ప్రస్తుత మహాయుగము): ప్రస్తుత 28 వ మహాయుగము 38,93,115 మానవ సంవత్సరముల క్రితము ప్రారంభమైనది.
13. **శ్రీకృష్ణుడు (విష్ణుమూర్తి అవతారము):** వైవస్వత మన్వంతరము యొక్క 28వ మహాయుగము యొక్క ద్వాపర యుగములో, ప్రస్తుత మన కాలమానము ప్రకారము క్రీ. పూ. 3228 సంవత్సరములో, శ్రీకృష్ణుడు జన్మించి, క్రీ. పూ. 3102 సంవత్సరములో అవతారము పరిసమాప్తి చేసినారు (అనగా 125 సంవత్సరముల, 7 నెలలు భూగ్రహముపై మానవ రూపములో ఉన్నారు).
14. **మహాభారతయుద్ధము:** ఇది క్రీ. పూ. 3139 లో 18 రోజుల పాటు జరిగినది.
15. శ్రీకృష్ణుడు అవతార పరిసమాప్తము మరియు 28వ మహాయుగము యొక్క (ప్రస్తుత మహాయుగము) **కలియుగము (ప్రస్తుత యుగము)**: కలియుగము క్రీ. పూ. 3102 (5,115 సంవత్సరముల క్రితము 2013 నాటికి) ప్రారంభమైనది (భాగవతము 12 : 2 : 29, 33).
16. వైవస్వత మన్వంతరము యొక్క 28వ మహా యుగము (ప్రస్తుత మహాయుగము): ప్రస్తుతము 28వ మహాయుగము యొక్క మొదటి మూడు యుగముల (అనగా కృత లేదా సత్య, త్రేతా మరియు ద్వాపర యుగములు) 38,88,000 మానవ సంవత్సరములు, మరియు కలియుగము యొక్క 5,115 మానవ సంవత్సరములు (38,88,000 + 5,115) 38,93,115 మానవ సంవత్సరములు గడిచిపోయినవి. ప్రస్తుత

కలియుగము యొక్క 4,26,885 మానవ సంవత్సరములు (2013 నాటికి) మిగిలి ఉన్నవి.

17. సింధు లోయ నాగరికత (హరప్ప సంస్కృతి): క్రీ. పూ. 3300 – 1300.
    (ఏ) పూర్వ హరప్ప కాలము: క్రీ. పూ. 3300 - 2600.
    (బి) పరిపక్వ హరప్ప కాలము: క్రీ. పూ. 2600 - 1900.
    (సి) చివరి హరప్ప కాలము: క్రీ. పూ. 1900 - 1300.
18. మగధ సామ్రాజ్యములు: క్రీ. పూ. 3128 - 1994.
    (ఏ) బ్రిహద్రథ రాజవంశము (24 రాజులు): క్రీ. పూ.3128-2118
    (బి) ప్రద్యోత రాజవంశము (5 రాజులు): క్రీ. పూ. 2122 - 1994.
19. 16 మహా జాన పదములు లేదా అవంతి: క్రీ. పూ. 700 - 300. 16 రాజ్యములు - అంగ, కోశల, కాశి, మగధ, విదేహ, మల్ల, చేది, వత్స, కురు, పాంచాల, మచ్ఛ, సురసేన, అస్సక, అవంతి, గాంధార మరియు కాంబోజ ఉన్నవి.
20. గౌతమ బుద్ధుడు: క్రీ. పూ. 563 - 483 బౌద్ధమత స్థాపకులు.
21. నంద రాజవంశము (10 రాజులు): క్రీ. పూ. 424 - 321.
22. శిశునాగ రాజవంశము (3 రాజులు): క్రీ. పూ. 413 - 345.
23. అలెగ్జాండర్ భారతదేశము మీద దండయాత్ర: క్రీ. పూ. 327 - 325.
24. మౌర్య సామ్రాజ్యము (9 రాజులు): క్రీ. పూ. 322 - 185. ముఖ్యమైన మరియు అత్యంత ఖ్యాతి పొందిన పాలకులు:
    (ఏ) చంద్ర గుప్త మౌర్య: క్రీ. పూ. 322 - 298.
    (బి) బిందుసార: క్రీ. పూ. 298 - 272.
    (సి) అశోకవర్ధన్ మౌర్య (అశోకుడు): క్రీ. పూ. 273 - 232.
25. చోళ (తమిళ్) రాజవంశము (29 రాజులు): క్రీ. పూ. 300 - క్రీ. శ. 1279.

26. పాండ్యన్ (తమిళ్) రాజవంశము (46 కింగ్స్): క్రీ. పూ. 300 - క్రీ. శ. 1345.
27. శాతవాహన (ఆంధ్ర) సామ్రాజ్యము (30 రాజులు): క్రీ. పూ. 230 - క్రీ. శ. 220. శాతకర్ణి (గౌతమి కుమారుడు, 23వ శాతవాహన రాజు క్రీ. శ. 78 - 102) శాలివాహన అని కూడా పిలిచేవారు. అతను క్రీ. శ. 78 లో శాలివాహన యుగము లేదా శకము (క్యాలెండర్) ఏర్పాటు చేసినారు.
28. శుంగ సామ్రాజ్యము (10 రాజులు): క్రీ. పూ. 185 - 75.
29. విక్రమాదిత్య చక్రవర్తి (ఉజ్జయినీ): క్రీ. పూ. 102 - క్రీ. శ. 15.
30. కణ్వ రాజవంశము (4 రాజులు): క్రీ. పూ. 75 - 26.
31. కుషాన్ సామ్రాజ్యము (15 రాజులు): క్రీ. శ. 30 - 375.
32. గుప్త సామ్రాజ్యము (17 రాజులు): క్రీ. శ. 320 - 600.
33. రాజపుత్ర రాష్ట్రములు: క్రీ. శ. 6 వ శతాబ్దము - 20 వ శతాబ్దము.
34. పాల సామ్రాజ్యము (18 రాజులు): క్రీ. శ. 750 - 1174.
35. హొయసల (కన్నడ) సామ్రాజ్యము (12 రాజులు): క్రీ. శ. 1026 - 1343.
36. కాకతీయ రాజవంశము (9 రాజులు): క్రీ. శ. 1083 - 1323.
37. ఇస్లామిక్ సామ్రాజ్యములు: క్రీ. శ. 1192 - 1757 (565 సంవత్సరములు).
    (ఏ) ఢిల్లీ సుల్తానులు (27 సుల్తానులు): క్రీ. శ. 1206 – 1526.
    (బి) మొఘల్ సామ్రాజ్యము (23సుల్తానులు): క్రీ.శ.1526–1757.
    (సి) దక్కను సుల్తానులు (45 సుల్తానులు): క్రీ. శ. 1527-1686.
38. విజయనగర సామ్రాజ్యము (28 రాజులు): క్రీ. శ. 1336 - 1646.
39. బ్రిటిష్ వలస పాలన: బ్రిటిష్ వారి తూర్పు భారతదేశము కంపెనీ క్రీ. శ. 1619లో భారతదేశము వచ్చి, 1757లో బెంగాల్లో

పాలన స్థాపించినది. 1857 బ్రిటీష్ రాజ్యపాలన భారతదేశము అంతటా స్థాపించబడినది. 190 సంవత్సరముల పాలన చేసినారు. 15 ఆగస్టు 1947న భారత దేశమునకు స్వాతంత్రము వచ్చినది.

40. స్వతంత్ర భారతదేశము:15 ఆగస్టు 1947నుండి సాగుతున్నది.

**<u>గమనిక:</u>** పురాణములలో సూర్యవంశములో ఇక్ష్వాకు నుండి శ్రీరాముడు మధ్యలో హరిశ్చంద్రుడు, భగీరధుడు మొదలైన ముఖ్యమైన పాలకులు మరియు దైవ వ్యక్తుల గురించి అనేక వివరములు ఉన్నవి. చంద్రవంశములో మహర్షి భరద్వాజ, మహారాజులు హస్తి (హస్తినాపుర సామ్రాజ్యమును స్థాపించారు), దుష్యంతుడు మొదలైన ముఖ్యమైన వ్యక్తులు చాలామంది ఉన్నారు. భరత వర్ష (పురాతన భారతదేశము), యొక్క పురాతన చరిత్ర, సనాతన ధర్మము, వాటి వివరములు భూగ్రహము మీద ఏ ఇతర దేశములోనూ లేదు.



అనుబంధము "బి)" (పేజి సంఖ్య 13 సూచిస్తున్నది)



అనుబంధము “సి” (పేజి సంఖ్య 40 సూచిస్తున్నది)




పేజి సంఖ్య 221
తరువాత పేజిలో ఇంకా ఉంది

ముందు పేజి నుండి కలుపుము



సాత్త్విక అహంకారము
రాజసిక అహంకారము
తామసిక అహంకారము
అహంకారము
చిత్తము
బుద్ధి
మనస్సు
ఇంద్రియములు
ప్రాణము
జ్ఞానేంద్రియములు
శ్రవణ
స్పర్శ
దృష్టి
రుచి
ఘ్రాణ
కర్మేంద్రియములు
స్వర పేటిక
చేతులు
పాదములు
జననాంగము
మలవిసర్జన అవయవము
సూక్ష్మ భూతములు
శబ్ద
స్పర్శ
రంగు
రుచి
వాసన
స్థూల భూతములు
ఆకాశము
వాయువు
అగ్ని
జలము
భూమి

**అనుబంధము "డి"**
(పేజి సంఖ్య 40 సూచిస్తున్నది)

## పంచీకరణ




సూక్ష్మ భూతముల నుండి స్థూల భూతములకు పరిణామము

అనుబంధము "ఇ" (పేజి సంఖ్య 44 సూచిస్తున్నది)

# దైవ పగలు మరియు రాత్రి




పేజి సంఖ్య 224
తరువాత పేజిలో ఇంకా ఉంది

ముందు పేజి నుండి కలుపుము

**దైవ పగలు** (ఒక కల్పము - 432 కోట్ల మానవ సంవత్సరములు)
(ప్రస్తుతము **శ్వేతవరాహ కల్పము** నడుస్తున్నది**)**




ప్రస్తుతము **కలి యుగము** జరుగుతున్నది
(క్రీ. పూ. **3,102, 17/18** ఫిబ్రవరి మధ్య రాత్రి ప్రారంభమైనది)

**మన్వంతరములు (14)**

**15వ** సాయం సంధ్య

ఇంద్ర సావర్ణి) 14)

**8వ** సంధ్యా కాలము

**వైవస్వత (7వ)**
**(ప్రస్తుత మన్వంతరము)**

సంధ్యా కాలము

**స్వయంభువ (1వ)** 30,672 కోట్ల మానవ సంవత్సరములు

**1వ** ప్రాతఃసంధ్య

**అనుబంధము "ఎఫ్"**
(పేజి సంఖ్య 62 సూచిస్తున్నది)

# ధర్మము స్థాయిలు



అనుబంధము “జి” (పేజి సంఖ్య 64 సూచిస్తున్నది)

# అరిషడ్ వర్గములు

అరిషడ్ వర్గముల (శరీరములో సూక్ష్మ రూపములో ఉన్న దుష్ట శక్తుల) ప్రభావము క్రింది విధముగా ఉండును:

**మహామాయ లేదా ప్రకృతి**

↓

**అహంకారము**

(అజ్ఞానము కారణముగా జీవాత్మ శరీరము తనకు తానుగా గుర్తిస్తుంది)

↓

**అహంవృత్తి**

(కారణముగా మనస్సు (జీఆత్మ) శరీరముగా ఆలోచిస్తుంది)

↓

**దృశ్యము**

జ్ఞానేంద్రియములు (5), కర్మేంద్రియములు (5) ద్వారా మాయా ప్రపంచమును చూచి అనుబంధము ఎర్పరచుకోనును

**సంస్కారములు లేదా వాసనలు**

గత జన్మములలోని కోరికలు మనస్సులో (చేతన విభాగములో) అవ్యక్త లేదా సూక్ష్మ రూపములో నాటుకున్నవి

↓

**సంకల్పము లేదా ఆలోచన**

↓

స్పందన (భావన) ⟶ (అభిలాష) ఇచ్ఛ ⟶ తృప్తి (ధర్మముగా లభించిన దానితో సంతృప్తిచెందు) ⟶ త్రిష్ణ లేదా ఆశ) అవసరమైన దానికంటే ఎక్కువ కావాలనే




**జ్ఞాన యోగము** ద్వారా అజ్ఞానము పోయి, అహంవృత్తి కరిగి, జ్ఞాగ్నిలో అహంకారము దగ్ధమై, బూడిద అయి, జ్ఞానముతో ఆత్మ, దృశ్యములను (మాయ ప్రపంచమును) ద్రష్టగా (సాక్షిగా, చూచువానిగా) తనకు ఏమీ సంబంధము లేనివానిగా, ద్వంద్వములకు అతీతమై, **ఆత్మ తనలో తాను రమించును.**

అనుబంధము “హెచ్” (పేజి సంఖ్య 78 సూచిస్తున్నది)

# వివాహము, దైవిక అంశము

విశ్వములో ప్రతిదీ వాటి స్థానములో సంతులనముతో ఉన్నవి. రెండు భిన్నమైన తత్వములు లేదా వ్యక్తుల మధ్య సంతులనము సృష్టి యొక్క నియమము. పరబ్రహ్మము యొక్క రెండు పరిణామములు చెందిన సగము పరమాత్ముడు (పురుషుడు) (ఈశ్వరుడు) మరియు సగము ప్రకృతి (శక్తి) (స్త్రీ) (పార్వతీదేవి) అయిన అర్ధనారీశ్వర తత్త్వము (ఆదిదంపతులు, ఈ విశ్వము యొక్క సృష్టికి మొదటి భార్యాభర్తలు) సంయోగము, రెండు భిన్నమైన తత్వములు లేదా వ్యక్తుల మధ్య సంతులనకు సంకేతము. ప్రకృతి (స్త్రీ), పురుష (మగవాడు) రెండు భిన్నమైన తత్వములు లేదా వ్యక్తులు సృష్టి కొఅకు ఐకమత్య సంతులనమే వివాహము. ఈ రెండు భిన్నమైన తత్వములు లేదా వ్యక్తుల సంయోగము లేనిచో సృష్టే ఉండదు. పురుషుడు మరియు స్త్రీ మధ్య వివాహసంస్థ, నాలుగు పురుషార్థములలో (మానవుల జీవిత అంతిమ లక్ష్యములు) (పేజి సంఖ్యలు 100, 101 చూడుము), మూడు పురుషార్థములు (ధర్మము, అర్థము మరియు కామము) నెరవేర్చుట కొఅకు వివాహమనే పవిత్రమైన మరియు దైవ సంబంధిత సంస్థ ఏర్పాటుచేయబడినది. నాల్గవ పురుషార్థమైన మోక్షము పొందుటకు వ్యక్తిగతముగా (జీవాత్మ) సాధన చేయవలెను. అందుచే వివాహ సమయములో వివాహము చేసుకుంటున్న వరుడు, వధువులతో, అందరి బంధువుల, స్నేహితుల మరియు అగ్ని (ప్రతిచోటా, అన్ని సమయములలో అగ్నిదేముడు ఉంటారు) సాక్షిగా, ప్రతిజ్ఞ చేయిస్తూ చెప్పే మంత్రము **"ధర్మేచ, అర్థేచ, కామేచ నాతిచెరితవ్య –**

**నాతిచరామి**" (అనగా మేమిద్దరమూ కలిసి ధర్మము, అర్థము మరియు కామము అనే పురుషార్థములను అనుసరించుదుము, పాటించెదము). (**<u>గమనిక:</u>** నాల్గవ పురుషార్థమైన మోక్షము ఈ మంత్రములో ఉండదు). సరైన ముహూర్త కాలములో, సరైన మంత్రముతో, వధూవరులు పరస్పరము అభిముఖంగా కూర్చుని, ఒకరి తలపై మరొకరు జీలకర్ర మరియు బెల్లము మిశ్రమము తలమీద (బ్రహ్మరంధ్రము స్థానములో) ఉంచవలెను. అదే సమయములో పరస్పరము ఒకరి ఆజ్ఞా చక్రములోనికి (కనుబొమ్మల మధ్య) మరోకరు మొదటిసారిగా చూడవలెను. అప్పుడు ఒకరి కుండలిని శక్తి మరొకరి ఆజ్ఞా చక్రములోని ప్రవేశించి, బ్రహ్మరంధ్రము లోనికి వెళ్లి, అక్కడినుండి మరొకరి బ్రహ్మరంధ్రము లోనికి ప్రవేశించి, అక్కడినుండి సహస్రారము ద్వారా ఆజ్ఞా చక్రములోనికి వెళ్లి, చక్రము లేదా సంచారము పూర్తి అవుతుంది. ఈ సంచారము యొక్క శక్తి, ముహూర్త కాలము మరియు మంత్రము యొక్క శక్తి కారణముగా, ఆ దంపతుల జీవితకాలమంతా వారి వివాహబంధము, అర్ధనారీశ్వరుడు వలె, జీలకర్ర మరియు బెల్లము మిశ్రమము వలె, విడదీయరానివారివలె కలిసి ఉంటారు. ఇది హిందువుల వివాహములోని వేద సిద్ధాంతము, భావము. వివాహము, జీవితము యొక్క ప్రయాణములో ఒక ప్రత్యేక అంశము. వరుడు, వధువు చేతిని స్వీకరించుట (పాణిగ్రహణము) వివాహములోని ముఖ్య అంశము. స్త్రీ, పురుష యొక్క వివాహము అర్ధనారీశ్వరుడు యొక్క తరహాలోనే ఒక అనుకూలమైన సంతులనము, సృష్టించుటకు ఉద్దేశించబడినది. వారు వారి వ్యక్తిగత గుర్తింపులు (అహంకారము) లేకుండా, విడదీయరాని సంయోగము, పరస్పర ఆధారముగా ఒక సంపూర్ణ, దైవ సంబంధము.

ఇటువంటి వివాహము దంపతుల మధ్య పరస్పర ప్రేమ, ఆప్యాయత, అనురాగము, భక్తి, గౌరవముతో ఒకరి జీవిత అవసరములను మరొకరు జాగ్రత్తగా చూసుకుంటూ ఆనందముగా ఉంటారు.

**<u>గమనిక:</u>** ప్రస్తుత వివాహము తంతు వీటికి విరుద్ధముగా, ధనము, తీవ్రకామవాంఛ ముఖ్య అంశములుగా మారి, ఒక వ్యాపార సంస్థగా మార్చి, దంపతుల మధ్య అహంకారములు, భావోద్వేగాలు ఎక్కువై సంబంధము, బంధముగా అయి విపరీత పరిణామములు జరుగుతున్నవి.

ఈ సంబంధము రెండు కుటుంబముల మధ్య బలపడి, దంపతుల సంతానము, తల్లిదండ్రులు, సోదర, సోదరీమణులు, బంధువులు మధ్య మరింత విస్తరించును. భార్య, భర్త జీవితములో స్ఫూర్తి, ప్రేరణా శక్తిగా పరిగణిస్తారు. భార్యభర్తల మధ్య వైవాహిక సంబంధము ఆధ్యాత్మిక వికాసము మీద ఆధారపడి ఉంటుంది. దంపతుల మధ్య సంబంధము దైవ చక్రముల స్థాయి (శక్తి కేంద్రములు) (కుండలిని యోగము పేజి సంఖ్యలు 180 నుండి 183, 243 చూడుము) మీద ఆధారపడి ఉంటుంది. ప్రతి చక్రమునకు సంబంధించిన కొన్ని లక్షణములు ఉన్నవి. దంపతుల మధ్య సంబంధము ఆ లక్షణములు కలిగిన నిర్దిష్ట చక్రము యొక్క స్థాయిలో ఉంటుంది. వాటి వివరములు:

- **మూలాధార చక్రము:** ఇది అన్నిటికంటే కనిష్టస్థాయి. ఈ స్థాయి లోని సంబంధము స్వార్థపూరిత ప్రాథమిక ప్రాపంచిక కోరికలు - సంపద, వస్తువులు, భౌతిక అవసరములు, కోరికల ఆధారముగా ఉంటుంది (పురుషార్థములు - అర్థము, కామము).

❖ **స్వాధిష్టాన చక్రము:** ఇది తదుపరి ఉన్నత స్థాయి. ఈ స్థాయి లోని సంబంధము భౌతిక, లైంగిక కోరికల ఆధారముగా ఉంటుంది (పురుషార్థము - కామము).

❖ **మణిపూరక చక్రము:** ఇది తదుపరి ఉన్నత స్థాయి. ఈ స్థాయి లోని సంబంధము ఆర్థిక, సామాజిక, రాజకీయ మొదలైన అంశముల మీద ఆధారపడి ఉంటుంది (పురుషార్థములు - అర్థము, కామము).

❖ **అనాహత చక్రము:** ఇది తదుపరి ఉన్నత స్థాయి. ఈ స్థాయి లోని దంపతులు చాలా అరుదు. ఇది దంపతుల మధ్య షరతులు, ప్రతికూల భావములులేని, నిర్మలమైన, స్వచ్ఛమైన, నిస్వార్థ ప్రేమ కలిగి ఒకరి ఆనందమే తమ ఆనందము అనే భావనతో వారి జీవితము సంతోషముగా కొనసాగుతుంది (పురుషార్థము - ధర్మము).

❖ **విశుద్ధ చక్రము:** ఇది తదుపరి ఉన్నత స్థాయి. ఈ స్థాయి లోని దంపతులు ఇంకా అరుదు. ఇది దంపతుల మధ్య తమ స్వంత వ్యక్తిగత, స్వార్థపూరిత అవసరములకు అతీతముగా సృజనాత్మక స్థాయిలో ఉంటుంది (పురుషార్థము - ధర్మము).

❖ **ఆజ్ఞా చక్రము:** దంపతుల వైవాహిక సంబంధములో ఇది అత్యధి ఉన్నత స్థాయి. మానవ శరీరములో, అర్ధనారీశ్వరుడు స్థానముగా అత్యధిక శక్తి కేంద్రము. దంపతులు ఇద్దరూ ఈ స్థానమునకు చేరకలిగితే, వారి మధ్య సంబంధము ఈశ్వరుడు (పురుష) మరియు పార్వతీదేవి (స్త్రీ శక్తి) వలె అత్యంత సూక్ష్మము, దివ్యము మరియు సంపూర్ణమై ఏకత్వము (ఒకరి నుండి మరొకరిని వేరుచేయలేని, ఒకరు లేకపోతే మరొకరు ఉండలేని విధముగా) పొందుతారు. హిందువుల సమాజములో

ఇటువంటి దంపతులను పార్వతీపరమేశ్వరులుగా గౌరవిస్తారు. (పురుషార్థము - ధర్మము). (**<u>గమనిక:</u>** ప్రస్తుత సమాజములో ఇటువంటి దంపతులు చూడటము చాల అరుదు).

- **సహస్రారము:** ఆజ్ఞా చక్రము నుండి సహస్రారమునకు (ఇక్కడకు చేరినవారు మోక్షము, పరమాత్మునితో ఏకత్వము, పొందుతారు) ప్రయాణము వ్యక్తిగతముగా ఎవరికి వారు సాధన చేయవలెను. అందుచే నాల్గవ పురుషార్థము - మోక్షము వివాహ మంత్రములలో (దంపతుల ప్రతిజ్ఞలో) లేదు.



అనుబంధము "జె" (పేజి సంఖ్య 168 సూచిస్తున్నది)

# జనన, మరణ, పునర్జన్మ చక్రము

అన్ని జీవులలో మూడు రకముల శరీరములు ఉన్నవి. అవి క్రింద విధములుగా ఉన్నవి:

1. **స్థూల శరీరము:**

- ❖ సూచించును: **"ఓం" లో "అ"**, పరమపిత బ్రహ్మ (సృష్టి కర్త).
- ❖ గుణము: రజో గుణము (క్రియాశీలత).
- ❖ ఆత్మ: జీవాత్మ.
- ❖ స్థానము: కళ్ళు.
- ❖ అవస్థ: జాగృతి.
- ❖ కోశము: అన్నమయ కోశము.
- ❖ అభివృద్ధి: గర్భధారణ సమయములో గర్భములో పిండము యొక్క అభివృద్ధి క్రింద విధములుగా ఉండును (గర్భోప నిషత్ 13 నుండి 20 వరకు, 26, 30, 43, 44; గరుడ పురాణము, అధ్యాయము – 6):
- ❖ **1వ నెలలో:** పిండము గట్టిపడి, తల ఏర్పడుతుంది.
- ❖ **2వ నెలలో:** భుజములు, చేతులు, కాళ్ళు, పాదములు మరియు ఇతర అవయవములు రూపొందును.
- ❖ **3వ నెలలో:** గోళ్ళు, జుట్టు, చర్మము, జననాంగము, గుదము అభివృద్ధి అవును.
- ❖ **4వ నెలలో:** కడుపు, వెన్నెముక, వీపు, సప్త ధాతువులు (ఎముకలు, కొవ్వు లేదా మేధా, మాంసము, రక్తము,

మేధస్సు, శుక్లము మరియు చర్మము) అభివృద్ధి పొందును.

- **సూక్ష్మ మూలకములు:** (ఎ) శ్రవణ శక్తి - చెవులలో, (బి) స్పర్శ శక్తి - చర్మములో, (సి) దృష్టి శక్తి - కళ్ళలో, (డి) రుచి శక్తి - నాలుకలో, (ఇ) ఘ్రాణ శక్తి - ముక్కులో.
- **5వ నెలలో:** వెన్నెముక అభివృద్ధి అవును. ఆకలి, దప్పిక భావన ఏర్పడును.
- **6వ నెలలో:** కళ్ళు, ముక్కు, చెవులు, నోరు అభివృద్ధి అవును. పిండమును మావితో (జరాయువు, అపరాయువు) కప్పబడును.
- **7వ నెలలో:** జీవాత్మ తన ప్రారబ్ధ కర్మఫలములను అనుభవించుటకు బ్రహ్మ రంధ్రము ద్వారా శిశువులో ప్రవేశించును (**<u>గమనిక:</u>** శిశువు యొక్క శరీరము జీవాత్మ తయారుచేయలేదు). శిశువులో చైతన్యము, స్మృతి, వివేకము కలుగును. శిశువునకు పూర్వ జన్మల జ్ఞాపకములు ఉండును. గర్భములో మల, మూత్రములలో కదులును. ప్రసవించిన వెంటనే శిశువును మహామాయ (అజ్ఞానము) ఆవరణతో ఆ స్మృతులు, వివేకము కోల్పోవును).
- **8వ నెలనుండి:** అన్ని శరీర భాగములు, లక్షణములు పూర్తిగా అభివృద్ధిచెంది, గర్భములో శిశువుకు కదలికలు ఉండును.

## 2. **సూక్ష్మ (లింగ) శరీరము:**

- సూచించును: **"ఓం"** లో **"ఉ"**, విష్ణుమూర్తి (సృష్టి పోషకుడు, సంరక్షకుడు).
- గుణము: సత్త్వ గుణము (జ్ఞానమునకు సంకేతము).

- ఆత్మ: అంతరాత్మ.
- స్థానము: గొంతులో.
- అవస్థ: స్వప్నము.
- కోశము: ప్రాణమయ కోశము, మనోమయ కోశము, విజ్ఞానమయ కోశము.
- అభివృద్ధి: 7వ నెలలో గర్భములో సూక్ష్మ శరీరము, శిశువు యొక్క శరీరములో ప్రవేశించును. సూక్ష్మ శరీరము, జీవాత్మను శరీరమునకు జోడించి సంబంధము కలుపును. తరువాత క్రింది విధముగా మరింత అభివృద్ధి చెందును:
- అంతఃకరణము (సూక్ష్మ ఇంద్రియములు) (4): (ఎ) అహంకారము హృదయములో, (బి) చిత్తము (వివేకము) - బొడ్డులో, (సి) బుద్ధి (తెలివి) - కళ్ళలో (డి) మానస్సు - గొంతులో.
- ప్రాణేంద్రియములు (5): (ఎ ) ప్రాణ (ఉచ్చ్వాస మరియు నిశ్వాసములలో నాసికద్వారములు లేదా నోరు ద్వారా తీసుకొని, వదిలే వాయువు) - ఊపిరితిత్తులు, (బి) అపాన (గుదము ద్వారా బయటకుపోయే వాయువు) - గుదము. (సి) సమాన (జీర్ణక్రియకు అవసరము అయ్యే వాయువు) - నాభి. (డి) ఉదాన (వాంతి అయ్యే సమయములో నోటిద్వారా బయటకుపోయే వాయువు) - గొంతు. (ఇ) వ్యాన (శరీరములో ప్రతి దిశకు వ్యాపించి బయటకుపోయే వాయువు) - శరీరము.
- జ్ఞానేంద్రియములు (5): (ఎ) శ్రవణ శక్తి - చెవులలో, (బి) స్పర్శ శక్తి - చర్మములో, (సి) దృష్టి శక్తి - కళ్ళలో, (డి) రుచి శక్తి – నాలుకలో, (ఇ) ఘ్రాణ శక్తి - ముక్కులో.

❖ కర్మేంద్రియములు (5): (ఎ) వాక్కు (స్వర పేటిక) - గొంతులో, (బి) పాని - చేతిలో, (సి) పాద - కాళ్ళలో, (డి) ఉపస్థ - స్త్రీ, పురుషుల రహస్యావయవములో, (ఇ) పాయు - మలవిసర్జన అవయవములో.

3. **కారణ (హేత్వర్థకమైన) శరీరము:**

❖ సూచించును: **"ఓం"** లో **"మ".** శివుడు (లయ కారకుడు).
❖ గుణము: తమో గుణము (అజ్ఞానము) పోగొట్టుటకు.
❖ ఆత్మ: పరమాత్మ.
❖ స్థానము: హృదయములో.
❖ అవస్థ: సుషుప్తి (ఘాడ నిద్ర).
❖ కోశము: ఆనందమయ కోశము.
❖ అభివృద్ధి: శిశువు ప్రసవించిన వేంటనే మొట్టమొదటి శ్వాసతో (జననము) మహామాయ శరీరములో ప్రవేశించును, ఆక్రమించును. మహామాయ (భ్రాంతి) ఒక మాంత్రికుడు వలె సత్యమును, జ్ఞానమును కప్పి, అసత్యమును, అజ్ఞానమును సత్యముగా, జ్ఞానముగా భ్రమింపచేయును. ఈ ప్రాభవముతో జీవాత్మ, మహామాయచే ఆకర్షింపబడినదై, తన జ్ఞానము కోల్పోయి, నిజ స్వరూపమును మరచి, అహంకారముచే (శరీరమే జీవాత్మ అనే భావన) "నేను" "నాది" అనే (అసత్య) ప్రవృత్తి (నా శరీరము, నా శక్తి, నా తల్లి, నా తండ్రి, నా గృహము, నా ధనము మొదలైనవి) యేర్పడును. ఈ విధముగా జీవాత్మ తన అజ్ఞానముతో స్వయముగా మహామాయ యొక్క బానిసత్వమును స్వీకరిస్తుంది. జీవాత్మ సూక్ష్మ శరీరములోని (అంతఃకరణములోని) మనస్సులో నాటుకున్న గత జన్మలలోని వాసనలు

లేదా సంస్కారముల కోరికలు, మరియు జ్ఞానేంద్రియముల ద్వారా పొందిన ప్రాపంచిక విషయములు వలన స్థూల, సూక్ష్మ మరియు కారణ శరీరములు మూడు సహజీవనమునకు తోడ్పడును.

## జననము మరియు మరణము

జీవాత్మకు అజ్ఞానము ఉన్నంత కాలము సూక్ష్మ, కారణ శరీరములు జీవాత్మను అంటిపెట్టుకొని ఉండును. స్థూల, సూక్ష్మ మరియు కారణ శరీరములు మూడు మహామాయ యొక్క ఉత్పత్తులు. ఈ మూడు సంస్థలు కలిసి జీవాత్మకు సహజీవనమునకు తోడ్పడినప్పుడే జననము, జరుగుతుంది. వీటిలో జీవాత్మ (సూక్ష్మ, కారణ శరీరములతో) స్థూల శరీరమునుండి విడిపోతే అదే మరణము (భగవద్గీత 15 : 7, 8; బృహదారణ్యకోప నిషత్ 4 లేదా 6 : 4 : 1, 2). మరణము సమయములో జీవాత్మ, సూక్ష్మ శరీరము మరియు కారణ శరీరము కలిసి చివరి ఊపిరివిడిచే సమయములో ముక్కు లేదా కళ్ళు, చెవులు, నోరు, గుదము ద్వారా స్థూల శరీరమును వదిలి పితృలోకమునకు వెళ్ళును. అక్కడ భూతము లేదా ప్రేతము లేదా పిశాచముగా తన తదుపరి ప్రారబ్ధ కర్మఫలములను అనుభవించుటకు సరైన కాలము (అపరిమితము), పరిస్థితుల (పునర్జన్మ) కోసము యెదురు చూచుచుండును (కౌషీతకీబ్రాహ్మణోప నిషత్ 3 : 4). మహామాయచే ఉత్పత్తి చేయబడ్డ స్థూల (భౌతిక) శరీరము ఇక్కడే మిగిలిపోవును. అదియే శవము. శవమును కాల్చి లేదా భూమిలో పాతిపెట్టి ఆ శరీరమును విసర్జించుదురు. ఆ శరీరము తన మూల ద్రవ్యములగు పంచభూతములలో ఐక్యమైపోవును.

## పునర్జన్మ

భూతము లేదా ప్రేతము లేదా పిశాచముగా పితృలోకములో ఉన్న జీవాత్మ (సూక్ష్మ, కారణ శరీరములతో) తన తదుపరి ప్రారబ్ధ కర్మఫలములకు సరైన సమయము, సరైన పరిస్థితులు ఏర్పడినప్పుడు పరమాత్మ (కర్మ ఫలదాత), జీవాత్మ తదుపరి ప్రారబ్ధ కర్మఫలములను అనుభవించుటకు, జీవాత్మను (సూక్ష్మ, కారణ శరీరములతో) మరొక స్థూల శరీరములో ప్రవేశ పెట్టును. ఈ విధముగా జనన, మరణ పునర్జన్మ చక్రము (జీవాత్మకు అజ్ఞానము తొలగి మోక్షము పొంది పరమాత్మలో ఐక్యము అయ్యేంత వరకూ) కొనసాగుతుంది. ఇదియే పునర్జన్మ (బృహదారణ్యకోప నిషత్ 4 లేదా 6 : 4 : 6; భగవద్గీత 9 : 8).

**<u>గమనిక:</u>**

1. జీవాత్మ యొక్క స్వాభావిక చైతన్య ప్రతిబింబము బుద్ధిపై పడి బుద్ధిని చైతన్యము చేయును. ఈ చైతన్య ప్రతిబింబము అంతఃకరణను, ప్రాణేంద్రియములను, జ్ఞానేంద్రియములను, కర్మేంద్రియములను వరుసగా చైతన్యము చేయును. చైతన్య ప్రతిబింబము బుద్ధిపై పడినంతసేపూ స్థూల, సూక్ష్మ శరీరము అంతా చైతన్యవంతమగును. మనస్సు యొక్క అజ్ఞానము, చంచలత్వము కారణముగా మనస్సే శరీరమంతనూ చైతన్యము చేయుచున్నదని భావన యేర్పడును.

2. ఆత్మను సూక్ష్మ, కారణ శరీరములు అంటిపెట్టుకుని ఉన్నంతకాలమూ జీవాత్మగా పరిగణింపబడుతుంది. ఆత్మ యొక్క జ్ఞానమును, కారణ శరీరము (అజ్ఞానము) కప్పినంతవరకూ, తన నిజ స్వరూపమగు "**ఆత్మయే పరమాత్మ**"

అనే సత్యమును తెలిసికోలేదు. జ్ఞానముచే అజ్ఞానము (కారణ శరీరము) తొలగిన వెనువెంటనే, స్థూల, సూక్ష్మ శరీరములలో నున్న ఆత్మ, "**ఆత్మయే పరమాత్మ**" అన్న అనిభూతితో రమించుచూ ఉండును. ఇదియే జీవన్ముక్తి.

3. జీవాత్మ యొక్క ప్రారబ్ధ కర్మఫలములు అంతమైన వెంటనే, జీవాత్మ స్థూల, సూక్ష్మ శరీరములను వదలి (మహామాయ యొక్క బానిసత్వము నుండి, సంసారమైన జనన, మరణ, పునర్జన్మ చక్రము నుండి విముక్తి అయి) ఆత్మ, పరమాత్ముని కృపతో, పరమాత్మునిలో ఇక్యమగును. ఇదియే మోక్షము. మోక్షము పొందిన ఆత్మకు జనన, మరణ, పునర్జన్మ ఉండదు (భాగవతము 3 : 31 : 1 నుండి 24 వరకు; గరుడ పురాణము, అధ్యాయము - 6).



అనుబంధము "కె" (పేజి సంఖ్య 176 సూచిస్తున్నది)

# రాజ యోగము

1. **అష్ట - మహాసిద్ధులు సిద్ధిలు** (భాగవతము 2 : 2 : 22)

- ❖ అణిమ: శరీరమును అతి చిన్నదిగా (అణువుగా) కనిపించకుండా చేయగల శక్తి.
- ❖ మహిమ: శరీరమును అతి పెద్దదిగా చేయగల శక్తి.
- ❖ గరిమ: శరీరమును అధికభారముగా, బరువుగా చేయగల శక్తి.
- ❖ లఘిమ: శరీరమును గాలిలో తెలిపోయేలా అతి తేలికగా చేయగల శక్తి.
- ❖ ప్రాప్తి: ఏదైనా పొందగల శక్తి.
- ❖ ప్రాకామ్యము: ఎవ్వరూ ఎదురించలేని, ఇష్టప్రకారము చేయగల శక్తి.
- ❖ ఈశత్వము: అందరిమీదా నియంత్రణ, శాసనము చేయగల శక్తి.
- ❖ వశిత్వము: ఎవ్వరినైనా లోబరచుకొను, జయించు, వశపరచుకొను శక్తి.

2. **అదనపు సిద్ధిలు - మానవాతీత శక్తులు:**

- ❖ కామవశిత: కోరికలను వశము, జయించు శక్తి, సామర్ధ్యము.
- ❖ కేచరివిద్య: గాలిలో యెగరగల శక్తి.
- ❖ మృత్యుంజయ విద్య: మృత్యువును జయించగల శక్తి.
- ❖ పాతాళ సిద్ధి: భూమిలో పాతిబెట్టిన నిధులను తెలుసుకోగల శక్తి.

- కాయ సిద్ధి:  జీవాత్మ తన శరీరము వదలి, మరొక శరీరములో ప్రవేశించగల శక్తి.
- త్రికాల జ్ఞానము:  భూత, వర్తమాన, భవిషత్తు కాలముల విషయములను తెలుసుకోగల శక్తి.
- ఇచ్చా మృత్యు:  తన ఇష్టానుసారము మరణించగల శక్తి.
- అంతర్ధానము:  అదృశ్యమగు శక్తి.
- క్షుత్పిపాస నివృత్తి:  నిద్ర, ఆహారములు త్యజించగల శక్తి.
- సర్వ భూతానుత జ్ఞానము: అన్ని జీవుల భాషలను అర్థము చేసుకోగల శక్తి.



అనుబంధము (ఎల్) (పేజి సంఖ్య 180 సూచిస్తున్నది)

# కుండలిని యోగము

## దైవ చక్రములు



# హిందూ ధర్మ ముఖ్య అంశములు

## సనాతన ధర్మము (హిందూ ధర్మము)

1. సనాతన ధర్మము (హిందూ ధర్మము) శాశ్వతముగా పరమాత్ముని యందుండి, ఆయనచే రక్షింపబడుతూ, సృష్టి సమయమున ఆయనచే వెల్లడింపబడినది.

2. వేదములు (హిందూ ధర్మ పవిత్ర గ్రంథములు) శాశ్వతమైన దైవ సత్యములను (జ్ఞానమును) తెలియచేయునవి.

3. హిందూ ధర్మ పవిత్ర గ్రంథములు సంస్కృతములో ఉన్నవి. సంస్కృతము దైవ భాష.

4. హిందూ ధర్మములో దైవ శాస్త్రము, విద్య (పర, అపర), విజ్ఞానము ఉన్నవి.

5. హిందూ ధర్మము, సంస్కృతి శాశ్వతమైనవి, పురాతనమైనవి. ఇవి విశ్వ ధర్మములు. మానవులందరికీ వర్తించును.

6. ప్రేమ, శాంతి, సమృద్ధి, అభివృద్ధి, గౌరవము, దయ, కరుణ, ఆనందము మరియు మానవత్వము సార్వత్రిక హిందూ ధర్మములో ప్రాథమిక శిక్షణ.

7. ఎవరైతే హిందూ ధర్మ పవిత్ర గ్రంథములను అనుసరిస్తారో వారు దైవ జ్ఞానము; అనంత, శాశ్వత, దైవ పరమానందము పొందుదురు.

8. ఆధునిక, అభివృద్ధియైన విజ్ఞాన శాస్త్రము, జ్ఞానము ఎక్కడ అంతమవునో, అక్కడనుండి దైవ శాస్త్రము, జ్ఞానము ప్రారంభమగును.

9. హిందూ ధర్మ పవిత్ర గ్రంధములు కల్పితములు, మూఢ నమ్మకములని పాశ్చాత్యదేశములు స్వార్ధపూరిత అసత్య ప్రచారము చేస్తున్నవి. వీటిలోని దైవ సత్యములు, జ్ఞానము పరిపూర్ణ జ్ఞానము కోసము పరితపించేవారికి మాత్రమే అర్ధమగును.

10. హిందువుల జీవన విధానములో (మతములో) పూర్వీలు పండుగలు రూపములో జ్ఞానమును నిఘూడముగా పొందుపరచినారు.

11. భరత వర్ష (పురాతన భారతదేశము) చరిత్ర 197 కోట్ల మానవ సంవత్సరములు (శ్వేత వరాహ కల్పము, ప్రస్తుతము కల్పము) నాటిది.

12. 5,000 సంవత్సరముల క్రితము భగవాన్ వేద వ్యాసడు, వేదములు, ఉపనిషత్తులు, పురాణములు, రామాయణము, మహాభారతము, భగవద్గీత పునరుత్పత్తి చేసినారు.

## పరబ్రహ్మము (పరమాత్ముడు)

13. పరబ్రహ్మమును రెండు విధములుగా వర్ణించబడినది. నిర్గుణ, నిరాకార, అవ్యక్త పరబ్రహ్మము. సద్గుణ, సాకార, వ్యక్త పరమేశ్వరుడు లేదా పరమాత్ముడు.

14. పరబ్రహ్మము ఒక్కటే, రెండు కానిది.

15. పరమాత్ముడు, ఆత్మలు (పరమాత్ముని అంశలు) మరియు

మహామాయ లేదా ప్రకృతి (పరమాత్మని శక్తి) మూడు శాశ్వతమైన తత్వములు.

16. ఆత్మలు మరియు మహామాయ (ప్రకృతి) పరమాత్మని నియంత్రణలో ఉన్నవి.

17. పరమాత్ముడు సత్ - చిత్ - ఆనంద స్వరూపుడు. పరమాత్ముడు నిత్యమైన, అనంతమైన, సంపూర్ణ, దైవ సద్గుణములు, శక్తులు కలవాడు.

18. పరమాత్మని ఒకేఒక్క సంకల్పముతో అనంతకోటి విశ్వములు సృష్టింపబడినవి.

19. **'ఓం'** పరబ్రహ్మ స్వరూపము. వేదముల తల్లి మరియు సృష్టి యొక్క ప్రారంభ సమయమున వెల్లడైనది.

20. పరమాత్మలో ఈ విశ్వములన్నీ ఉన్నవి. పరమాత్ముడు విశ్వమంతటా సమత్వముగా వ్యాపించి ఉన్నాడు. పరమాత్మని వేరుగా ఈ సృష్టిలో ఏమియూ లేదు. పరమాత్ముడు ఆత్మ (జీవాత్మ) లోపల పరమాత్ముడు నివసిస్తున్నాడు. అన్ని జీవులూ పరమాత్మని పరిణామములే పరమాత్మని అన్ని జీవులలోనూ, అన్ని ప్రదేశములలోనూ భావించి, చూడవలెను.

21. పరమాత్మని ఏమియూ కోరనక్కరలేదు. ఆయనకు ఎవరకు, ఏమి, ఎంత, ఎప్పుడు ఇవ్వవలేనో తెలుసును.

22. పరమాత్మని వర్ణన, అవగాహన మానవాతీతము. పరమాత్మని కృపతో, పరమాత్మని అనుభవము గల గురువు ద్వారానే, పరమాత్మని తెలుసుకోవచ్చును.

## పరమానందము

22. ఆనందము అనేక విధములుగా వర్ణింపబడినది (తైత్తిరీయోప నిషత్ 2 : 7 : 1; 2 : 8 : 1). వాటిలో (ఎ) మాయానందము (ప్రాపంచిక ఆనందము): ఇది మహామాయ నుండి ఉద్భవించినది, అధమమైనది. ఇది పరిమితము, తాత్కాలికము, అనిత్యము. అంతములో దుఃఖమునకు దారితీయును. జీవులందరికీ (ఋషులు, మునులు మినహాయించి) ఇదే అనుభవములో ఉన్నది. (బి) పరమానందము: పరమాత్ముడు పరమానంద స్వరూపుడు. ఇది అత్యంత ఉత్కృష్టమైనది. ఇది అపరిమితము, శాశ్వతము, నిత్యము.

23. ప్రతి జీవి మరొక జీవి మధ్య వ్యత్యాసము, భేదము ఉన్నది. కాని ప్రతి జీవి, ప్రతి క్షణము ఆనందము (లక్ష్యము ఒక్కటే) పొందుటకే ఆశిస్తుంది. కాని చివరకు దుఃఖమే మిగిలుతుంది.

24. ప్రతి జీవిలోనూ, తనలోనే, ఆనందము (పరమాత్ముడు) ఉన్నది. కాని ప్రతి జీవి ఆనందము కొఱకు బయట (ప్రపంచములో) వెతుకుతాడు.

25. మానవులు ఆనందము (పరమానందము) పొందుటకు అసంఖ్యాకమైన జీవితములను గడిపారు. కాని వారు పొందుతున్నది తాత్కాలికమైన ప్రాపంచిక ఆనందమే. పరమానందము పొందలేదు.

26. మానవులు పరమానందములోనే (పరమాత్మునిలోనే) జీవిస్తున్నారు. వారి అజ్ఞానము కారణముతో పరమానందము పొందలేకపోతున్నారు.

27. అనంతమైన, శాశ్వతమైన పరమానందము పొందుటకు ప్రపంచమునుండి వేరుపడి, పరమాత్మునితో సంబంధము ఏర్పరచుకొనవలెను.

## ఆత్మ లేదా జీవాత్మ

28. ఆత్మ లేదా జీవాత్మ పరమాత్ముడే లేదా పరమాత్ముని అంశము లేదా పరమాత్ముని ప్రతిబింబము. జీవాత్మ విశ్వమంతకూ కేంద్ర స్థానము. బుద్ధి, మనస్సు, శరీరమునకు చైతన్యమిచ్చునది జీవాత్మే.

29. ప్రతివారికీ వారి బుద్ధి, మనస్సు, శరీరము (మహామాయ నుండి ఉద్భవించినవి) గురించి తెలుసును. వీటిగురించే పట్టించుకుంటారు. కాని అజ్ఞానముచే వాటిని చతన్యము చేయుచున్న, మూలమైన జీవాత్మ గురించి ఎవ్వరూ పట్టించుకోరు.

30. జీవాత్మ పరమాత్ముని (పరమానందము) అంశము. తెలిసో లేక తెలియకో ప్రతి జీవాత్మ, ప్రతి క్షణము, తన మూలమైన పరమానందమే కోరుకుంటారు.

31. ఎవ్వరైనా (నాస్తికులము, దేముడిని నమ్మము అనేవారుకూడా) ప్రతి క్షణము ఆధ్యాత్మికులే. అందరూ ఆనందము, ప్రేమ మరియు శాంతి కోరుకుంటారు. ఇవి పరమాత్ముని లక్షణములు, సద్గుణములు అనగా దేముడినే కోరుకుంటున్నారు.

32. జీవాత్మలు అవిద్య (అజ్ఞానము) కారణముగా తమ స్వాభావిక సత్యము (పరమాత్ముని అంశము, ప్రతిబింబము) గుర్తించలేక మహామాయ యొక్క (ప్రాపంచిక) ఆకర్షణలకు వశమై

స్వయముగా మహామాయ బానిసత్వమును స్వీకరించినవి.

33. జీవాత్మ మహామాయచే ఆకర్షింపబడినదై మహామాయ వైపు తిరిగిఉండి పరమాత్మునకు విముఖత అయినది. జీవాత్మ లక్ష్యము (పరమానందము, మోక్షము) పొందుటకు పరమాత్ముని వైపు తిరగవలసి ఉన్నది.

34. ప్రకాశము రాగానే అంధకారము పోవునట్లు, పరమాత్ముని అనుభవము కలుగగానే మహామాయ బానిసత్వము నుండి విముక్తి కలుగును.

35. పరమాత్ముడు కావాలి అని అనుకున్నవారికి పరమాత్ముడు దగ్గర కంటే దగ్గరలో (జీవాత్మలోనే) ఉన్నాడు. వద్దనుకున్న వారికి దూరము కంటే దూరములో (పరలోకములో) ఉంటాడు.

36. జీవాత్మ పరమాత్ముని అంశము (పరమాత్మే, పరమానందమే) అగుటచే ప్రపంచమునుండి పొందే ఆనందముతో తృప్తి పొందలేదు. అందుచే ఎప్పుడూ అసంతృప్తితోనే ఉంటుంది.

37. పరమాత్ముడు జీవాత్మకు కర్మలు (పనులు) చేయుటకు చైతన్య శక్తి ప్రసాదించినాడు. ఏమి చేయవలెనో లేదా చేయకూడదో నిర్ణయము చేయుటకు జీవాత్మకు స్వాతంత్రయము ఇచ్చినాడు. జీవాత్మ తన నిర్ణయముల ప్రకారము కర్మలు (పనులు) చేయును కాబట్టి జీవాత్మ చేసే కర్మలకు జీవాత్మే దాని కర్మఫలములు అనుభవించవలసి ఉన్నది.

38. జీవాత్మ చేసే కర్మలు (హిందూ ధర్మ పవిత్ర గ్రంధములలో

నిర్దేసింపబడిన సత్కర్మలు) పరమాత్మని కోసము చేసినచో వాటి కర్మఫలములు జీవాత్మకు అంటవు. లేనిచో ఆ కర్మఫలములు జీవాత్మే అనుభవించవలెను.

## మహామాయ లేదా ప్రకృతి (పరమాత్మని శక్తి)

39. మహామాయ (ప్రకృతి) పరమాత్మని అనంతమైన శక్తి. మహామాయపై పరమాత్మనికి సంపూర్ణ నియంత్రణ ఉన్నది.

40. పరమాత్మని ఒకేఒక్క సంకల్పముతో మహామాయ పరిణామము చెంది ఈ విశ్వముగా సృష్టింపబడినది.

41. సత్వ గుణము (వివేకము), రజో గుణము (భావోద్వేగములు), తమో గుణము (అజ్ఞానము, హింస) మహామాయ యొక్క రీతులు.

42. జీవాత్మలు మహామాయ యొక్క (ప్రాపంచిక) ఆకర్షణలకు వశమై స్వయముగా మహామాయ బానిసత్వమును స్వీకరించి, మహామాయ వైపు తిరిగిఉండి పరమాత్మనకు విముఖత అయినది.

43. పరమాత్మనికి మరియు జీవాత్మకి మధ్య మహామాయ గోడలా అడ్డుగా ఉన్నది. మహామాయ ఎల్లప్పుడూ ఎండమావి సృష్టించి సత్యమును (పరమాత్మని) అసత్యముగా, అసత్యమును (ప్రపంచమును) సత్యముగా భ్రమింపచేయును.

44. ప్రతి జీవిలోనూ సత్వ గుణము, రజో గుణము మరియు తమో గుణము లక్షణముల మిశ్రమములు ఉన్నవి.

45. అహంకారము, చిత్తము, బుద్ధి, మనస్సు, ఇంద్రియములు (5 జ్ఞానేంద్రియములు, 5 కర్మేంద్రియములు) మహామాయ

పరిణామములు. వీటి కోరికలను సంతృప్తి పరచుటకు జీవాత్మ, మహామాయ యొక్క భౌతిక, ప్రాపంచిక ఆనందములకు ఆకర్షింపబడి, పరమాత్మునికి దూరమైనది.

46. ఈ ప్రపంచములోని బాధలకు కోరికలే మూల కారణము.

47. మనస్సు, ఇంద్రియముల ద్వారా ప్రాపంచిక విషయములు గ్రహించి, అజ్ఞానముతో వాటిని అనుభవించుటకు కోరికలు మనస్సులో ఉదయించును.

48. కోరికలు నెరవేరితే సుఖము, ఆనందము, అహంకారము, రాగము, లోభము, మోహము, మాత్సర్యము యేర్పడును.

49. కోరికలు నెరవేరకపోతే దుఃఖము, బాధ, ద్వేషము, క్రోధము, మదము ఏర్పడి బుద్ధి నాశనము జరుగును. వీటన్నిటికి మూల కారణము ప్రాపంచిక సంబంధమే.

50. త్యాగ బుద్ధితో దానము (కీర్తి లేదా పేరు కోసము కాకుండా) చేసినచో కోరిక, అహంకారము, కోపము, లోభము, మోహము, మదము, మాత్సర్యము, అను అరిషడ్వర్గములను నియంత్రించవచ్చును.

51. ఈ సృష్టిలో ఉన్నదంతా పరమాత్మునిదే. ఆఖరకు ఈ శరీరముకూడా పరమాత్మునిదే. ఎవ్వరూ వారి శరీరమును సృష్టించలేదు లేదా తయారుచేసుకోలేదు లేదా ఎంపికచేసికోలేదు. ముందుగా తయారుచేయబడ్డ శరీరములో జీవాత్మ దూరినది. జీవాత్మ యొక్క చైతన్యము, శక్తి కూడా పరమాత్మునిదే. కాబట్టి ఎవ్వరూ పరమాత్మునికి ఏ దానము, బహుమానము చేయలేరు. పరమాత్మునికి ఈ ప్రాపంచిక దానముల అవసరము లేదు.

52. ఎవ్వరైనా పరమాత్మకు ఇవ్వగలిగినది, సమర్పించగలిగినది ఒక్కటే. అదే తమ ఆత్మ సమర్పణ.

53. మహామాయ యొక్క అజ్ఞానము ఐదు రూపములు: (ఎ) తమస్: "నేను" (జీవాత్మ) గురించి అజ్ఞానము, (బి) మోహము: నేను (జీవాత్మ) శరీరముతో తాదాత్మ్యముచెంది శరీరముమే నేను అనే భావన, (సి) మహామోహము: శరీరమునకు ప్రపంచపు ఆనందముల కోసము తృష్ణ, (డి) తమసిరము: కోపము (ఇ) అంధతమసిరము: మరణముతో తన (జీవాత్మ) అంతము అవుతుందనే భావన.

54. జనన, మరణ, పునర్జన్మలకు కారణము అజ్ఞానము. అజ్ఞానమును అధిగమించుటకు, హిందూ ధర్మ పవిత్ర గ్రంథములలోని జ్ఞానము (పరమానంద స్వరూపుడైన పరమాత్ముని గురించి) పొందవలెను.

55. అహంకారము (ఆత్మే శరీరము అనే భావన) మహామాయ యొక్క పరిణామము. ఎవరైతే అహంకారమును అతిక్రమించుదురో, వారు మహామాయ బానిసత్వము నుండి విముక్తి పొంది, వారికి ఆత్మ జ్ఞానము కలుగును.

## మనస్సు

56. మనస్సు మహామాయ యొక్క పరిణామము. మనస్సు మంచి సేవకుడు, కాని చాలా చెడ్డ యజమాని.

57. అన్ని చెడ్డ గుణములకు, కోరిక, కోపము, లోభము, మోహము, మదము, మాత్సర్యము మొదలైనవి, మనస్సే కారణము.

58. మనస్సు ఎల్లప్పుడూ నిలకడలేనిది, నమ్మదగనిది, విశ్వసించలేనిది, సందిగ్ధమైనది, చంచలమైనది. మనస్సును నియంత్రించుట చాలా కష్టము.

59. నీవు నీ మనస్సును నా మీద స్థిరముగా నిలుపలేకున్న, అప్పుడు నన్ను పొందుటకు యోగసాధన మరల, మరల చేయుము (భగవద్గీత 12 : 9). అదికూడా నీవు చేయలేని యడల, నీ మనస్సును మెత్తబరుచుచూ కర్మఫలములను విడిచిపెట్టుము (11). అభ్యాసము కంటె జ్ఞానము, జ్ఞానము కంటె ధ్యానము, ధ్యానము కంటె కర్మఫల త్యాగము గొప్పవి. త్యాగాముచే మానవుడు మనస్సు శాంతి పొందును (12). ఏ భక్తులు పైన వివరించిన ధర్మామృతము ననుసరించుచు, శ్రద్ధతో నన్నే పరమ గమ్యముగా చేసికొని నాయందే నీ మనస్సును నాకర్పించి, నన్ను భక్తితో పూజించి, నాపై నిమగ్నులై యుండెదరో వారు నాకత్యంత ప్రియులు (20).

60. నీ మనస్సును నాకర్పించి, నన్ను భక్తితో పూజించి, నాకు నమస్కరించిన, నీవు తప్పక నన్ను పొందుదువు. ఇది నీకు వాగ్దానము చేయుచున్నాను (భగవద్గీత 18 : 65).

61. జ్ఞాన యోగము, భక్తి యోగము ద్వారా మనస్సును నియంత్రించ వచ్చును. ఎవరైతే మనస్సును నియంత్రించగలరో వారు సత్పురుషులు, ఋషి, ముని అవుదురు.

62. ఎవరైతే అహంకారము, మనస్సు, ఇంద్రియములను నియంత్రించగలరో వారికి బ్రహ్మానుభూతి కలుగును.

63. మనస్సును పరమాత్మునిపై కేంద్రీకరించి, నిష్కామ

(ఫలితములు ఆశించకుండా) కర్మలు చేసి పరమాత్మునికి అర్పించేదరో వారికి కర్మఫలితములు అంటవు.

64. మనస్సులో నింపుకున్న అహంకారము, ఆలోచనలు, కోరికలను ఖాళీ చేసినచో, పరమాత్ముడు స్థిరముగా ఉండుటకు చోటు దొరకును.

65. అహంకారము, ఆత్మవంచన, ఇతర దుర్గుణములను ప్రక్కనపెట్టి, సద్గుణములైన నీతి, నిజాయితి, అహింస, ప్రేమ, విశ్వాసము మరియు పరిశుభ్రతలను పెంపొందిచుకొనవలెను.

66. సద్గుణములు మూలములు: (ఎ) విద్య (జ్ఞానము), (బి) దానము (దయ, ప్రేమ, కరుణతో), (సి) తపస్సు (పరమాత్ముని కోసము తపించుట), (డి) సత్యము.

67. ప్రేమ, కరుణ, వినయము, నీతి, నిజాయితి, స్వీయ నియంత్రణ, త్యాగము మరియు క్షమ అత్యధిక సద్గుణములు.

## యోగము (ధ్యానము)

68. పరమాత్ముడు జ్ఞాన రూపములో ఉన్నారు.

69. యోగము (ధ్యానము) ద్వారా మనస్సు శుద్ధి అయి, పరమాత్ముని వైపు మరలుతుంది.

70. కర్మ, జ్ఞాన, భక్తి యోగముల ద్వారా, జీవాత్మలో దాగిఉన్న దివ్య శక్తి వ్యక్తమగును.

71. కర్మ యోగము (కర్మలు చేయుటకు సరైన విధానము) శరీరముతో ప్రాపంచిక విధులను నిర్వహిస్తూ, మనస్సును పరమాత్మునిపై లగ్నము చేయుట.

72. అహంకారము యొక్క ప్రభావముచే జీవాత్మ ప్రకృతి యొక్క గుణములచే చేయబడిన కర్మలకు తానే కర్తనని భావించును (భగవద్గీత 3 : 27).

73. నీకు విధింపబడిన కర్మలు ఆసక్తిలేనివాడవై, అర్పితభావముతో చక్కగా చేయుము (భగవద్గీత 3 : 9).

74. మానవుల గుణములు మరియు కర్మలు అనుసరించి నాలుగువిధముల వర్ణములు (బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు) నాచే సృష్టింపబడినవి (భగవద్గీత 4 : 13).

75. బ్రాహ్మణ (జ్ఞానము, శాంతి, సహనము, తపస్సు, ఆత్మ నిగ్రహము, ధర్మ ప్రవర్తన), క్షత్రియ (శక్తి, శౌర్యము, ధైర్యము, నాయకత్వము, ధృడనిశ్చయము) వైశ్య (వ్యవసాయము, గోరక్షణ, వర్తకము), శూద్రుల (పరిశ్రమ, పరసేవ) విధులు ప్రకృతిపరమైన గుణములు, వారిచేసే కర్మలననుసరించి విభజింపబడుచున్నవి (భగవద్గీత 18 : 41 నుండి 44).

76. తమ కర్మల నన్నింటిని నాయందు విడిచి, అన్యచింతలేక నాయందలి భక్తియుక్త సేవలో నిమగ్నమగుచు, తమ మనస్సును నాయందే స్థిరీకరించి, నన్నే ఎల్లప్పుడూ ధ్యానించువారిని జనన, మరణ, సంసార సముద్రము నుండి త్వరలో రక్షింతును (భగవద్గీత 12: 6, 7).

77. మనస్సును, శరీరమును నిగ్రహించుకొని, ప్రాపంచిక విషయములను విడిచిపెట్టి, దేహమునకు ముఖ్యమైన కర్మలు చేయునతనుకు పాపఫలములు అంటవు (భగవద్గీత 4 : 21).

78. ఎవరైతే తనకు లభించినదానితో తృప్తిపొందునో,

అసూయారహితుడు, ద్వంద్వములకు (కష్టసుఖాలు, లాభనష్టములు, జయాపజయములు) అతీతుడో వారు కర్మలు చేయుచున్నప్పటికీ వాటిచే బద్ధుడుకారు (భగవద్గీత 4 : 22).

79. ఎవరైతే ఆసక్తిరహితుడై, దేహాత్మబంధములు లేనివాడై, కర్తృత్వభావరహితుడై, జ్ఞానావస్థలో ఉన్నవాడై, పరమాత్మునికి అర్పితభావముతో కర్మలను చేయువాని కర్మలు కరిగిపోవును (భగవద్గీత 4 : 23).

80. కర్మ యోగము జ్ఞాన యోగము మరియు భక్తి యోగములకు దారితీసి, అంతములో మోక్షము (జనన, మరణ, పునర్జన్మ చక్రము నుండి విముక్తి) పొందవచ్చును.

81. జ్ఞానము జనన, మరణ, పునర్జన్మలకు కారణమైన అజ్ఞానమును నిర్మూలించి పరమాత్మానుభూతిని కలిగించును. జ్ఞాన, భక్తి యోగములు రజో గుణము మరియు తమో గుణములను నాశనము చేయును. అన్ని సమస్యలకు కారణమైన అహంకారమును, కోరికలను నాశనము చేయును.

82. జ్ఞాన, భక్తి యోగములు రజో గుణము మరియు తమో గుణములను నాశనము చేయును. అన్ని సమస్యలకు కారణమైన అహంకారమును కోరికలను నాశనము చేయును.

83. పరమాత్మునిపై భక్తి అత్యంత శాంతి, పరవశము, ఆనందములకు ప్రతిరూపము.

84. జ్ఞానము, భక్తి ఒకే నాణెమునకు రెండు పక్కలు.

85. జ్ఞాని, భక్తుడు ఈ ప్రపంచములో ప్రతిదానిని పరమాత్మునిగానే భావిస్తారు. జ్ఞానము, భక్తి లేనిచో మోక్షము లేదు.

86. ఎప్పుడైతే ఆధ్యాత్మిక కళ్ళు తెరుచుకుంటాయో, అప్పుడు భౌతిక కళ్ళు మూసుకుంటాయి.

87. భక్తి అనగా భక్తుడు తనని తాను, తను చేసే ప్రతి పనిని పరమాత్మునికి అర్పించును, ఆయనను అన్ని సమయములలోనూ మర్చిపోకుండా ఉండును.

88. ఎవరైతే తమకు తాము పరమాత్మునికి సమర్పించుకుంటారో, వారికి పరమాత్ముని కృప ఎల్లప్పుడూ ఉండును.

89. ఈ మానవ జీవితములో పరమాత్ముని గురించి తెలుసుకోలేదంటే, ఈ జన్మ తీరని లేదా తిరుగులేని నష్టము.

90. భక్తి సూక్ష్మ స్మృతిలో పరిణామము చెందును. భక్తునికి ప్రాపంచిక వస్తువులు, ప్రాపంచిక కోరికలతో సంబంధములేదు.

91. భక్తులలో వర్ణము, వంశము, విద్యాభ్యాసము, ఐశ్వర్యము, హెూదా, శక్తి, బలము, శారీరపు అందములతో తేడాలు ఉండవు.

**మానవ సేవయే మాధవ సేవ**.

92. **"నేను నా భక్తుల సేవకుడను. నా ప్రియభక్తులు ఆరాధనాభావతో నా హృదయమును సంపూర్ణముగా దోచుకొనబడ్డ వాడనయి, నేను స్వ్రతంత్రుడనుకాను, వారి భక్తి ఆధీనములో ఉంటాను"** (భాగవతము 9 : 4 : 63).

93. **"నా స్వంత కుమారుడు, పరమపిత బ్రహ్మ; నా స్వంత దైవ వ్యక్తిత్వము (పరమశివుడు), నా సోదరుడు (బలరాముడు), నా పత్ని మహాలక్ష్మీదేవి, నా అంతట నేను**

**(శ్రీకృష్ణ) కంటె నా భక్తుడే నాకు అత్యంత ప్రియమైనవాడు (భాగవతము** 11 : 14 : 15).

94. **"నా భక్తుల పాదముల ధూళితో పరిశుద్ధము అగుటకు, నేను నా భక్తులను అనుసరిస్తాను"** (భాగవతము 11 : 14 : 16).

95. పరమాత్ముడు కురిపించిన కృపతో, భక్తుడు కర్మలను విసర్జిస్తాడు (భాగవతము 4 : 29 : 46).

96. ఆధ్యాత్మికత ద్వారా జీవాత్మ ఇంద్రియ భోగములనుండి ఆత్మజ్ఞానమునకు పరిణామము చెందును.

97. బ్రహ్మజ్ఞాన దశలో అవిద్య (అజ్ఞానము) అదృశ్యమయి, జీవాత్మ పరమానంద స్థిలో ఉంటుంది.

98. మోక్షము జీవాత్మ యొక్క అంతమ లక్ష్యము. జీవితము యొక్క పవిత్ర ప్రయాణము.

99. **“ఓం మహా గణాధిపతియే నమః".**

100. **"ఓం ఐం హ్రీం శ్రీం శ్రీ మాత్రేయ నమః".**

101. **"ఓం నమః శివాయ".**

102. **"ఓం నమో నారాయణాయ".**

103. **"ఓం నమో భగవతే వాసుదేవాయ".**

104. **“ఓం శ్రీ వేంకటేశ్వరాయ నమః”.**

105. **"ఓం శివాయ విష్ణు రూపాయ, శివ రూపాయ విష్ణవే; శివస్య హృదయం విష్ణు, విష్ణోశ్చ హృదయం శివః"** (పద్మ పురాణము).

106. **"శ్రీరామ రామ రామేతి రమే రామే మనో రమే సహస్ర నామ తత్తుల్యం రామ నామ వరాననే".**

107. **"హరే రామ హరే రామ, రామ రామ హరే హరే; హరే కృష్ణ హరే కృష్ణ, కృష్ణ కృష్ణ హరే హరే".**

108. ఏ తత్ ఫలం సర్వం శ్రీ పరమేశ్వరార్పణ మస్తు.



# పదపట్టిక

75. హిందూ మతములో స్త్రీలు: పేజి సంఖ్యలు 76, 787.

76. హిందువుల ఆచారములు: పేజి సంఖ్య 89, 90.

77. హిందువుల ఆహారము: పేజి సంఖ్యలు 83 నుండి 86 వరకు.

78. హిందువుల పండుగలు, ఉత్సవములు: పేజి సంఖ్యలు 92 నుండి 97 వరకు.

# సమీక్షలు

1. ఈ పుస్తక రచయిత హిందూ ధర్మ పవిత్ర గ్రందముల సూచనలు చక్కగా పేర్కొన్నారు. హిందూ ధర్మము అన్ని అంశములనూ కూర్పబడిన ఒక అద్భుతమైన సంకలన పుస్తకము.

**శ్రీ వి.సి. చంద్రశేఖరన్, తత్వవేత్త మరియు సోషలిస్ట్, టి 'నగర్, చెన్నై.**

2. ఈ పుస్తకము హిందూ ధర్మము యొక్క సరియైన సారాంశము.

**శ్రీ బి.పి. రెడ్డి, దివ్యజ్ఞాన సమాజము, సికింద్రాబాద్.**

3. యువతరమునక హిందూ ధర్మము యొక్క సరియైన అవగాహనకు ఒక అద్భుతమైన పుస్తకము.

**శ్రీ బి. కళ్యాణ రామ్, కంప్యూటర్వృత్తి నిపుణుడు, బెంగుళూర్.**

4. హిందూ ధర్మము గురించి అన్ని విషయములనూ సంగ్రమముగా కూర్చిన ఒక అద్భుతమైన పుస్తకము. ఈ పుస్తకము చదివిన తరువాత హిందూ ధర్మము గురించి నా దురభిప్రాయములు పోయి, చక్కటి అవగాహన కలిగినది.

**శ్రీ విజయ కృష్ణ, మైక్రోసాఫ్ట్ కార్పొరేషన్, రెడ్మండ్, USA.**

5. ఈ పుస్తకము చదివిన తరువాత నేను హిందూ ధర్మములో పూర్వము స్త్రీలకు (తల్లి, సోదరి, భార్య, కుమార్తె) అత్యంత ప్రాముఖ్యత ఇచ్చేవారని అర్థమైనది. అటువంటి సమాజము ఏర్పడాలని కోరుకొంటున్నాను.

**శ్రీమతి సి. గీతా, గృహిణి, హైదరాబాద్.**

6. ఈ రోజులలో ఎవ్వరూ అర్థము చేసుకోలేని క్లిష్టమైన భారీ హిందూ ధర్మ పవిత్ర గ్రంథముల సంకలనము చక్కగా వ్రాయబడినది. హిందూ ధర్మము గురించి అన్ని అంశములను సంక్షిప్తముగా వివరించి, అందరూ అర్థము చేసుకోగల సాధారణ భాషలో అద్భుతముగా వ్రాయబడిన సంకలన పుస్తకము.

**శ్రీమతి సి. కామేశ్వరీ దేవి, ఆంధ్ర ప్రదేశ్ ఏ. జి ఆఫీసు, హైదరాబాద్**

7. హిందూ ధర్మము మీద ఒక అద్భుతమైన పుస్తకము.

**శ్రీ బి. శ్రీనివాస్, శ్రీ రామకృష్ణ మఠము, బెంగుళూర్**

8. హిందూ ధర్మము మీద ప్రశస్తమైన సంకలన పుస్తకము. వాస్తవములు మరియు హిందూ ధర్మము మీద నిజమైన విశ్లేషణ ఇవ్వబడినది.

**శ్రీ టి. నాగేశ్వరరావు, పారిశ్రామికవేత్త, సికింద్రాబాద్**

9. హిందూ ధర్మము కేవలమూ హిందువులకే కాదు. మొత్తము మానవులందరికీ వర్తిస్తుంది. యువతరము ఈ పుస్తకమును చదివి తీరాలి.

**శ్రీ బి. మల్లికార్జున శర్మ, FANUC, IT, బెంగుళూర్**

10. హిందూ ధర్మము మీద ఒక సమగ్రమైన పుస్తకము.

**శ్రీ సి. నారాయణ రావు, A. P. పారిశ్రామిక ఫైనాన్స్ కార్పొరేషన్, హైదరాబాద్.**